గ—జేర్), కోయభాషలో—ఓర్ (ం—సోర్ ం—చోర్ గ—జోర్).

| గోండి | కోయ | |
|---|---|---|
| మూడ్—సేర్ | ఊడ్—ఓర్ | 'చూస్తూ' |
| వా—సేర్ | వా—సోర్ | 'వస్తూ' |
| తచ్—చేర్ | తచ్—చోర్ | 'తెస్తూ' |
| ఉణ్—జేర్ | ఉణ్—జోర్ | 'తాగుతూ' |

తద్ధర్మవిశేషణం. దీనికిగోండిలో ప్రత్యయం—వాల్ (ఇది ఁల రూపాలు నామవాచకాలుగా కూడా ఉండగలవు) వెహ్—వాల్ 'చెప్పే (వాడు/ది)', సొన్—వాల్ 'వెళ్ళే(వాడు/ది)'. కోయభాషలో ఇది—అన్—అనే తద్ధర్మప్రత్యయం, దాని తరవాత—అ అనే విశేషణప్రత్యయం ధాతువుకి చేర్చడంవల్ల ఏర్పడుతుంది. ఊడ్—అన్—అ 'చూసే', ఉడ్ద్—అన్—అ 'దున్నే', కెత్—అన్—అ 'చెప్పే'.

9. కొండ. వర్తమానకాలం. దీనికి ప్రత్యయం—పిన్ (—జిన్—).

కి—'చేయు'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| ఉ. | కి—జిన్—అ | కి—జిన్—అప్ |
| మ. | కి—జిన్—ఇ(ద్) | కి—జిన్—దెర్ |
| ప్ర. మహత్ | కి—జిన్—అన్ | కి—జిన్—అర్ |
| అమహత్ | కి—జిన్—అద్ | కి—జిన్—ఎ |

భవిష్యత్‌కాలం. దీనికి ప్రత్యయం—న్—

వా—'వచ్చు'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| ఉ. | వా—న్—అ | వా—న్—అప్ |
| మ. | వా—న్—ఇ(ద్) | వా—న్—ఇదెర్ |
| ప్ర. మహత్ | వా—న్—అన్ | వా—న్—అర్ |
| అమహత్ | వా—న్—అద్ | వా—న్—ఎ |

ఇదికాక యీ ప్రత్యయం 'వా—న్—ఇ', 'వచ్చేలోపున,' డిగ్—న్—ఇజ 'దిగితే (దిగు)', వా—న్—ఎండ 'వచ్చేదాకా'—ఇటువంటి రూపాలలోకూడా ఉంది.

తద్ధర్మ విశేషణం. ఇది ధాతువుకి భవిష్యత్ ప్రత్యయంచేర్చి విశేషణ ప్రత్యయమైన ఇ కారం ఆ తరవాత చేర్చడంవల్ల ఏర్పడుతుంది.

| | |
|---|---|
| డూ—న్—ఇ | 'దున్నే' |
| గూర్—న్—ఇ | 'నిద్రపోయే' |

ఇవికాక యీ భాషలో —పు—(ం—బు) ప్రత్యయం చేర్చడంవల్ల ఏర్పడే అసమాపకక్రియలు కూడా ఉన్నాయి.

| | |
|---|---|
| కెరె—పు | '(కోడి) కూస్తుండగా' |
| మన్—బు | 'ఉండగా' |

10. కూయి. వర్తమానకాలం. ఇది శత్రర్థకానికి మన్ 'ఉండు' అనే క్రియ భవిష్యత్ కాలరూపాలు చేర్చడంవల్ల ఏర్పడుతుంది.

| | | |
|---|---|---|
| తాక్—అ ఇ | మ—ఇ | 'నడుస్తున్నాను' |
| డేస్—పి | మ—న్—అము | 'కట్టుతున్నాము' |

భవిష్యత్‌కాలం. దీనికి ప్రత్యయం —న్— (—ɾ/ɔ—, —ది—); —ద్— మధ్యమ పురుష ప్రత్యయాలముందు, —న్— మిగిలిన పురుష ప్రత్యయాలముందు వస్తాయి. ఉత్తమ పురుషైక వచన ప్రత్యయంముందు ఇది లోపిస్తుంది

కో— 'కోయు'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| ఉ. | కో—ɾ/ɔ—ఇ | కో—న్—అము<br>కో—న్—అసు (ఉభయం) |
| మ. | కో—ద్—ఇ | కో—ద్—ఎరు |
| ప్ర మహత్ | కో—న్—ఎంజు | కో—న్—ఎరు |
| అమహత్ | కో—న్—ఎ | కో—న్—ఉ |

శత్రర్థకం. దీనికి ప్రత్యయం —పి(—బి—, —జి, —అఇ, —కి).

| | | | |
|---|---|---|---|
| పాన్—కి | 'ఎగురుతూ' | గ్రాన్—అఇ | 'నేర్పుతూ' |
| డిన్—కి | 'పడుతూ' | తిం—జి | 'తింటూ' |
| డేస్—పి | 'కట్టుతూ' | | |

తద్ధర్మ విశేషణం. ఇది ధాతువుకి భవిష్యత్ ప్రత్యయమైన —ఇన్-(—న్—)-చేర్చి దానికి విశేషణప్రత్యయమైన ఇ కారం చేర్చడంవల్ల ఏర్పడుతుంది.

లాక్—ఇన్—ఇ 'బలిఇచ్చే' కో—న్—ఇ 'కోసే'
నాగ్—న్—ఇ 'కడిగే' తి—న్—ఇ 'తినే'

11. కువి. వర్తమానకాలం. ఇది కూయి లోకి మల్లేనే ఏర్పడుతుంది.

| | | |
|---|---|---|
| తోన్—సి | మ'—ఇ | 'చూపించుతున్నాను' |
| వె—చి | మ'—ఇ | 'కొడుతున్నాను' |

భవిష్యత్కాలం. దీనికి ప్రత్యయం —న్— (—?—ద్—) వీటి పరిసర నిర్ణయం కూయిలోకి మల్లేనే.

హీ—'ఇచ్చు'

| | ఏ. వ. | బ. వ: |
|---|---|---|
| ఉ. | హీ—?—ఇ'ఇ | హీ—న్—ఒ(మి) |
| మ. | హీ—ద్—ఇ | హీ—ద్—ఎరి |
| ప్ర.మహత్ | హీ—న్—ఎసి | హీ—న్—ఎరి |
| అమహత్ | హీ—న్—ఇ | హీ—న్—ఉ |

శత్రర్థకం. ఇది ధాతువుకి —ఇ(-హి,—సి,—చి,—జి) చేర్చటంవల్ల ఏర్పడుతుంది.

పాయ్—ఇ 'కొడుతూ' వె—చి 'కొడుతూ'
హీ—హి 'ఇస్తూ' డిక్—హి 'పగలగొట్టుతూ'
తోన్—సి 'చూపెడుతూ' వెం—జి 'వింటూ'

తద్ధర్మ విశేషణం. ఇది ధాతువుకి భవిష్యత్ ప్రత్యయమైన —ఇన్—చేర్చి, దానికి విశేషణ ప్రత్యయమైన ఇకారం చేర్చడంవల్ల ఏర్పడుతుంది.
పాయ్—ఇన్—ఇ 'కొట్టే' తోన్—ఇన్—ఇ 'చూపెట్టే'
హీయ్—ఇన్—ఇ 'ఇచ్చే'

12. కోలామీ. వర్తమానకాలం. దీనికి ప్రత్యయం —న్— (—ద్—,—ఉన్); —ద్— ఉత్తమ పురుష ప్రత్యయాలముందూ, -ఉన్ అమహ దేకవచన ప్రత్యయం ముందూ (ఇది ఉగా సందర్భంలో లోపిస్తుంది) న్—మిగిలిన చోట్లా వస్తాయి.

సి—'ఇచ్చు'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| ఉ. | సీ—ద్—ఉన్ | సీ—ద్—ఉమ్ |
| మ. | సీ—న్—ఇవ్ | సీ—న్—ఇర్ |
| ప్ర. మహత్ | సీ—న్—ఎన్ | సీ—న్—ఎర్ |
| అమహత్ | సీ—ఉన్—?/ | సి—న్—ఎవ్ |

భవిష్యత్కాలం. దీనికి ప్రత్యయం -ద్— (-దత్—); —దత్— ఉత్తమ, మధ్యమ పురుష ప్రత్యయాలముందూ, —ద్—ప్రథమ పురుష ప్రత్యయాలముందూ వస్తాయి.

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| ఉ. | సీ—దత్—ఉన్ | సీ—దత్—ఉమ్ |
| మ. | సీ—దత్—ఇవ్ | సీ—దత్—ఇర్ |
| ప్ర.మహత్ | సీ—ద్—అన్ | సీ—ద్—అర్ |
| అమహత్ | సీ—ద్—అ(ద్) | సీ—ద్—అవ్ |

దీనిలో దకారం లోపించడంవల్ల ఏర్పడే రూపాలుకూడా వర్తమాన-భవిష్యదర్థంలో ఉన్నాయి.

అదిలాబాదు మాండలికంలో ధాతువుకి—క్— ప్రత్యయంచేర్చి, దానికి ప్రథమ పురుష ప్రత్యయాలు చేర్చడంవల్ల ఏర్పడే రూపాలు ఉన్నాయి. ఉదా.

| | |
|---|---|
| వ—క్క—అంద్ | 'వాడు (వాడిని) రానీ' |
| వ—క్క—అర్ | 'వాళ్ళు రానీ' |
| వ—క్క—అద్ | 'అది (దానిని) రానీ' |
| వ—క్క—అవ్ | 'అవి (వాటిని) రానీ' |

శత్రర్థకం. దీనికి ప్రత్యయం వార్ధా మాండలికంలో—అ, అదిలాబాదు మాండలికంలో—సాన్.

తిన్—అ/తి—సాన్ 'తింటూ'
తూల్—అ/తూ—సాన్ 'పరిగెత్తుతూ'

తద్ధర్మ విశేషణం. ఇది ధాతువుకి—ఎక్—భవిష్యత్

ప్రత్యయం చేర్చి, దానికి విశేషణ ప్రత్యయమైన అ కారం చేర్చడంవల్ల ఏర్పడుతుంది.

తిన్—ఎక్—అ 'తినే'
వర్—ఎక్—అ 'వచ్చే'

13. నాయకీ (చాందా). వర్తమాన కాలం. దీనికి ప్రత్యయం—త్—

అన్— 'ఉండు'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| ఉ. | అన్—త్—అన్ | అన్—త్—అమ్ |
| మ. | అన్—త్—ఇ | అన్—త్—ఇర్ |
| ప్ర. మహత్ | అన్—త్—ఎన్ | అన్—త్—ఎర్ |
| అమహత్ | అన్—త్—ఉన్ | అన్—త్—ఎ |

భవిష్యత్కాలం. దీనికి ప్రత్యయం—అన్(—ద్—(న్))

కక్— 'చేయు'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| ఉ. | కక్—అత్—ఉన్ | కక్—అత్—ఉమ్ |
| మ. | కక్—అత్—ఇ | కక్—అత్—ఇర్ |
| ప్ర.మహత్ | కక్—ద్—అన్ | కక్—ద్—అర్ |
| అమహత్ | కక్—(న్)—అన్ | కక్—ద్—అ |

శత్రర్థకం. దీనికి ప్రత్యయం—తున్.

ఇందుప్—తున్ 'నింపుతూ'
పక్—తున్ 'కొడుతూ'
కక్—తున్ 'చేస్తూ'

14. పర్జీ. వర్తమానకాలం. దీనికి ప్రత్యయం —మ్—.

వెర్—* 'వచ్చు'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| ఉ. | వెర్—మ్—ఎన్ | వెర్—మ్—ఒమ్ |
| మ. | వెర్—మ్—ఒత్ | వెర్—మ్—ఒర్ |
| ప్ర.మహత్ | వెర్—మ్—ఎఓ | వెర్—మ్—ఎర్ |
| అమహత్ | వెర్—మ్—ఓ | వెర్—మ్—ఒవ్ |

కొన్ని క్రియలలో యీ ప్రత్యయం ముందు ధాతువుకి ఉత్తరమాండలికంలో కకారం, దక్షిణ మాండలికంలో పకారం చేరతాయి. ఉదా. పయ్— 'పంచు' : (ఉ) పయుక్—మ్—ఎన్/ (ద) పయుప్ —మ్—ఎన్ 'పంచుతున్నాను'.

భవిష్యత్ కాలం. దీనికి ప్రత్యయం ఉత్తర మాండలికంలో —ర్—, దక్షిణమాండలికంలో— ఇయ్—, కొన్ని క్రియలలో—త్—.

చూడ్— 'చూచు'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| ఉ. | చూడ్—ర్—అన్ | చూడ్—ర్—అమ్ |
| మ. | చూడ్—ర్—అత్ | చూడ్—ర్—అర్ |
| ప్ర.మహత్ | చూడ్—ర్—అద్ | చూడ్—ర్—అర్ |
| అమహత్ | చూడ్—ర్—అ | చూడ్—ర్—అవ్ |

దక్షిణ మాండలికంలో చూడ్—ఇయ్— అన్ మొదలైన రూపాలు ఉంటాయి. పయ్—త్—అన్ 'పంచుతాను' మొదలైన రూపాలలో త కారం, తిన్—ద్—అన్ 'తింటాను' మొదలైన న కారాంత ధాతువులతో వచ్చే రూపాలలో ద కారం ప్రత్యయాలుగా ఉంటాయి.

శత్రర్థకం. (1)—ఒడ్,(2) —ఎక్,(3) ఎమ్ అనే మూడు ప్రత్యయాలు అర్థవిశేషాలతో ఉన్నాయి.

మెన్—ఒడ్ 'ఉండగా'
వెర్—ఒడ్ 'వస్తూ ఉండగా'
వక్వ్—ఎక్ 'కాగుతూ ఉండగా'
అడ్—ఎమ్ 'ఏడ్చేటప్పుడు'

తద్ధర్మ విశేషణం. ఇది ధాతువుకి భవిష్యత్ కాలప్రత్యయం చేర్చి, దానికి విశేషణప్రత్యయమైన —అన్ చేర్చడం వల్ల ఏర్పడుతుంది.

చొక్—ర్—అన్ 'ఎక్కే'
వెన్—ద్—అన్ 'వినే'
వీక్—ఇయ్—అన్ 'చల్లే'

15. గదబ (ఒల్లారీ). వర్తమానకాలం. ఇది ధాతువుకి ఇన్— 'ఉండు' అనే క్రియ భవిష్యత్కాల రూపాలు చేర్చడంవల్ల ఏర్పడుతుంది.

సూడ్ ఇం—ద్—అన్ 'చూస్తున్నాను'

భవిష్యత్ కాలం. దీనికి ప్రత్యయం—ద్—(—త్—) నకారాంత ధాతువులలో నకారం దకారం కలిసి యకారంగా మారతాయి.

వండ్—ద్—అన్ 'వండుతాను'
పే—త్—అన్ 'కనపడతాను'

(తిన్—) తి—య్—అన్ 'తింటాను'

(వెన్—) వె—య్—అన్ 'వింటాను'

శత్రర్థకం. దీనికి ప్రత్యయం— ఇజ్ (ఉజ్)

ఉన్—ఉజ్ 'తాగుతూ'

ఈల్—ఇజ్ 'పడుతూ'

తద్ధర్మ విశేషణం. ఇది ధాతువుకి భవిష్యత్ కాలప్రత్యయం చేర్చి దానికి విశేషణ ప్రత్యయమైన అన్ చేర్చడంవల్ల ఏర్పడుతుంది.

సీ—ద్—అన్ 'ఇచ్చే'

వ—ద్—అన్ 'వచ్చే'

తి—య్—అన్ 'తినే'

16. కూడుఖ్. వర్తమానకాలం. దీనికి ప్రత్యయం-ద్-(౦౦ —న్—);—న్-ప్రథమ పురుష బహువచన ప్రత్యయాలముందూ, —ద్— మిగిలిన పురుష ప్రత్యయాల ముందూ వస్తుంది. స్త్రీల భాషలో —ద్—కి బదులు కంఠమూల స్పర్శం ప్రథమోత్తమ పురుషలలో ఉంటుంది.

ఎస్— 'విరుగగొట్టు'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| ఉ. | ఎస్—ద్—అన్ | ఎస్—ద్—అమ్<br>ఎస్-ద్-అత్ (ఉభయం) |
| మ. | ఎస్—ద్—అయ్ | ఎస్—ద్—అర్ |
| ప్ర.మహత్ | ఎస్—ద్—అస్ | ఎస్.—న్—అర్ |
| అమహత్ | ఇస్—?—ఈ | ఎస్—న్—అయ్ |

భవిష్యత్ కాలం. దీనికి ప్రత్యయం—?ఒ—.

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| ఉ. | ఎస్—? ఒ—న్ | ఎస్—?ఒ—మ్<br>ఎస్-?ఒ-త్(ఉభయం) |
| మ. | ఎస్—?ఒ—య్ | ఎస్—?ఒ—ర్ |
| ప్ర.మహత్ | ఎస్—?ఒ—న్ | ఎస్—?ఒ—ర్ |
| అమహత్ | ఎస్—?ఓ | |

శత్రర్థకం. దీనికి ప్రత్యయం—నూ(తి.)

ఎస్—నూ/ఎస్—నూతి 'పగలగొట్టుతూ'షే

తద్ధర్మ విశేషణం. ఇది ధాతువుకి—ఊ చేర్చడంవల్ల ఏర్పడుతుంది.

ఇస్—ఊ 'పగలగొట్టే'

పాడ్—ఊ 'పాడే'

ఈర్—ఊ 'చూసే'

17. మాల్తో. వర్తమానకాలం. దీనికి ప్రత్యయం-న్-(౦౦ —ఇ—). —న్—మధ్యమ పురుషైకవచనం, మధ్యమ ప్రథమ పురుష బహువచన ప్రత్యయాలముందూ,—ఇ—మిగిలినచోట్లా వస్తాయి.

బంద్— 'లాగు'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| ఉ. | బంద్—ఇ—న్ | బంద్—ఇ—మ్<br>బంద్-ఇ-ట్(ఉభయం) |
| మ. | బంద్—న్—ఎ | బంద్—న్—ఎర్ |
| ప్ర, మహత్ | బంద్—ఇ—హ్ | బంద్—న్—ఎర్ |
| అమహత్ | బంద్—ఇ—త్ | |

భవిష్యత్కాలం. దీనికి ప్రత్యయం—ఎ—.

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| ఉ. | బంద్—ఎ—న్ | బంద్—ఎ—మ్<br>బంద్—ఎ—త్(ఉభయం) |
| మ. | బంద్—ఎ—నె | బంద్—ఎ—ర్ |
| ప్ర.మహత్ | బంద్—ఎ—హ్ | బంద్—ఎ—ర్ |
| అమహత్ | బంద్—ఎ—నిత్ | |

ఇదికాక మాల్తోలో —ఒ— ప్రత్యయం గల భవిష్యత్కాల రూపాలు కూడా ఉన్నాయి.

శత్రర్థకం. దీనికి ప్రత్యయం—నె/—లె

బంద్—నె } 'లాగుతూ'
బంద్—లె }

తద్ధర్మ విశేషణం. దీనికి ప్రత్యయం—ఉ.

బజ్—ఉ 'కొట్టే'

దర్య్—ఉ 'పట్టుకొనే'

18. బ్రాహుయీ. వర్తమానకాలం. దీనికి ప్రత్యయం—ఇ—.

బిన్— 'విను'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| ఉ. | బిన్—ఇ—వ్ | బిన్—ఇ—న్ |
| మ. | బిన్—ఇ—స్ | బిన్—ఇ—రె |
| ప్ర. | బిన్—ఎ | బిన్—ఇ—ర్ |

భవిష్యత్‌కాలం. దీనికి ప్రత్యయం —ఒ—

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| ఉ. | బిన్—ఒ—ట్ | బిన్—ఒ—న్ |
| మ. | బిన్—ఒ—స్ | బిన్—ఒ—రె |
| ప్ర. | బిన్—ఒ—ఎ | బిన్—ఒ—ర్ |

వ్యతిరేకార్థక క్రియలలో పకారం వర్తమాన—భవిష్యత్‌కాల ప్రత్యయంగా యీ భాషలో ఉంది.

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| ఉ. | బిం—ప్—అ—ర్ | బిం—ప్—అ—న్ |
| మ. | బిం—ప్—ఏ/ఎ—ఏస్ | బిం—ప్—ఏ/ఎ—ఏరె |
| ప్ర. | బిం—ప్ | బిం—ప్—అ—న్ |

ఇందులో పకారానికీ పురుషప్రత్యయానికీ మధ్యన ఉన్న ప్రత్యయం వ్యతిరేకార్థకం.

శత్రర్థకం. దీనికి ప్రత్యయం—ఇస.

బిన్—ఇస 'ఉడక బెట్టుతూ'
ఖల్—ఇస 'భయపడుతూ'
కర్—ఇస 'చేస్తూ'

తద్ధర్మవిశేషణం, దీనికి ప్రత్యయం – ఒక్.

బిన్—ఒక్ 'వినే'
కర్ – ఒక్ 'చేసే'
పార్—ఒక్ 'చెప్పే'

## తులనాత్మక చర్చ

ఈ వ్యాసం ప్రారంభంలో సూచించినట్లు ద్రావిడ భాషలలో వర్తమాన, భవిష్యత్‌కాల ప్రత్యయాలకి సన్నిహిత సంబంధం ఉందని పై పరిశీలన వలన తెలుస్తుంది. తమిళంలో సంఘవాఙ్మయంలో వర్తమాన కాల రూపాలు లేక పోవడం వల్లా, కన్నడం, తెలుగు, కూయి, కువి మొదలైన కొన్ని భాషలలో వర్తమాన కాలం శబ్దసముదాయాలవల్ల వ్యక్తం చేయబడుతూ ఉండడం వల్లా మూల ద్రావిడ భాషా కాలంలో వర్తమానకాలక్రియలు ప్రత్యేకంగా లేవనీ, భవిష్యత్‌కాలక్రియలే వర్తమానార్థాన్ని కూడా సందర్భానుసారంగా సూచించేవి అని మనం ఊహించ వచ్చు. తుళు, కోలామీ భాషలలో వర్తమాన, భవిష్యత్ కాల ప్రత్యయాలని పరిశీలిస్తే మనకి యీ విషయం స్పష్టమవుతుంది.

పై పరిశీలన వలన ద్రావిడ భాషలలో వర్తమాన— భవిష్యత్‌కాలాన్ని సూచించడానికి ఆరు ప్రత్యయాలు ఉన్నాయని తెలుస్తుంది. అవి 1. *—ప్ప—(*—ప్—,*—వ్—), 2. *-క్క—(క్—), 3. *—త్త—, 4. *—ఉమ్—, 5. *-న్—, 6 *—ఒ—. వీటినుండి పుట్టిన రూపాలు ఏయే భాషలలో ఏ విధంగా ఉన్నాయో కింద చూదాం.

1. *—ప్ప (*—ప్—,*-వ్—). దీని పరిణతరూపాలు తమిళం, మలయాళం, కోత, తొద, కొడగు, కన్నడం, తుళు భాషలలోనే అతిప్రచురంగా ఉన్నాయి. పైన చెప్పిన భాషలన్నీ దక్షిణ ద్రావిడోపకుటుంబానికి చెందినవి కాబట్టి, యీ ప్రత్యయం ఇప్పుడు ముఖ్యంగా యీ ఉప కుటుంబంలోనే వ్యాప్తిలో ఉందని చెప్పాలి. తుళు ఏ ఉపకుటుంబానికి చెందినది? అనే విషయం మీద ఇంతవరకూ పండితు లెవ్వరికీ స్థిరాభిప్రాయం లేదు. తుళులో యీ ప్రత్యయం వర్తమాన—భవిష్యత్‌కాల ప్రత్యయంగా ఉండడం యీభాష దక్షిణద్రావిడోపకుటుంబానికి చెందినదే అనే విషయాన్ని ధ్రువపరుస్తుంది. (తుళు దక్షిణ ద్రావిడ భాష అని చెప్పడానికి గల సమగ్రాధారాలకి "The Position of Tulu in Dravidian" అనే నా వ్యాసం చూడవచ్చు.)

మధ్య ద్రావిడ భాషలలో దీనినించి వచ్చిన ప్రత్యయాలు కొండ, కూయిలలో మాత్రమే ఉన్నాయి. కొండ మన్-బు "ఉండగా" మొదలైన రూపాలలో —పు(—బు), కూయిలో శత్రర్థక ప్రత్యయమైన - పి యీ మూలద్రావిడ ప్రత్యయం నించి వచ్చినవే.

తమిళం - కొడుగు భాషలలో—ప్-సపదం అప్రేరణక్రియలలోనూ, వాటినుండి ఏర్పడే ప్రేరణక్రియలలో - ప్ప—సపదం ఉన్నాయి. ఉదా. త. చేర్—ప్—ఏన్ 'చేరతాను'; చేర్—ప్ప—ఏన్ 'చేర్చుతాను'; కాలార్థక ప్రత్యయాలలో ఒక సపదం అప్రేరణార్థాన్నీ, వేరొక సపదం ప్రేరణార్థాన్నీ సూచించడమనే ప్రక్రియ తమిళం—కొడుగు ఉప కుటుంబంలోనే ఉంది. ఈ కుటుంబంలో ఇది ఒక నూతన పరిణామమనీ, ప్రేరణప్రత్యయాల

సామ్యంవల్ల ఇది యేర్పడిఉంటుందనీ ఇంతకు ముందే చూశాము. (చూ. "ద్రావిడ భాషలలో ప్రేరణ ప్రత్యయాలు" భారతి, డిసెంబరు 1969, 3—19). ఇటువంటి క్రియలలో తప్ప మిగిలిన చోట్ల—ప్ప్—, —వ్—ల పరిసరాలు పదాత్మక మైనవే. —వ్— మాత్రం న, ణ, ల, ళ లతో అంతమయ్యే క్రియల తరవాత వస్తుంది. (దీని ముందు ల, ళలు క్రమంగా ఱ, ట లుగా మార తాయి. త. కేళ్ 'అడుగు': : కేట్—ప్—ఏన్ 'అడుగుతాను'; కల్ 'నేర్చుకొను' : కఱ్—ప్—ఏన్ 'నేర్చుకుంటాను.')

ఉత్తరద్రావిడభాషలైన కూడుఖ్, మాల్తో, బ్రాహుయీలు మూడింటిలోనూ ఒకారం భవిష్యత్ కాల ప్రత్యయంగా ఉన్నట్లు పైన చూశాము. కాబట్టి దీనిని మూలోత్తరద్రావిడభాషకి పునర్ని ర్మించవచ్చు. మిగిలిన భాషలలో ఎక్కడా ఒకారం భవిష్యదర్థక ప్రత్యయంగా లేకపోవడంవల్ల యిది యీ మూడు భాషలలో ఎల్లా వచ్చింది అనేది ఒక క్లిష్టసమస్య. ఇది దక్షిణ ద్రావిడ భాషలలో భవిష్యదర్థక సపదమైన—ప్—నించి వచ్చిఉంటుం దని స్టెన్ కొనో, ఎల్. వి. రామస్వామి అయ్యర్, జూల్ బ్లాక్, ఎం. బి. ఎమెనో (Brahui and Dravidian Comparative Grammar,'—P.63)— ఈ పండితులంతా నమ్ముతున్నారు. ఇది *—ప్— నించి వచ్చినదైనా. కాకపోయినా ఇది కూడుఖ్, మాల్తో, బ్రాహుయీలు ఒక ఉపకుటుంబమని నిరూపించడానికి ఉపయోగపడుతుంది.

2. *—క్క్—. దీని పరిణతరూపాలు తమిళం, మలయాళం, కోత, తొద, కన్నడం, కొడగు, కోలామీ, పర్జీ, గదబ, గోండీ, బ్రాహుయీలలో ఉన్నాయి. తమిళం సంఘవాఙ్మయంలో కాణ్—కు 'చూస్తాను', పాటు—క్—అవ్ 'పాడుతాము' మొద లైన క్రియలలో ఇది ప్రత్యేకంగా భవిష్యదర్థక ప్రత్యయంగా ఉండడమేకాక కొటు—క్కువ్— ఏన్ 'ఇస్తాను' మొదలైన రూపాలలో ఇది వకా రంతో కలిసి భవిష్యదర్థకంగా ఉండడం కూడా గమనించతగ్గది. కోతలో —క్వ్— ప్రత్యయం తమిళం —కువ్—నించి వచ్చినదే. ఇది యీ రెండు భాషల సాన్నిహిత్యాన్ని ధ్రువపరుస్తుంది. తమి ళంలో అలఘుక్రియలలో ఉండే —క్క్— ప్రత్యయం (కొటుక్కుమ్ 'ఇస్తుంది') కూడా దీనికి సంబం ధించినదే.

తమిళంలో వర్తమాన ప్రత్యయమైన—కిన్ఱ్— (—కిఱ్—)లో క కారం ఉండడంవల్ల ఇది యీ ప్రత్యయానికి సంబంధించినదే అని స్పష్టమవు తుంది. కాని ఇందులో క కారం తరవాత ఉన్న —ఇన్ఱ్— (—ఇఱ్—) ఏమిటి అనేది ఒక సమస్య. కాల్డ్వెల్ అభిప్రాయంలో ఇది ఇన్ఱు 'నేడు' అనే మాట. దీని తరవాత పురుషప్రత్యయాలు చేరతాయి కాబట్టి ఇది ఇన్ఱు 'నేడు' అనే నామానికి చెందినది అని చెప్పడం అసహజంగా ఉంది. ఎం. ఆంద్రొనోవ్ ఇన్ఱ్— ఇల్ 'ఉండు' అనే దాని భూతప్రాతిపదిక అని ఊహించారు. అంటే వీరి అభిప్రాయం ప్రకారం చెయ్—కిన్ఱ్ —ఏన్ 'చేస్తున్నాను' అనేది చెయ్—కు 'చేస్తూ' అనే శత్రర్థకం, ఇన్—ఱ్—ఏన్ 'ఉన్నాను' అనే క్రియా రూపం—యీ రెండింటి సముదాయమన్న మాట. ఇంతవరకూ దీనికి ఇచ్చిన వివరణలలో ఆంద్రొనోవ్దే తృప్తికరంగా ఉండడంవల్ల దీనినే మనం అంగీకరించవచ్చు. మలయాళం వర్త మానార్థకమైన— ఉన్న్— <*కిన్ఱ్—: ఇందులో 'న్ఱ' 'న్న'గా మారింది. కోతలో శత్రర్థక ప్రత్యయ మైన—ర్ కూడా దీనిలోనించి వచ్చినదే.

కోత, తొద, గోండీ (ఉత్తమ, మధ్యమ పురుష లలో) లలో క కారం భవిష్యదర్థకంగా ప్రచురంగా ఉంది. బ్రాహుయీ బిన్—ఇక్ 'వింటాడు, వింటుంది'లో క కారం కూడా దీనికి చెందినదే.

3. *—త్త్—. దీని పరిణతరూపాలు ప్రాచీన తమిళం, కన్నడం, తెలుగు, గోండీ, కూయి, కువి, కోలామీ, నాయకీ, పర్జీ, గదబ, కూడుఖ్ భాషలలో ఉన్నాయి. ప్రాచీన తమిళంలో —ర్—/—త్త్— ప్రత్యయం ఉత్తమపురుష బహువచనం, మధ్యమ పురు షైకవచన బహువచనాల ముందు మాత్రమే వస్తుంది. కాని తెలుగులో దు ప్రత్యయం ఉత్తమ మధ్యమపురుషులలోనూ, ప్రథమ పురుష మహద్బహు వచనంలోనూ కూడా వస్తుంది. కన్నడంలో శత

ర్థక ప్రత్యయమైన—తు, వర్తమాన ప్రత్యయమైన—త్త్—కూడా దీనికి సంబంధించినవే. తెలుగు వ్యావహారిక భాషలో శత్రర్థకమైన—తూ కూడా దీనికి సంబంధించినదే. ప్రాచీనాంధ్రంలో—చున్—తూ యొక్క మాండలిక రూపాంతరం (Dialectal Variant) కావచ్చు. తెలుగు వ్యావహారికంలో భవిష్యత్ ప్రత్యయమైన—త్—దీనినుండి వచ్చినదే.

గోండీలో వర్తమాన—భవిష్యత్ కాలంలోనూ అసత్యభూతంలోనూ, కోయలో భవిష్యత్ కాలంలోనూ త ప్రత్యయం ఉంది. కూయి—కువి లలో భవిష్యత్కాలంలో మధ్యమపురుషలో ద కారం ప్రత్యయంగా ఉంది. కోలామీ, నాయకీ, గదబలలో కూడా ద కారం భవిష్యత్కాలప్రత్యయంగా విస్తారంగా ఉంది. పర్జీలో కొన్ని మాండలికాలలో—ర్—కి బదులు—ద్ భవిష్యత్ ప్రత్యయంగా ఉండడంవల్ల—ర్—కూడా *—త్త్—నించి వచ్చినదే కావచ్చు; ఈ భాషలో —త్—కూడా కొన్ని క్రియలలో ఉంది.

ఉత్తర ద్రావిడభాష అయిన కూడుఖ్‌లో కూడా ద కారం వర్తమాన ప్రత్యయంగా ఉండడం గమనించదగ్గది.

ఈ ప్రత్యయం పరిణతరూపాలు మూడు ఉపకుటుంబాలలోనూ ఉండడంవల్ల ఇది మూల ద్రావిడభాషకి చెందినదని చెప్పడంలో సందేహం లేదు. అయినా ఇది తెలుగు మొదలైన మధ్య ద్రావిడభాషలలో విస్తారంగా వ్యాప్తిలో ఉంది. ఈ అంశం కూడా తెలుగు మధ్యద్రావిడభాషఅని చెప్పడానికి ఉపోద్బలంగా ఉంటుంది.

4. *—ఉమ్. దీని పరిణతరూపాలు తమిళం, మలయాళం, కన్నడం, తుళు, తెలుగు, కోలామీ, పర్జీ భాషలలో ఉన్నాయి. ప్రాచీన తమిళంలో ఇది ఉన్న రూపాలు మహత్, మహతి, అమహత్ ఏకవచనంలోనూ, అమహన్ బహువచనంలోనూ ఉండేవి. (చూ. తొల్కాప్పియం, చొల్లతికారం, సూ. 227). కాని తరువాత కాలంలో ఇవి అమహదేకవచన, బహువచనాలలో మాత్రమే మిగిలి, మహత్, మహతి ఏకవచనాలలో—ప్—ప్రత్యయం గల రూపాలు వ్యాప్తిలోకి వచ్చాయి. తమిళం తద్ధర్మ విశేషణంలో కూడా యీ ప్రత్యయం ఉంది. మలయాళంలో పురుష ప్రత్యయాలు కాలక్రమాన్ని నశించడంవల్ల —ప్—(—వ్—) గల రూపాలు నశించి, —ఉమ్ ప్రత్యయంగల రూపాలే అన్నిపురుషలలోనూ వ్యాప్తిలోకి వచ్చాయి. ఈ భాషలో కూడా తద్ధర్మవిశేషణంలో—ఉమ్ ప్రత్యయం ఉంది. ప్రాచీన కన్నడంలో—కుమ్/గుమ్ ప్రత్యయంగల రూపాలు ప్రథమ పురుషలో అన్నిలింగాలలోనూ ఉన్నాయి. ఇందులో —ఉమ్ ప్రత్యయం ఉంది. దీని ముందున్న కకార గకారాలు తమిళం అలఘుక్రియల (Strong Verbs) లో ఉండే—క్క్— ప్రత్యయానికి సంబంధించినవి. కన్నడంలో ఇవి సామ్యంవల్ల అన్నిక్రియలలోకీ వ్యాపించాయి.

తుళు అమహదేకవచన రూపాలైన—బరు 'వస్తుంది',—తిను 'తింటుంది' మొదలైనవాటిలో ఉకారం ఈ—ఉమ్ నించి వచ్చినదే. తుళులో పదాంతంలో మకారం లోపిస్తుంది.

ప్రాచీనాంధ్రంలో భవిష్యత్ కాలక్రియలలో,—ఉను *—ఉమ్ నించి వచ్చినదే: తె. చేయును: త. చెయ్యుమ్. పదాంత మకారం తెలుగులో కొన్ని చోట్ల నకారంగా మారుతుంది: త. కుళమ్, కుళన్: తె. కొలను. తెలుగు తద్ధర్మవిశేషణంలో—ఉకారం కూడా *—ఉమ్ నించి వచ్చినదే. దీని తరవాత అచ్చు వచ్చేటప్పుడు వచ్చే నకారం ప్రాచీనమైన మకారం యొక్క అవశేష మన్నమాట.

కోలామీ వర్తమానకాలం అమహదేకవచనంలో ఉన్న —ఉన్ *—ఉమ్ నించి వచ్చినదే.

పర్జీలో వర్తమానకాల ప్రత్యయమైన మకారం యీ *—ఉమ్ నించి వచ్చినదే. పర్జీలో ఇది అన్ని పురుషలలోకీ వ్యాపించిడమేకాక దీని తరవాత పురుష ప్రత్యయాలని కూడా చేర్చుకుంది. కొన్ని క్రియలలో పర్జీ ఉత్తరమాండలికంలో దీనిముందు క్రియకిచేరే కకారం దక్షిణభాషలలో అలఘు క్రియల(Strong Verbs) లో ఉండే—క్క్—ప్రత్యయానికి సంబంధించినది.

| పర్జి | తమిళం |
|---|---|
| కా—క్—వ్—ఒ | కా—క్క్—ఉమ్ 'ఆగుతుంది' |
| నిల్—క్—వ్—ఒ | నిఱ్—క్—ఉమ్ 'నిలుస్తుంది' |

(దీనిపై వివరాలకి చూ. నా. "Two Problems in Parji Verb Forms," Indian Linguistics 25 (1964): 47-55.)

5. *—న్—. దీని పరిణతరూపాలు చాలా కొద్ది భాషలలోనే ఉన్నాయి. అవి ప్రాచీన తమిళం, గోండీ, కొండ, కూయి, కువి, కోలామీ, కూడుఖ్ మాల్తో.

ప్రాచీన తమిళంలో చెప్పు—న్—అర్ మొదలైన ధాతుజ నామాలలో మాత్రమే ఇది ఉంది. మిగిలిన భాషలలో చాలావరకు ఇది వేరొక, ప్రత్యయంతో పరిపూరక ప్రవృత్తి (Complementation) లో ఉంటుంది. కొండలోమాత్రం న కారమే అన్నిపురుషప్రత్యయాల ముందూ భవిష్యదర్థకంగా ఉంది. గోండీలో ప్రథమ పురుషలో కోయలో తద్ధర్మవిశేషణంలో మాత్రమే ఇది ఉంది. కూయి, కువిలలో ఉత్తమ, ప్రథమ పురుషలలోనూ, తద్ధర్మ విశేషణంలోనూ మాత్రమే ఉంది కోలామీ వర్తమానకాలంలో మధ్యమ, ప్రథమ పురుషలలో ఇది ఉంది. కూడుఖ్, మాల్తోలలో వర్తమానకాలం మధ్యమ, ప్రథమ పురుషలలోనూ శత్రర్థకాలలోనూ ఇది ఉంది.

శత్రర్థకం. తమిళ మలయాళాలలో దీనికి ప్రత్యేకమైన ప్రత్యయం 'లేదు. వీటిలో ఇది క్త్వార్థకానికి కొళ్ 'కొను' ధాతువు క్త్వార్థకం చేర్చడంవల్ల ఏర్పడుతుంది: పార్—త్తు+కొన్—టు 'చూస్తూ'. మిగిలిన భాషలలో దీనికి ప్రత్యేక ప్రత్యయాలు ఉన్నాయి. కోత—ర్ <*—కిన్ట్—. కన్నడం, తెలుగులలో —తు శత్రర్థకంలో ఉంది. గోండీ—సేర్, కోయ—సోర్, కొండ—జిన్, కూయి—కువి—జి (కొన్నింటిలో) పరస్పరసంబంధం కలవి కావచ్చు. తెలుగు—చున్ కూడా వీటికి సంబంధించినదే కావచ్చు. కోలామీ—సాన్ కూడ దీనికి సంబంధించినదే.

కూడుఖ్—మాల్తో శత్రర్థకాలలో నకారం తుల్యంగా ఉండడం వీటి సన్నిహిత సంబంధాన్ని సూచిస్తుంది.

తద్ధర్మవిశేషణం. తమిళం, మలయాళం, తెలుగులలో ధాతువుకి *—ఉమ్ ప్రత్యయరూపాలు చేర్చడంవల్ల ఇది ఏర్పడుతుంది. కన్నడం, తుళులలో —వ్— ప్రత్యయానికి విశేషణ ప్రత్యయం చేర్చడం వల్ల ఇది ఏర్పడుతుంది.

వ్యావహారికాంధ్రంలోని ఏ—ప్రత్యయం ప్రాచీనాంధ్రంలోని—ఎడు/—ఎడిల నించి వచ్చింది. దీని సమానరూపాలు వేరే ఏ భాషలోనూ లేవు. తెనాలి రామలింగ కవి పాండురంగ మాహాత్మ్యంలో "నుయి దాటే వానికిన్" అనేచోట వ్యావహారికరూపాన్ని ప్రయోగించిఉండడం గమనించదగినది.

కోయ, కొండ, కూయి, కువిల తద్ధర్మవిశేషణంలో తద్ధర్మ ప్రత్యయంగా నకారం ఉండడం వాటి సాన్నిహిత్యాన్ని నిరూపిస్తుంది.

కూడుఖ్, మాల్తోలలో తద్ధర్మప్రత్యయమైన —ఊ/—ఉ *—ఉమ్ నించి వచ్చినదే కావచ్చు. బ్రాహుయీ—ఒక్ బలూచీభాషనించి ఎరువు తెచ్చుకొన్నది అని జూల్ బ్లాక్ అభిప్రాయపడుతున్నారు.

ఈ రూపంలో విశేషణప్రత్యయం తుళు, కొండ, కూయి, కువిలలో—ఇకారం, మిగిలిన భాషలలో—అకారం. ఈ రెండూ మూలద్రావిడంలో ఉండి ఉండాలి. ఈ అంశం కూడా కొండ, కూయి, కువిల సన్నిహిత సంబంధాన్ని నిరూపించడానికి ఉపకరిస్తుంది.

# అమృతస్పర్శ

శ్రీ భూషి కృష్ణదాసు

ప్రభూ! నన్నెంత గట్టిగా
స్పృశించావు నీవు?
నిత్యమూ కాలిపోతున్న ఈ
దీపానికి ఎంత చమురు
పోస్తున్నావు!
నిజంగా నీది అమృతస్పర్శ.

దినదినమూ నీనుండి నాకు
ఆ కరుణే ప్రవహించకపోతే
నా బ్రతుక్కి పరిపూర్ణత యేది!
ఈ సృష్టినెలా ప్రేమించగలను?
నీవు నన్ను ప్రేమిస్తున్నట్టే
నేను ఈ సకలచరాచరప్రకృతిని
ప్రేమించాలి జీవించాలి
నీకు సన్నిహితుణ్ణవాలి

అనాయాచితంగా
నన్నావరించి కాపాడుతోంది
నీ చల్లని స్పర్శ
ఎప్పుడో పకప్పుడు
నన్ను మేల్కొల్పుతుంది
అప్పుడు నేను నాలోకి తొంగిచూస్తాను
నా బ్రతుకు నీవైపు పయనిస్తుంది

అంతవరకు నేనిలా వేచియుండాలి
యుగయుగాలుగా చూస్తోన్న
ఈ పాత లోకాన్నుంచి
కొత్త జీవనరాగాన్ని
వింతరంగుల్నీ ఏరుకొని
బ్రతుకు నిత్యచైతన్య ప్రవంతిలా
సాగినపుడు——
నా జీవితం ఆనందచేతనా
వర్తమాతుంది
నీ చల్లని స్పర్శలో
బ్రతుకు పరిఢవిల్లుతుంది.

# ఎ ం దు కు ?

సుందర స్వప్నంలా అగుపించే బ్రతుకులో
ఎన్ని భయోత్పాతాలు !
శాంతమహాసముద్రంలాంటి
జీవితం అడుగున
ఎన్ని అగాధాలు !
ఎడారిలా పరుచుకొన్న బ్రతుకులో
ఎన్ని వేడినిట్టూర్పుల తుపానులు !

వీటన్నిటినీ అధిగమించి
ఎక్కడికి నడిపిస్తున్నావు తండ్రీ ! నన్ను
ఇంకెంతదూరం నడిపిస్తావు
ఈ ఇసుకయెడారి బ్రతుకునుండి
నాకెప్పుడు విముక్తిని కల్పిస్తావు ?

ఆశల కొసలచిక్కు దారాన్ని విడదీయ లేకుండా
భవిష్యత్తు వన్నిన వలలో నన్ను పారవైదావు

ఎందుకు?

బ్రతుకులోని విషాద కషాయాన్ని
బలవంతంగా నాకు పట్టిస్తున్నావు

ఏ ఆనందంకోసం నేనింకా వేచియుండాలి
ఏ పరిపక్వ దశకోసం నేనింకా ఎడంగా జడంగా ఉండాలి
ఏ దూరతీరాలకు నేనింకా చేరువ కావాలి
ఎందుకు ప్రభూ! నన్నీ విధంగా
అసమర్థుణ్ణిచేసి ఆడిస్తావు
ఎందుకు నన్నీ వెతల భూలోకంలో
కసిగా విసిరిపారేశావు
ఇంకెందుకు గొంతు దిగని గరళాన్ని
గుండెలదాకా కూరతావు
భగవాన్! అంతుపట్టవు నీ లీలలు
నిత్యసందేహాడోలలు!

# నేను

ఆకాశం కప్పుకింద
అనాదినుంచీ మోసుకవస్తున్న
పాపాల చిరభారంతో క్రుంగిపోతున్న
అవనీ తలంపై
అవకాశాల నిచ్చెన ఎక్క లేక
మంచినీ చెడునీ పోల్చుకో లేని
నిస్సహాయస్థితిలో
గూండాయిజం చేతుల్లో
వొరిగిపోతున్న చైతన్యశిఖరాన్ని చూస్తూ

పదునైన అబద్ధాల మధ్య
బ్రతుకును ముక్కలుచేసే

కట్టుబాటుల్లో
ఎదలు చెదలుతింటోన్న
మందీ మార్బలం మధ్య
డబ్బు అనే కక్ష్య చుట్టూ
తిరుగుతోన్న జడప్రకృతిని చూస్తూ

ఆదర్శాల సంకల్పంలోంచి
కర్తవ్యం జారిపోతుంటే
అనుకున్న మేరకు మానవతకు
మానసంరక్షణ చేయలేకపోగా

ఎన్నాళ్ళని కోరికల అగరువత్తుల్లో
వెలిగించుకుంటూ నీజీవితాన్ని
ఎన్నాళ్ళని కాలుతూన్న కొవ్వొత్తిలా
కన్నీళ్ళు కారుస్తాను?

---



ఆర్థికశాస్త్ర చారిత్రక వికాసం :

# ప్రకృతి ధర్మవాదులు

డా. ఎ. ఆర్. కె. మూర్తి

వాణిజ్యవాదం అమలులో ఉన్న రోజుల్లో ఒక నూతన చైతన్యం బయలుదేరింది. కొత్త కొత్త జాతిరాజ్యాలు అవతరించినాయి. ఎన్నో దేశాలు వలసరాజ్యాలను (Colonies) ఏర్పరచుకొన్నాయి. వలసదేశాలు నుండి ముడిసరుకులను దిగుమతి చేసుకొని, తయారైన వస్తువులను వలసదేశాలలో అమ్మి అధికలాభాలను పొందినాయి. పరిశ్రమల అభివృద్ధికే అధిక ప్రాధాన్యం ఇవ్వడం జరిగింది. వ్యవసాయరంగం పట్ల చిన్నచూపు చూచినారు. కొత్త కొత్త ఉత్పత్తి విధానాలు, సంస్థలు నెలకొనడానికి అవకాశాలను కల్పించడం జరిగింది. వ్యాపారసంస్థలు అధికలాభాలను గడించడానికి అది మంచి తరుణం. వ్యవసాయరంగం పూర్తిగా వెనకబడి పోయింది. దీన్ని ఎదుర్కోడానికి ఏర్పడిన వాదమే ప్రకృతి ధర్మవాదం (Physiocracy). ఈ వాదం ఎక్కువగా ప్రచారంలో ఉండింది ఫ్రాన్సుదేశంలో. అక్కడ కాల్బర్ట్ (Colbert) అనుసరించిన విధానాలే ఇందుకు మూలకారణం. నిజం చెప్పాలంటే ఈ విధానం ప్రబలడానికి వాణిజ్యవాదు లనుసరించిన పద్ధతులే కారణం. మొట్టమొదట ఇది ఫ్రాన్సులో తలఎత్తింది! క్రమంగా అన్నిదేశాలకు ప్రాకింది. వాణిజ్యవాదుల విధానాల ఫలితంగా వ్యవసాయం దెబ్బతినడమే కాకుండా, చిన్న చిన్న పనిపాటలు చేసుకొనేవారు— ముఖ్యంగా చేతిపనులుచేసుకొనేవారు — బాగా దెబ్బ తిన్నారు. సంఘంలో లంచగొండితనం ప్రబలింది. ప్రజలలో నీతినిజాయితీ లోపించినాయి. దేశంలోని గ్రామీణ ఆర్థిక వ్యవస్థ అస్తవ్యస్తమైంది. పేదరైతులకు ఆదరం లభించలేదు. వ్యవసాయోత్పత్తి బాగా దెబ్బతినింది. అంతకుముందున్న విధానాలను ప్రతిఘటిస్తూ నూతన సందేశాన్ని అందించినవారిలో ప్రముఖుడు ఫ్రాంకో కెన్(1694).

1756 నుండి 1778 వరకు ప్రకృతి ధర్మవాదుల రచనలు ఫ్రాన్సుదేశంలో ఎక్కువ ప్రచారంలో ఉండినాయి. ఆర్థిక విషయాలను సిద్ధాంత రూపంగా చర్చించిన వారిలో మొట్టమొదటివారు వీరేననీ, కాబట్టి ఆర్థిక విజ్ఞాన స్థాపకులు వీరేననీ అభిప్రాయాన్ని కొందరు ఆర్థిక చరిత్రకారులు వ్యక్తం చేసినారు.

ఈ వాదంలో మూలాంశం సహజక్రమం (Natural Order). అందువల్లే ఒక రచయిత ఈ వాదాన్ని......"సహజక్రమవాదం"......అన్నాడు. ఈ క్రమం మానవయత్నంతో సంబంధంలేక, మానవసంస్థలవల్ల ఆటంకాలు వచ్చినా చివరకు తానంతటతానే వ్యవస్థితంకాగల శక్తి ఉండేటటువంటిది. ఈ భగవచ్ఛాసనాలను అమలులో పెట్టడం వరకే మానవనిర్మితాలైన శాసనాల పని. మానవుడు సృష్టించే శాసనాలు తగినవో కాదో నిర్ణయించడానికి దైవికంగా నిర్మితమైన విధానమే ఒరవడి. ఈ విధమైన సహజక్రమాన్ని గురించి చర్చించడంవల్లనే వారు వ్యవసాయానికి అత్యంత ప్రాధాన్యం ఇచ్చినారు. ఈ వాదాన్ని వివరించడం అంటే కెనే చేసిన పరిశీలనను వివరించడమే అవుతుంది.

## ఫ్రాంకో కెనె—1694 :

ఇతడు 1694 లో ఒక రైతు కుటుంబంలో జన్మించినాడు. వైద్యవిద్య నభ్యసించడానికి పారిస్

పోయినాడు. వైద్యవిద్య పూర్తిచేసి మాంట్‌టెస్ (Montes) అనే గ్రామంలో తన వృత్తిని ఆరంభించి నాడు. వైద్యశాస్త్రానికి సంబంధించిన ఎన్నో గ్రంథాలు వ్రాసినాడు. సంఘంలో మంచి పేరుప్రతిష్ఠలు సంపాదించికొనినాడు. 1749 లో పాంపడో అతన్ని రాజవైద్యుడుగా నియమించడం అతని జీవితంలో ఒక కొత్త మలుపు. పారిస్‌లో ఎంతోకాలం లూయీ XIV వద్ద ఉన్నా గ్రామప్రాంతా లంటే అతనికి ఉన్న ఆసక్తి తగ్గలేదు. ఇదే అతను ఆర్థిక విషయాలను గురించి వ్రాసిన రచనలకు మూలకారణమైంది. ఇతడు 1759 ఆఖరులో ఆర్థిక విషయాల పట్టికను (Tableau Economique) వ్రాసి లూయీ XIV కు అంకితం చేసినాడు. దానితో ఫ్రాన్సు చరిత్రలో ఒక నూతనాధ్యాయం ప్రారంభమైంది. అతడు వ్రాసిన... "ఫారమర్స్...గ్రెయిన్".. వ్యాసాలు ఈ సందర్భంలో పేర్కొనవలసిన రచనలు. కెనే వ్రాసిన ఆర్థిక విషయాల పట్టిక ఎంతో ప్రసిద్ధమైన గ్రంథం. అందులోనే అతని అభిప్రాయాలను పొందుపరిచినాడు. అందులోని ముఖ్యాంశాలను పరిశీలిస్తే ఆ వాదనలోని సారాంశమేమో తెలుసుకోవచ్చు.




The tableau economique represented in circular form.

అతడు రూపొందించిన ఆర్థిక వ్యవస్థలో మూడు వర్గాలు ఉంటాయి. వీటి మధ్య డబ్బు, వస్తువులు, సేవలు ఒక నిర్ణీత క్రమంలో ప్రసారమవుతూ ఉంటాయి.

**మూడు వర్గాలు :**

1. ఉత్పత్తిదారుల వర్గం (The Productive class)—ఇందులో దేశంలోని సగం జనాభా వ్యవసాయరంగం, చేపల పరిశ్రమ, గనుల తవ్వకంలో పని చేస్తుంటారు.

2. భూస్వాముల వర్గం (Proprietory class) — ఇందులో భూకామందులు లేదా భూమి నుంచివచ్చిన ఆదాయంపైన ఆధారపడి జీవించేవారు వుంటారు. వీరు మొత్తం జనాభాలో ¼ వంతు ఉంటారు.

3. చేతిపనులు చేసుకునేవారి వర్గం (The Artisan class)— ఇందులో మిగిలిన జనాభా ఉంటుంది.

ఇట్లాంటి ఆర్థిక సాంఘిక వ్యవస్థ ఆనాటి ఫ్రాన్సు దేశంలోని పరిస్థితులకు ప్రతిదర్పణం అనవచ్చు. సాంఘిక ఆర్థిక వ్యవస్థలో వచ్చే క్రమ పరిణామాలను టర్‌గాట్ (Turgot) గుర్తించడమే కాకుండా కాలక్రమేణా వాటి తరవాత దశల్లో ఎట్లాంటి వ్యవస్థలు ఏర్పడడానికి వీలుంటుందో లేదో కూడా సూచిస్తాయని భావించినాడు.

జాతీయాదాయం, జాతీయోత్పత్తి వివిధ వర్గాల మధ్య ఎట్లా పంపిణీ అయ్యేది కెనే తన పట్టికలో వివరించినాడు. పైన చెప్పిన మూడు వర్గాలలోను మొదటిదైన ఉత్పత్తిదారుల వర్గం 5 మిలియన్ల లివర్ల ఉత్పత్తిని సాధిస్తుంది. దీన్ని భూకామందుల వద్ద అద్దెకు తీసుకొనివ భూమిని సాగుచేసి పండిస్తుంది. ఈ ఉత్పత్తి కోసరం 2 మిలియన్ల ధనాన్ని భూమి సాగు చెయ్యడానికీ, విత్తనాలకు గానూ ఖర్చు పెట్టుతుంది. దీర్ఘకాలికమైన పెట్టుబడి కింద (అంటే వ్యవసాయపు పనిముట్లు, వ్యవసాయానికి అవసరమయ్యే ఎడ్లు మొదలైన వాటికి, అయ్యే ఖర్చు) 10 మిలియన్లు ఖర్చు చేస్తుంది. ఇందులో 1/10 ప్రతి సంవత్సరం పెట్టుబడి పెట్టడం జరుగుతుంది. ఈ పద్ధతిలో ఒక ముఖ్యమైన అంశాన్ని గుర్తుంచుకోవడం

అవసరం—స్థిర ప్రతిఫలాలు (Constant returns) ఉంటాయనీ, 2 యూనిట్ల పెట్టుబడికి 5 యూనిట్ల ప్రతిఫలం లభిస్తుందని భావించడం జరిగింది. మూలధన ఉత్పాదనల నిష్పత్తి 2 : 5 అని అర్థమవుతుంది. ఇట్లా జరగడం భూస్వాములు శాశ్వతంగా ఉండే కొన్నింటి వాటి మీద పెట్టే పెట్టుబడి మీద ఆధారపడి ఉంటుందనే దాన్ని గుర్తించినారు. టర్‌గాట్ తరవాత తరవాత ప్రతిఫలాలు క్రమంగా క్షీణించనూవచ్చు, పెరగనూవచ్చు అనేదాన్ని అంగీకరించి మరికొంత చర్చించినాడు. మొత్తం జాతీయోతత్తిలో 5 మిలియన్ల లివర్లు 2 మిలియన్ల లివర్లు భూకామందులు పెట్టిన పెట్టుబడి పైన ఆదాయం ఉంటుందనీ, 1 మిలియను మూలధనం కోసరమనీ, మిగిలిన 2 మిలియన్లు నికర ఉతత్తి (Net Product) అని అంచనావేయడం జరిగింది. ఇట్లాంటి నికరమైన జాతీయోత్పత్తి ఆర్థికాభివృద్ధికి కీలకమైనదని భావించినాడు. ఈ ఉత్పత్తి భూస్వాములకు దక్కుతుంది.

క్లుప్తంగా చెప్పాలంటే ఉత్పత్తి చేసే వర్గం నికరజాతీయోత్పత్తిని కల్పిస్తుంది. 'చేతిపనులు చేసేవారు ఇతర పనిబాటలవారు వారుపెట్టిన పెట్టుబడి మొత్తాన్ని వారు నిర్వహించే పనిపాటల వల్ల రాబట్టుకొంటారు. భూకామందుల వర్గం ఉత్పత్తి కార్యక్రమంలో ఏవిధంగానూ పాల్గొన కుండానే ఆదాయం సంపాదిస్తుంది. ఇట్లాంటి వర్గీకరణం తరువాతతరాలవారిలో కొత్త భావాలను రేకెత్తించింది. ఒక వర్గం పీడితవర్గంగా ఉంటుం దనీ, మరొకవర్గం ధనికవర్గమని ఈ పరిశీలనవల్ల తెలుస్తుంది.

కెనే మూడు విధాలైన పెట్టుబడికి వినియోగించిన మూలధనాన్ని గురించి వివరించినాడు (Capital outlay) అవి:—

1. భూమిని వ్యవసాయయోగ్యం చెయ్యడానికి పెట్టే మూలధనం (Ground Advances): దీనితో చెట్టూచేమలను కొట్టెయ్యడం, నేలను శుభ్రపరచడం, మొదలైన పనులు చేస్తారు.

2. సాలుసరి పెట్టుబడి (Annual Advances): అంటే ప్రత్యావర్తనవ్యయానికి అవసరమయ్యే మూలధనం (Working or circulating capital). శ్రామికులకు ఇవ్వవలసిన వేతనాలు, విత్తనాలు కొనడానికి అవసరమైన ధనం, మొదలైనవి. దీన్ని ఆడమ్ స్మిత్ తెలిపిన చరమూలధనం అనవచ్చు. (Working or circulating capital).

3. స్థిరమూలధనం (Primitive Advances.) ఇది వ్యవసాయానికి అవసరమయ్యే పనిముట్లు ఇతర పరికారలపైన వెచ్చించే మొత్తం.

పై పరిశీలనబట్టి వివిధరకాలైన వ్యవసాయ పద్ధతులలో ఉత్పత్తి వ్యయం మారుతూ ఉంటుందని తెలుస్తుంది. ఉత్తర ఫ్రాన్సులో ఆనాడు వ్యవసాయానికి ఎంత ధనమవసరమవుతూ ఉండేదో దాని ఆధారంతో ఏఏరకమైన పంటకు ఎంతెంత వ్యయమవుతుందో అంచనా కట్టడం జరిగిందన వచ్చు. అందువల్లే వ్యవసాయదారుడు 10 మిలియన్ల ఆదాయం రాబట్టుకోవలె. ఇది అతను ఉపయోగించిన చరమూలధన మవుతుంది. దీనికి అదనంగా పెట్టిన మూలధనంలో కొంత భాగానైనా రాబట్టుకోవలె. ఇది 10 శాతం ఉంటుందని కెనే అంచనా వేసినాడు. అంటే ఈ 10 శాతం రాబడి అప్పుగా తెచ్చిన చరమూల ధనానికి చెల్లించవలసిన వడ్డీ, వ్యవసాయ పనిముట్ల మరమ్మత్తుకుగాను అయ్యే ఖర్చు, నష్టాలేవైనా వస్తే అవసరమయ్యే దానికి సరిపోతుందని అతని భావము. ఇట్లాంటి వాటికి అవసరమయ్యే 10 శాతం ఆదాయం, చరమూలధనానికి అవసరమైన 2 మిలియన్లధనం కలిసి మొత్తం 3 మిలియన్ల ధనం అవుతుంది. వీటిన్నిటినీ వ్యవసాయదారుడే భరిస్తాడు. ఈ 3 మిలియన్లు పెట్టుబడి పెట్టడం వల్ల అతనికి 2 మిలియన్ల నికరాదాయం వస్తుంది. అంటే అతనికి వచ్చే మొత్తం ఆదాయం 5 మిలియను లన్నమాట.

ఇట్లా సంపాదించిన 5 మిలియన్ల ఆదాయంతో భూకామందు ఒక మిలియను ఖర్చుచేసి చేతిపనుల వారి దగ్గర నుండి తనకు అవసరమైన వస్తువులను కొంటాడు. వ్యవసాయదారుడు పండించిన ఒక మిలియను విలువచేసే తిండిగింజలను కొంటాడు. వ్యవసాయదారుడు తాను పండించిన దానిలో 2 మిలియన్లు విలువచేసే ధాన్యాన్ని తన

స్వంత ఖర్చులకు వినియోగించుకొంటాడు. మరొక మిలియను ధనంతో చేతిపనులవారు తమకు అవసరమైన ముడిపదార్థాలను వ్యవసాయదారునివద్ద కొంటారు. ఈ విధంగా ఈ ప్రసారం ఎడతెరిపి లేకుండా కొనసాగుతుంది. ఈ విధంగా జరగడం వల్ల, భూకామందులు, చేతిపనులవారు రైతుల మీద ఆధారపడిఉంటారు. రైతు ఉత్పత్తిచేసే నికరమైన ఉత్పాదనమే లేకుంటే మొత్తం ఆర్థికవ్యవస్థ అస్తవ్యస్తమవుతుంది. పారిశ్రామికోత్పత్తి స్తంభిస్తుంది. పట్టణవాసులంతా వ్యవసాయరంగంలో పనిపాటల కోసరం ప్రయత్నించవలసి వస్తుంది. అంటే ఆర్థిక వ్యవస్థకంతటికీ వ్యవసాయమే కీలకమైందని తెలుస్తుంది. ఈ నాటకానికి వ్యవసాయదారుడు సూత్రధారి.

పై చర్చలోని సారాంశాన్ని మరొక విధంగా చెప్పవచ్చు. దేశప్రజల మనుగడ రైతు పండించే దానిలో నికర ఉత్పాదనం (Net Product) మీద ఆధారపడుతుంది. ఇది పెట్టుబడి పెట్టిన మొత్తంమీద ఆధారపడుతుంది. అందుకే దేశం అభివృద్ధిని సాధించవలెనంటే వ్యవసాయదారునికి అధికోత్పత్తికి అవసరమైనంత మూలధనం అందుబాటులో ఉండవలె. అతనికి అవసరమైన పెట్టుబడి ధనాన్ని తగ్గిస్తే ఆర్థికాభివృద్ధి కుంటుబడుతుంది. దీనివల్ల వ్యవసాయోత్పత్తిమీద పన్నుల భారం తగ్గించవలసిన అవసరాన్ని స్పష్టంగా నిరూపించినారు.

ప్రజల శ్రేయస్సు దృష్ట్యా ప్రభుత్వం వ్యవసాయరంగంలో పెట్టుబడికి ఏ విధమైన అవరోధాలను కల్పించకూడదు. ప్రజలకు వారివారి వృత్తులను అవలంబించేటందుకు పూర్ణ స్వేచ్ఛ ఉండవలెనన్నాడు కెనే. దేశంలో ఉత్పత్తి అయిన ధాన్యాన్ని ఎగుమతి చెయ్యడాన్ని అడ్డుపెట్టకూడదన్నాడు. ప్రభుత్వం వాణిజ్యఏకస్వామ్యసంస్థలను రద్దుచెయ్యడం అవసరమని భావించినాడు. ఇవి ఉండడంవల్ల ఉత్పత్తి వ్యయం అధికమవుతుంది: ఫలితంగా నికరోత్పాదన తక్కువవుతుంది. దీన్ని ఆధారం చేసుకొని ఆయన అనుయాయుల్లో కొందరు వ్యవసాయమే జాతీయాదాయానికి మూలమనీ ఇతర వర్గాలన్నీ నిరుపయోగమైనవని భావించినారు. ఆయన అనుయాయుల్లో ముఖ్యుడైన (Turgot) చేసిన చర్చను కొంచెం పరిశీలిస్తాము.

## టర్గాట్ :

ప్రభుత్వ నిర్బంధము హానికరమని భావించినాడు. ప్రతివ్యక్తి తన స్వార్థం కోసమే పని చేస్తాడనీ, కానీ ఇట్లా చెయ్యడంలో ఇతరులను పీడించకుండా తగిన నిబంధనలను అమలు పరచవలెననీ చెప్పినాడు. వాణిజ్యం ద్వారా సంఘశ్రేయమును పెంపొందించవలె. ఇట్లా చెయ్యడానికి రెండు నియమాలను టర్గాట్ సూచించినాడు.

1. ఏ వ్యక్తి కూడా ఇతరులను పీడించకుండా తగిన ఏర్పాట్లు చెయ్యవలె. ఎవరైనా అట్లా చేసినట్లయితే పీడితులను రక్షించడానికి తగిన ఏర్పాట్లను చేయవలె.

2. వాణిజ్యం ద్వారా సంపదలను ఎక్కువ చేసుకోవడానికి సంపూర్ణ స్వేచ్ఛ వుండవలె. ఇట్లాంటి స్వేచ్ఛ అటు అమ్మేవారికి ఇటు కొనేవారికి ఉండవలె.

తక్కిన ప్రకృతిధర్మవాదుల వలెనే వ్యవసాయం అన్నిరంగాల కంటే ముఖ్యమైనదని చెప్పినాడు. టర్గాట్‌కు ప్రకృతి ధర్మశాస్త్రజ్ఞులతో కంటే స్మిత్‌తోనే ఎక్కువ వైజ్ఞానిక సంబంధం ఉండిందని చెప్పవచ్చు. కెనె అనుయాయులకు టర్గాట్‌కు కొన్ని విషయాలలో అభిప్రాయభేదాలున్నట్లు అర్థమవుతుంది. వాటిలో ముఖ్యమైనవి: వ్యవసాయోత్పాదక శక్తిని గుర్తించినా మిగిలినవారు ఇచ్చినంత ప్రాధాన్యం ఇవ్వలేదు. ఇంతే, కాకుండా మూలధనం విషయంలో ఇతని అభిప్రాయాలను మనం గుర్తుంచుకోవలె. మూలధనం తత్వాన్ని కర్తవ్యాన్ని క్షుణ్ణంగా పరిశీలించి, వడ్డీ చెల్లించడాన్ని సమర్థించినాడు.

## కాండిలాక్ :

టర్గాట్ కంటే కూడా కాండిలాక్ ఈ ప్రకృతి ధర్మవాదంలోని లోటుపాట్లు ఏమిటో, వాటిని ఎట్లా సరిదిద్దవలెనో చక్కగా గ్రహించనాడు. ఇతడు 1776 లో ప్రచురించిన గ్రంథం ఆర్థికవిజ్ఞాన వికాసంలో పేర్కోదగింది. ఆర్థిక

శాస్త్రం విలువను విశదీకరించవలసిన శాస్త్రమనీ, విలువ ప్రయోజనం (Utility) పై ఆధారపడి ఉంటుందని చెప్పడంతో ఇతడు ప్రకృతి ధర్మ వాదులకు ఎంతో దూరమైనాడు. ప్రయోజన మంటే వస్తువులో గుప్తంగా ఉండే ఒక ప్రత్యే కాంశమని కాక, మానవుల కోర్కెలకు వస్తువులకు మధ్య ఉండే సంబంధం మాత్రమేనని గూడా అయన అనినాడు. ప్రయోజనమే కాక, కొరతగా ఉండడం (Scarcity) కూడా వస్తువుల విలువను నిర్ణ యిస్తుందని తెలిసినాడు. అంటే పైన చెప్పిన రెండు అంశాలు వస్తువుల విలువను నిర్ణయిస్తా యని అతని భావం. వస్తువులకు ఉండే ఆవశ్య కతను బట్టి దాని విలువ ఉంటుందనీ, ఈ అవసరం తక్కువగా ఉంటే దాని విలువ తక్కు వగా ఉంటుందనే ఆత్మాశ్రయమూల్య సిద్ధాంతం (Subjective Value Theory) ని కనుకొన్నాడనే చెప్పవలె.

వినిమయము సంపదను హెచ్చించదనే ప్రకృతి ధర్మవాదుల పొరబాటుకు కారణం వస్తువు విలువ మానవుని మానసిక తత్వముపై ఆధారపడి ఉంటుం దనేది వారు గుర్తించక పోవడమేనని సూచించి నాడు. మనకు సులభంగా దొరికే వస్తువు మనకు నిరుపయోగం; కాని దాన్ని కోనేవాడికి అది దుర్లభం. దానికి ఎంతో విలువ ఉంటుంది. విని మయంలో మనకు నిరుపయోగమైన దానితో మనకు అత్యంత అవశ్యకమైన దాన్ని కొంటాము. ఇందులో దాని విలువ ఇమిడి ఉందనేదే కొండిలాక్ సిద్ధాంతం. ఇందులో ఆధునికుల ఉపాంత విశ్లేషణ పద్ధతి (Modern Marginal Analysis) లేకున్నా, ఆ భావన ధ్వనిగానైనా ఉంది. దీన్ని ప్రాతిపదికగా చేసుకొని అన్నివృత్తులూ అవసరమనీ, వాటికి సమానమైన ఆవశ్యకత ఉందనే సిద్ధాం తాన్ని చేసినాడు. అంతే ప్రకృతి ధర్మవాదుల వాదనకు భిన్నమైన 'వాదాన్ని చేసినాడు.

### ఆర్థిక శాస్త్రాభివృద్ధిలో ప్రకృతి ధర్మవాదుల పాత్ర —విమర్శ :

కెనె తయారు చేసిన పట్టికకు ఆకాలంలో ప్రముఖస్థానం లభించింది. దాదాపు ఆధునిక యుగం ఆరంభం దాకా దాన్ని 'గురించి ఎంతో చర్చ జరిగింది. ఆర్థిక వృద్ధి సిద్ధాంతాలు ప్రాముఖ్యంలోనికి రావడంతో దాని వైశిష్ట్యాన్ని మరింతగా గుర్తించడం జరిగింది. ఆర్థికవ్యవస్థలో ధనప్రసారం ఎట్లా జరుగుతుందో ఈ పట్టిక నిరూపిస్తుంది. ఎదుగుబొదుగులు లేని ఆర్థిక వ్యవస్థ (Economy in a Stationary State) ఏ సూత్రాలకు లోబడి పని చేస్తుందో ఆ సూత్రా లను విశదీకరించడమే ఆ పట్టిక లక్ష్యం. ఇట్లా ఆర్థికవ్యవస్థయొక్క జీవప్రక్రియ (Physiology)ను కనుక్కోవడానికి జరిగిన తొలి ప్రయత్నం కెనె చేసినాడని నిస్సందేహంగా చెప్పవచ్చు. వ్యవసాయమే ఉత్పాదక క్రియ అనీ, మిగిలినవన్నీ దీనిమీద ఆధారపడినవనేది మరొక లక్షణం. మిగిలిన అన్ని రంగాలకు ఆధారం వ్యవసాయరంగంలో లభించే నికరాదాయము లేదా భాటకము నని నిరూపించ డానికి ప్రయత్నించినాడు. కానీ ఈ విషయాన్ని ఆశించిన విధంగా నిరూపించలేదు. ఈ నిరూపణం జరగకపోవడానికి కారణం ఆ నిరూపణం అసంభవ మవడమే అని ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదు. ఆర్థిక వ్యవస్థలోని వివిధ రంగాలు ఎట్లా పరస్పర మాధారపడతాయో ఆధునిక వృద్ధి సిద్ధాం తాలు నిరూపించే వరకూ మనకు తెలియలేదు.

స్వేచ్ఛా వ్యాపారంవల్ల దేశానికి చేకూరే లాభాలను గురించి వాదించడంలో కెనె, ఆడమ్ స్మిత్‌కు సన్నిహితుడనవచ్చు. ధనమంటే జీవనానికి అవసరమైన వస్తుసముదాయాన్ని ఉత్పత్తి చేసే దానికి మాత్రమేనని వాదించినాడు.

### ప్రభుత్వ విత్తం : Public Finance

ప్రభుత్వం ఋణాల ద్వారా ధనాన్ని సేక రిస్తే వ్యవసాయరంగంలో పెట్టుబడికి అవసర మయ్యే మూలధనం కొరత పడుతుందనినాడు. ఇట్లా చెయ్యడంవల్ల వ్యవసాయేతర వృత్తులు మేలు 'పొందుతాయేకానీ వ్యవసాయం దెబ్బ తింటుంది. అందువల్ల సాధ్యమైనంత వరకు ప్రభు త్వం ఋణసేకరణకు పూనుకోరాదు. వ్యవసాయం మాత్రమే ఉత్పాదకం కావడంవల్ల— అంటే అదనపువిలువ (మిగులు) ఈ రంగంలోనే లభి స్తుందని అర్థం— పన్నులన్నీ ఈ నికరోత్పత్తి నుండే చెల్లించబడతాయి, కనక వ్యవసాయం పైన

ఒకే పన్ను (Single Tax) విధిస్తే బాగుంటుం దనినాడు. భూస్వాము లనుకొన్న పెక్కుపన్నుల పద్ధతి (Multiple Tax System) ఇటు వారికి గానీ అటు సంఘానికి గానీ లాభంకాదని అభిప్రాయ పడినాడు.

ప్రకృతి ధర్మవాదుల రచనలలో ముఖ్యంగా గమనించవలసింది వ్యతిరేకవాదం (Negativism). ఈ వాదం ఫ్రాన్సు దేశంలో బలపడిన వాణిజ్య వాదానికి వ్యతిరేకంగా ఏర్పడినదనే విషయం ఇది వరకే తెలుసుకొన్నాం. వాణిజ్యవాదులకు వీరికి సంపద విషయంలో కొన్ని వరౌలికమైన తగాదా లున్నాయి— వాణిజ్యవాదులు ధనమే సంపద అని భావిస్తే వీరు వస్తురూపంలో ఉండేదే సంపద అని నారు. విదేశ వ్యాపారం దేశానికి అనుకూలంగా ఉండవలెనని వాణిజ్యవాదులంటే వీరు దాన్ని ఖం డించినారు. వారు దేశం తయారు చేసిన వస్తువు లనే ఎగుమతి చెయ్యవలెనంటే వీరు ముడిపదార్థా లను కూడా ఎగుమతి చెయ్యవచ్చునినారు. క్లుప్తంగా చెప్పాలంటే ప్రకృతి ధర్మవాదులు కృతకమైన సంపదనూ, దాన్ని ఆర్జించడానికి ప్రభుత్వం చేసే ప్రయత్నాలను తీవ్రంగా విమర్శించినారు. కానీ వారి వాదం అంత సమర్థనీయంగా తోచదు. పరిశ్రమలు కూడా ఉత్పాదనాలే అనే విషయాన్ని వారు గ్రహించలేకపోయినారు. కేవలం వ్యవసాయం వల్లనే జాతీయాదాయాన్ని పెంచగలమని వాదించి నారు. పారిశ్రామిక ఉత్పత్తి కూడా ప్రయోజ నాన్ని సృష్టిస్తా (Creation of Utility) యనే విషయాన్ని ఊహించలేకపోయినారు అంటే పారి శ్రామికోత్పత్తి జరిగినప్పుడు అది రూపప్రయోజనాన్ని (Form Utility) సృష్టిస్తుందనే దాన్ని గుర్తించ లేకపోయినారు. ఇదే వారి వాదంలోని ముఖ్యమైన లోపం. ఇంతమాత్రాన వారు ఆర్థికశాస్త్రాభివృద్ధికి చేసిన సేవ ఏమీ లేదనుకోకూడదు. వారు చేసిన సేవను క్లుప్తంగా తెలుసుకొంటాము.

1. ఆర్థిక శాస్త్రానికి ఒక శాస్త్రీయమైన సాంకేతికమైన రూపాన్ని ఇచ్చినారు. దీని ఫలితంగా ఆ శాస్త్రానికి మిగిలిన సాంఘిక శాస్త్రాలలో విశిష్ట స్థానం లభించింది.

2. వ్యవసాయరంగంలో ఏర్పడే నికర ఉత్పా దనము తరువాతి భాటకవిషయికమైన (Thearics of Rent) సిద్ధాంతాలకు మూలమైంది.

3. మూలధనాన్ని గురించి చేసిన చర్చలు చాలా ప్రాముఖ్యం వహించినాయి.

4. పన్నుల విధానానికి సంబంధించిన వారి అభిప్రాయాలు ముందు తరాలవారికి మార్గదర్శకా లైనాయి.

5. సంఘంలో వ్యక్తుల మధ్య ఉండే పరస్పర సంబంధాన్ని స్పష్టంగా తెలిపినారు.

6. భూమికి సంబంధించి వారు చేసిన చర్చల వల్ల తరువాతి వారు దీనికి ఇవ్వవలసిన ప్రాధాన్యతను గుర్తించినారు. తరవాత వచ్చిన సిద్ధాంతాలలో ఉత్పత్తికారకాలలో (Factors of Production) ప్రముఖస్థానం ఇవ్వడం జరిగింది.

———



# కాకతీయ యుగము-శాసన కవులు

శ్రీ వై. గోపాలరెడ్డి

శాతవాహన సామ్రాజ్య మంతరించిన పిదప నంతటి సువిశాల భూభాగముపై పరిపాలనమును నెఱపిన రాజవంశము కాకతీయ వంశమే. కాకతీయయుగము గీర్వాణాంధ్ర వాఙ్మయ పోషణమున పెట్టినది పేరుగ నుండెను. కవులు పెక్కండ్రు కావ్యనాటకాదుల రచించియు, విద్వచ్ఛిఖామణు లనేకులు వివిధ శాస్త్రముల జర్చించియు సంస్కృత భాషా యోషకు నూతనాలంకారముల నొనగూర్చిరి. ఆంధ్రకవితకు రాజమహేంద్రవర విక్రమసింహపురములకు బిమ్మట నోర్గల్లుపురమే రంగస్థలముగ నుండినది. కాకతీయ చక్రవర్తుల యాదరణముననే పౌరాణికయుగ మంతరించి భావిప్రబంధయుగమునకు మార్గ మేర్పడినది.

స్వర్గీయ శ్రీమాన్ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు కాకతీయాంధ్రయుగ సారస్వతమును గురించి ఈ క్రింది విధముగ వక్కాణించినారు.

"The Kakatiya Age marks an important epoch in Telugu literature and Sanskrit learning.........Perhaps the best Telugu literature freed from Sanskrit domination is seen only during this period. The Age of Nannaya which preceeded the Kakatiya epoch saw the Virtual beginnings of Telugu literature, and despite all attempts to run on original lines Telugu literature could not escape the trammels of Sanskrit, in diction and idiom even in the works of the greatest and most origianl poet of this age, namely Nannaya. The Age of Srinatha or the Reddi Age, as it is sometimes called, which succeeded the Kakatiya epoch, is characterised by conscious attempt to Sanskritize Telugu literature-a feature which continued even in the subsequent times under Vijaya nagara and post-Vijayanagara rulers. The Kakatiya epoch breaths a rare spirit of purity, individuality and natural beauty in Telugu Poetry..... ......On Sanskrit it was primarily an Age of the Rhetorician, but the Rhetorician was not a mere theorizing scholar and analytical critic but a scholar of taste 'Practising' Poetry, with his emotions confined in a prison of principle, propriety and orthodoxy".1

కాకతీయ యుగమందు, సంస్కృతమున ననల్ప కల్పనా విలసితములగు శాసనముల రచించి యజరామరమగు యశఃకాయమున ప్రకాశించిన కవితల్లజు లనేకులు గలరు. కాని వారందరు, అజ్ఞాతముగ నున్నారు. కాకతీయ శాసనములందు పేర్కొన్న పలు సంస్కృత కవీంద్రులను గూర్చి చర్చించుటయే యీ వ్యాస ముఖ్యోద్దేశము.

## అచింతేంద్రవర్యుడు

ఇతడు కాకతి రుద్రదేవ మహారాజ అనుమకొండ శాసన (క్రీ. శ. 1163) ప్రవక్త. భారద్వాజ గోత్రుడు. శ్రౌతక్రియాదక్షుడు. రామేశ్వర దీక్షిత పుత్రుడు. అద్వయామృతయతికి శిష్యుడు. అచింతేంద్రవర్యుడు అనుమకొండ శాసనమును శుద్ధకావ్యధోరణిలో చిత్రించినను, ఆనాటి సాంఘిక వాతావరణమును అతి సహజముగ, సుందరముగ కనులకు కట్టినట్లు

వర్ణించినాడు. కాకతీయ రాజధానినగరమైన అనుమకొండ వర్ణన మెంత హృదయంగమముగ నున్నదో చూడుడు.

తత్రాస్తేనుమకొండ నామ నగరీ
శ్రీరాజధానీ వ యా
యత్రోద్యత్ప్రదఖండ ఖండ పరశు
వ్యాజృంభణోజ్జృంభితా ।
కందర్పస్య పురీ వ సా రతిమతీ
శృంగారభావాన్వితా
మాహేంద్రీవ చ జిష్ణు విష్ణు సహితా
రంభావిలాసోర్జితా॥

యత్ర స్త్రియో మకరకేతన రాజధాన్యా
ఆనీల నీరజపలాశ దృశః కృశాంగ్యః
త్రైలోక్య సుందర దృశాం తిలకాయమానా
ఆపీనతుంగ కుచకుంభ భరా లసాంగ్యః
యత్ర ద్విజేంద్ర భవనేషు నివార్యమాణాః
కీరాః పఠంతి పటవో వటుభి స్సమేతాః ।
సర్వాంగ సంగత సమస్త విచార చారు
చారిత్ర చర్చిత పద క్రమ యుక్త వేదాన్॥

వేశ్యాగృహేషు సురతోత్సవజాతచేష్టాః
శబ్దానుకారి శుకశారికచారుశబ్దాః
సర్వా దిశో ముఖరయంతి దివా విటానాం
కందర్ప దర్ప తరలార్ణవ పూర్ణచంద్రాః[2]॥

అచింత్రేదవరు నలంకారే ప్రయోగ మెంతేని సహజముగ, సమర్థముగ నుండును.

భీమేన భీమనకులేన కులేన హీనో
గ్రస్తో మమార గృహమూషకవత్ క్షణేన
మార్జాల డింభక వరేణ మహాంధకారే
గోకర్ణనామ భుజగో భువి శూరమానీ॥

ఏకో జంబుక డింభకో లఘుతరైః
సంవేష్టితో జంబుకై
రాజాహంకృతి ధిక్కృతక్షితితల
స్సింహాసనం స్పర్ధతే ।
ఫీత్కారాకుల గర్జితైర్ముఖరయ
న్సర్వా దిశో విహ్వలో

యాతః క్వాపి సటా విధూనన భరైః
కంఠీరవ స్త్వాతురః[3]

## ఈశ్వర సూరి

ఇతడు మయూరార్య పుత్రుడు. తరణికంటి ఈశ్వర భట్టోపాధ్యాయుడు, ఈశ్వరభట్టోపాధ్యాయుడు అనున వీతనికి మారుపేళ్లు. మహబూబ్ నగరు జిల్లాలోని బూదపురము నందున్న రెండు శాసనములు(క్రీ.శ. 125?, 1272) ఈశ్వరసూరి సత్కావ్య రచనా సామర్థ్యమునకు మచ్చుతునకలు.[4]

బూదపురము శాసనములలో నొకదాని యందు (క్రీ. శ. 1272) ఈశ్వరసూరి 'పాణినీయ వ్యాకరణ విచిత్ర కవిత్వ తత్త్వజ్ఞుండ' నియు 'పదక్రమయుత యజుర్వేద పారంగు డ'నియు పేర్కొనబడి యున్నది.[5] చిత్రకవిత, బంధకవిత, శబ్దవిద్య యం దీతడు దిట్ట. పై పేర్కొన్న రెండు శాసనముల చివరను పద్మబంధము, చక్రబంధము, ఈశ్వరసూరికి చిత్రకవిత్వ మందున్న వైదగ్ధ్యమునకు మచ్చుతునకలు.[6] శబ్దవిద్యావిశారదుడు, కవీశ్వరుడు అనునవి యీతనికి బిరుదములుగా కాన్పట్టును.[7]

మాల్యాల గుండదండాధీశు నాస్థానకవులలో నీశ్వరసూరి ప్రథముడు. కల్పనాచమత్కృతి యందు, రసపోషణమునందు, అర్థగౌరవమునం దీతడు ఆరితేరిన కవి. అపశబ్దాభాస, అవ్యయాభాస, పునరుక్త్యాభాస, క్రియాపదభ్రమకము, క్రియాపదత్రయ గోపకము, స్తబకావళి, మిథునావళి, పాదాదియమకము, శబ్దాలంకారము, అక్షర ముష్టిత, అనవ్రతాక్షర ప్రయోగము లీతని కవిత యందు గోచరించును.[8]

## రేపి

క్రీ. శ. 1214 నాటి దగు గణపవర శాసనమం దీతని ప్రశంస గలదు. వందిసుతుడు. భారద్వాజగోత్రుడు. వేశ్యాప్రియా భుజంగుడు. సుచరిత నిరతుడు.[9] కల్పనాచమత్కృతిలో నీత డసమానుడు. ఈతని శైలి సులభముగ, తేజోవంతముగ, ప్రసన్నముగ నుండును. వర్ణనలు సహజ సుందరముగ,

మనోజ్ఞముగ, సహృదయ హృదయంగమముగ నున్నవి. గణపవర శాసనము నందలి 16 వ శ్లోకములోని పంట చేల వర్ణన విశేషము పై నుడివినదానికి తార్కాణము.

## అనంతసూరి

ఈతడు గోవిందభట్టు దౌహిత్రుడు.[10] కాకతి రుద్రదేవుని సామంతుడైన ఇమ్మాది మల్లికార్జున దేవు నాస్థానపండితుడు.[11] ఈతని కవిత్వమందు పటిమ, ఘనత, శోభ కానరాదు. అనంతసూరి విరచితమైన పానుగల్లు శాసనము (క్రీ. శ. 1290) శబ్దార్థ ప్రాధాన్యముతో నున్నది. అవిశేషమైన ఉపమా లంకారములు,సాంకేతిక వర్ణనలిందుమెండుగనున్నయవి.

## నాగదేవ కవి

దామోదరార్యుని కొమరుడు. సకల శాస్త్రము లం దభినివేశము గలవాడు. కాకతి రుద్రదేవుని సామంతుడైన గంగాధరుని యాస్థానకవి [12]. నాగదేవకవి తన ప్రభువైన గంగాధరుని, అతని రంజన వంశమును సహజ కావ్య సరళిలో ఎంతో మృదుమధుర ముగ, రసికజనమనోరంజకముగా బెక్కల్లు శాసనము నందు చిత్రించినాడు [13]. శబ్ద సౌందర్యము, రచనా సౌంధర్యము, వస్త్వైక్యము, ఘన శబ్దస్ఫూర్తి యీతని కవిత్వమున ప్రస్ఫుటముగ గానవచ్చును.

## అభినవ మయూరసూరి

గణపతిదేవ మహారాజు కాలమునాటిదగు వడ్డమాను శాసనము (క్రీ. శ. 1245) వలన అభినవ మయూరసూరి మాల్యాల గుండ దండనాయకుని ఆస్థాన కవులలో నొకడుగ అవగతమగుచున్నది.[14] పై శాసనమందు 165 పంక్తులున్నవి. అందులో 41 పంక్తులు తెనుగు వచనమందు, మిగిలినవి సంస్కృత శ్లోకముల లోను నున్నవి. ఈ శాసనమంతయు ఉత్కృష్ట శైలిలో లిఖింపబడియున్నది.

అభినవ మయూర సూరి కవిత్వము నిర్దుష్టమై, ప్రౌఢమై మనోహరముగ నున్నది. శ్రోతకు ప్రత్యక్ష కల్పమైన సంవేదనము ఉదయించుతీరున ప్రతిపాదించుటలో నీతడు సిద్ధహస్తుడు. శాసనమః చివరనున్న చక్రబంధము, గోమూత్రికాబంధములు, బంధకవితలో అభినవ మయూరసూరి కున్న ప్రావీణ్యమును వెలువరించుచున్నవి.[15]

లింగాల శాసనమం దీతడు ఆత్రేయగోత్రుం డనియు, ఈశ్వరహరి తనయుండనియు, పదవాక్య ప్రమాణ ప్రమేయ విచిత్ర కవిత్వ తతజ్ఞుండనియు పేర్కొనబడియున్నాడు.ఈ శాసనమంతయుసంస్కృత శ్లోకములతో విరాజిల్లుచున్నది.[16]

## రవిచక్రవర్తి

గణపతిదేవ మహారాజ పాకాల శాసనమువలన రవిచక్రవర్తికి 'కవిచక్రవర్తి' అను బిరుదున్నదని తెలియుచున్నది.[17] ఈతడు జగదాల ముమ్మడి యాస్థాన కవి. రవిచక్రవర్తి కవిత్వము, ఉదాత్తముగను, నిర్దుష్టముగను నున్నది. స్వాభావికమైన వర్ణనలకంటె నుత్ప్రేక్షాదులయందె యీ కవి కభిరుచి మెండు.

## విష్ణుసూరి

ఇతడు అద్వయానంద కృష్ణుని శిష్యుడు. ఇతనికి సంస్కృతములో నున్న సౌలభ్యము క్రీ. శ. 1295నాటిదగు మగతల శాసనము వలన దెలియుచున్నది.[18]

## వేంకటభట్టోపాధ్యాయుడు

ఇతడు వేదశాస్త్రార్థతత్త్వజ్ఞుడు. ఇతడు రచించిన మున్ననూరి శాసనము సంస్కృతాంధ్ర సమ్మిళితము.[19]

## మాయి భట్టోపాధ్యాయుడు

మహబూబునగరు జిల్లాలోని ఉమామహేశ్వర మను గ్రామమందు దొరికిన శాసనమందు మాయి భట్టోపాధ్యాయునికి 'పదవాక్య ప్రమాణజ్ఞ'డని బిరుదున్నట్లు తెలుపబడినది.[20] ఉత్తమ కవిత్వ లక్షణము లలో మొదటిదగు ధారాశుద్ధి యీతని కవిత్వమందు గోచరించుచున్నది. ఇతడు బంధకవితలోను ప్రజ్ఞాశాలి యనుటకు ఉమామహేశ్వర శాసనము చివర నున్న చక్రబంధమే తార్కాణము.

## మాధవుడు

ఇతడు ఈశ్వరార్యపుత్రుడు. మెదకు జిల్లాలోని ముడిమాణిక్యమను గ్రామమందు దొరకిన శాసనము ఇతని కవిత్వమునకు మచ్చుతునక.[21]

## నా గ నా థు డు

ఇతడు పశుపతి పుత్రుడు. కౌశిక గోత్రుడు. వరంగల్లుజిల్లాలోని అయినవోలు గ్రామమందు దొరకిన శాసనము ఇతనిచే రచింపబడినది.22 రేచర్ల, కాకతీయ వంశముల వర్ణనము, రేచర్లదాచయ పాండ్యుల జయించుట, దాచయపుత్రుండైన సింగన జైత్ర యాత్రలు, నాగనాథుడు శుద్ధ కావ్య ధోరణిలో రసికజనమనోరంజకముగ చిత్రీకరించినాడు

పైన పేర్కొన్న కవీంద్రులేగాక మరెందరో కాకతీయాంధ్ర యుగ మందుండి సంస్కృత భాషా యోషకు నూతనాలంకారము లొనర్చినట్లు వారి శాసనములే తెల్పుచున్నవి. పిల్లలమఱ్ఱి శాసనములు, కొండిపర్తి శాసనములు, కోటగిరి తామ్ర శాసనము, పాలంపేట శాసనము మరెన్నియో శాసనము లానాటి వాఙ్మయమును గురించి ఏన్నియో నూతనాంశ ముల వెలువరించుచున్నవి. కాని ఆ శాసనముల రచించిన కవితల్లజులపేళ్లు ఆ శాసనములందు కానరాకుండ అజ్ఞాతముగ నుండుట దురదృష్టము.

పాలంపేట శాసనకర్త పేరు తెలియకున్నను అతనికి సంస్కృత వాఙ్మయమందున్న ప్రజ్ఞ ప్రస్ఫుటముగ శాసనమువలన దెలియు చున్నది. కల్పనాచమత్కృతి, భావోత్ప్రేక్ష, అర్థ గౌరవము, రచనాసౌందర్యము, పరిశీలనా నైశిత్యము, భావ సూక్ష్మముల ప్రదర్శనము, పాలంపేట శాసనమందు మెండనుటకు ఈ క్రింది శ్లోకములు తార్కాణము:—

కాకతి గణపతిదేవ చక్రవర్తి విక్రమ ప్రశంస:23

శ్రీ మద్గణపతి క్షోణీ
పతి ర్జయతి జిత్వరః ।
యచ్చిత్తేపి వస న్నిత్యో
న ముంచ త్యచల స్థితిః ॥

ప్రస్థానే యస్య వాజి వ్రజ ఖురదలితా
దుత్థితా భూమిభాగో
ద్భూత స్ఫీతానుకూల ప్రసృత పవనతో
ధూళి రగ్రే వ్రజంతీ
పృథ్వీ తేనానువేలం నిఖిల నయవిదా
రక్షితా తత్ప్రియార్థం
తద్వైరిక్షోణి పాలాన్ స్వయమివ రభసా
హంతు మగ్రే ప్రయాంతీ॥

సేవార్థ మాగత మహీపతివాహనేభ
హస్తాగ్రసు(స్రు)త పయః పృషతాభిషిక్తః
తీవ్రే నిదాఘ సమయేపి సుశీర(త)గాత్రో
లోకో యదీయ భవనాంగణదేశవర్తీ ॥

కాకతి రెండవ ప్రోలరాజు సేనానియగు రేచర్ల కామచమూపతి విజయ విలాస ప్రశంస:24

శ్రీమ త్ప్రోల నృపాల సైన్యపతినా
విఖ్యాత విక్రాంతినా
యుద్ధే యేన మహాబలేన నిహతే
మంథన్య గుండాధిపే ।
అన్యే వైరి నృపాలకాః ప్రతిదిశం
ప్రాదుద్రువం స్తత్క్షణా
త్సింహేనేవ నిపాతితే గజప
శేషాగజాః క్షుద్రకాః॥

రేచర్ల రుద్రసేనానిచే నిర్మితమైన కోనేటి వర్ణన:25

యస్మిం త్సూర్మి శ్రేణిభి స్తాయమానా
స్తోయప్రాంతే ఫేన మాలాః సమంతాత్ ।
వేలాలోల స్ఫార శంఖావలీనాం
తుల్యాకారాః కుర్వతే సింధు సామ్యం॥

యదీయ మంబు నిఖిలా
గృహ్ణంతి ధ్రువ మంబుదాః ।
న సాముద్రం యతః స్వాదు
జలం వర్షంతి సర్వతః॥

యస్యాతి నిర్మలజలం ప్రతిబింబచ్ఛలేన
తారాః ప్రవిశ్య విమలాః నిఖిలాః క్షపాసు ।
కుర్వంతి నూన ముదవాసతపః ప్రకామం
పూర్ణేందునా సహ సమాగమనాయ నిత్యం॥

మందోదంచ త్ప్రచురవిలస
ల్లోల కల్లోల మాలా

దోలా లీలా సుఖిత విహగ
వ్యూహకాంతే సమంతాత్ ।
యత్రోద్భ్రాంతా నమల పృషతాం
శ్చాతకా మీనపుచ్ఛైః
గ్రీష్మేదూరా దభినిపతతో
దృష్టి మోహా త్పిబంతి॥.

1. A Corpus of Inscriptions in the Telangana Districts of H E. H. The Nizams Dominions (HAS; No. 13), Hyderabad. 1942; part I, pp. 13, 17.
2. HAS; No. 13, p. 14; VV. 42—45.
3. Ibid; p. 11, VV. 16 & 19.
4. Ibid; No. 13, Nos. 51, 52.
5. Ibid; P. 143, lines. 23, 24, 25.
6. Ibid; part I, p. 9.
7. Ibid; p. 140, lines. 7 & 8-
8. Ibid; part I, pp. 9 ff.
9. Ibid; p. 76, V. 12.
10. Ibid; p. 103, V. 10.
11. Ibid; part I, p. 12.
12. Telangana Inscriptions, Vol II, pp. 95 ff.
13. Ibid.
14. HAS; No. 6, pp. 107 ff.
15. HAS; No. 19, Mn. 47; pp. 97 ff.
16. Ibid; Mn. 17, pp. 47 ff.
17. Ibid; Wg 15, pp. 150 ff.
18. Ibid; Mn. 25, pp. 58 ff.
19. Ibid; Mn. 28. pp. 64 ff.
20. Ibid; Mn. 35, pp. 72 ff.
21. Ibid; Md. 1. pp. 104 ff.
22. Ibid; Wg. 1, pp. 119 ff.
23. Ramappa and other Temples at Palampet (Hyderabad. 1953); pp. 15 ff; VV. 5 to 7.
24. Ibid; p. 16, V. 15.
25. Ibid; p. 20, VV. 41—44.



# జ్ఞానోదయం

శ్రీ శివకుమార్

జీవితాన్ని ఆరాధిస్తాను
జగత్తును ప్రేమిస్తాను
కనిపించే సత్యాన్ని
కనులతో ముద్దిడుకున్నాను.

ఆద్యంతరహిత జగత్తును
అనంతంగా మడిచి నా ఎదలో
పదిల పరచుకున్నాను.
జీవితమూ జగత్తూ
ఏకమై కలిసిపోయే క్షణంవరకూ
చైతన్య స్రవంతిలో
కాలవేగంతో పరుగులెత్తాను.
జీవ జగత్తులమధ్య ప్రేమ
వియోగ సంయోగాల జీవితార్థం
తేట తెల్లంగా తెలిసింది.
ప్రేమ దీపాన్ని కరాళమృత్యువు కబళిస్తే
జీవితపు వెలుగులు తొలగి
చీకటి ముసుగు ఆవరిస్తుంది.

# ఆంధ్రప్రబంధములలో గ్రంథగ్రంథులు

శ్రీ బంది నాగరాజు

పై శీర్షికతో "భారతి" (జనవరి, 70) లో ఒక వ్యాసము పడినది (12.....16పుటలు.). ఎనుబదియేండ్ల ప్రాయము గలిగి ఏబదియేండ్ల నుండియు భాషాసేవ సేయుచున్న శ్రీ క్రరి సాంబమూర్తిశాస్త్రిగారు పయి వ్యాసమును వ్రాసిరి. నేటి ముద్రిత గ్రంథములందు అచ్చు తప్పులతో పాటు, లేఖకులయు, పరిష్కర్తలయు లోపముల వలన అనేక గ్రంథ గ్రంథులు చోటు చేసుకొని కాల క్రమమున అవి దుర్భేద్యములై నిలిచియున్నవి. పెద్దలెంద రెన్నిటిని శస్త్ర చికిత్స చేసినను ఆ గ్రంథ గ్రంథులు సమసిపోకున్నవి. శ్రీ శాస్త్రిగారు కొన్నిటిని పయి వ్యాసమున యథాశక్తి సంస్కరించుటకు పూనుకొని ఆంధ్ర సారస్వతేయుల కృతజ్ఞతకు పాత్రులైనారు. వారికి ధన్యవాదములు.

గ్రంథికి, కంతి—గనుపు—ముడి అని నిఘంటువు చెప్పు వర్థములు. అపూర్వమైన శబ్ద స్వరూపమో, ప్రరూఢముగాని సాంప్రదాయికార్థముగల పదప్రయోగమో, అన్వయక్లేశము అర్థావగతికి ఆటంకము గలిగించు నుడియో —నానుడియో 'గ్రంథి' అనబడుచున్నది. ముడిని విడదీసినట్లు, గనుపును మనుపు చేసినట్లు, కంతిని కత్తిరించినట్లు గ్రంథము లందలి యిట్టి గ్రంథులను పండిత ప్రవరు లుపేక్షింపక సుగమము చేయవలసియున్నది. శ్రీ శాస్త్రిగారు ఇటి పని చేయ దొరకొన్నారు. కాని, వారు కొన్ని సుగమములైన ప్రయోగములను గూడ గ్రంథ గ్రంథులుగా భావించి వివరింప యత్నించినారు. వారు ప్రదర్శించిన గ్రంథ గ్రంథుల గూర్చి నేను నేర్చినయట్లు కొంత మనవి చేసెదను. ఉచితజ్ఞులు నన్ను మన్నింతురుగాక!

## 1. పల్కకయుండు

ధర్మరాజు, కృష్ణుని రాయబారిగా పంపుచు ఆతనితో చెప్పినది—

పగ యడగించు టెంతయు శు
భం బది లెస్స యడంగునే పగం
బగ? పగగొన్న మాన్కొనక
పల్కక యుండుగ వచ్చునే? కడుం
దెగ మొదలెత్తిపోవ బగ
దీర్పగ వచ్చిన శౌర్యమొందు వే
మి గతిఁ దలచినం బగకు
మేలిమి లేమి ధ్రువంబు కేశవా!

—ఉద్యోగ. III. 21.

విరోధము సంభవించినప్పుడు ఎదుర్కొనవలయును, గాని పల్కకుండుట తగునా? అనగా ఊరకుండరాదు—అని, "పగ గొన్న మాన్కొనక, పల్కక యుండుగ వచ్చునే?" అను వాక్యమున కర్థము. పల్కక యుండుట అనగా మాటాడకుండుట, మౌనము వహించుట, ఊరకుండుట అని యర్థము. ఇది సుగమమైన సహజార్థము. ఇందు 'ఇన్ని బాధలు పడుట' ఏమియును లేదు. నెల్లూరుజిల్లాలో "పలక్కుండు' అనే మాట యిప్పటికిని బహుళ ప్రచారములోనున్నది. ఇది 'పల్కక యుండు' యొక్క భ్రష్ట రూపమే. నెల్లూరివాడగు తిక్కన యీ మాటను 'పల్కక యుండగ వచ్చునే' అనియే వాడియుండును.

శాస్త్రిగారు 'పల్కకయుండు'కు బదులు 'పల్లకయుండు'' అని సంస్కరణము సూచించినారు. "పల్లక, విశ్శబ్దముగా, నిష్క్రియముగా వని యర్థ''మని వారన్నారు. పల్కక, పల్లక— రెండును ఒకే యర్థమును చెప్పుచుండగా ఇంక సంస్కరణము దేనికి? 'పల్కక'లో దూరాన్వయ మున్నదని భావించుట ఏల!

"పల్లక పదము దేశ్యము. అనాడు వ్యవహారములో నుండి యీ నాటికి విరళప్రయోగమైనది. శ్రీకాకుళము, గంజాము మండలములం దీవాడున

బహుళ వ్యవహారమున నున్నది. (శ్రీశ్రీ బెజవాడ రామ చంద్రారెడ్డిగారొక సభలో నిశ్శబ్దము చేయుటకు 'పల్లకొండి పల్లకొండి' యని హెచ్చరించిరి'' అని శాస్త్రిగారు పల్లక శబ్దమును గూర్చి వివరించిరి. కాని యిదియు ''పల్కకుండుడి'' అనుమాటయొక్క భ్రష్టరూపమై యుండవచ్చును.

## 2. క ల ప్యా ది

''నన్నెచోడ మహాకవి కుమారసంభవమున హిమవంతుడు, హిమగిరిపై( దపమున కరుదెంచిన శంకరు నర్చించి, పార్వతిని పరిచారమునకు నియోగింప వెడలు సందర్భమున 'కలకలప్యాది సమస్త వస్తువులం గూర్చికొని' యని కలదు'' అని శాస్త్రిగారు అన్నారు. చిత్ర మేమనగా ఈ గ్రంథి, ఆ గ్రంథమున ఏ తత్సందర్భమునగాని మరెచ్చటనుగాని లేదు. వారు సందర్భముతోపాటు ఆశ్వాస పద్య సంఖ్యలు గూడ ఇచ్చియుండవలసినది. వెదకగా ఆ సందర్భమున నున్న దిది—

సీ. ... ... ...

ఎ. గీ. తెలిసి జక్కవ లొండొంటి గలయఁ దారు
కలకలంబున రేకులు గదలకుండ ...

—కు. సం. III, 108.

శాస్త్రిగారు ఉన్నదని చెప్పిన 'కలప్యాది' గాని, ఉండవలసినదని సూచించిన సంస్కరణమగు 'కలపాది' గాని యిక్కడ ఎంతవరకు సందర్భపడునో వారే చెప్పవలసి యున్నది. ''కలకలప్యాదిరేకులు...'' అనుచో అర్థభంగమును., ''కలకలపాదిరేకులు...'' అన్నప్పుడు అర్థచ్ఛందోభంగములు రెండును సంభవించునుగదా!

కలప మన సువాసన ద్రవ్య మిళితమగు చందన మనియు., కలపము+ఆది=కలప+ఆది=కలపాది— అనురీతిగా ఈ మిశ్ర సమాసము ఏర్పడుననియు, శివకవు లిట్టి దుష్టసమాసప్రయోగములు గావించినారనియు, నన్నెచోడుడే ''విగుర్వణ జృంభణంబులన్'' అని ప్రయోగించినాడనియు శాస్త్రిగారి వాదము.

కలపము—దేశ్యము., ఆది— సంస్కృతము. 'కలప మాదిగ సమస్త గంధ ద్రవ్యములు' అని యిట్లు ప్రయోగించుట దోష మేమియు గాదు. కాని కలపములోని ముపర్ణమునకు లోపమును తరువాత (కలప+ఆది=కలపాది) సవర్ణదీర్ఘ సంధియు విశేషములే. 'పుడమిఱేఁడు' వంటి ప్రయోగములు (బస. 324) శివకవులు వాడి యున్నారు. 'పుడమిపుఁడు' అని నన్నెచోడుడును ప్రయోగించినాడు (కు.సం. XI, 44); వలరాజ పల్లవ (III, 57); హరుషాశుధారలు (XII, 213); వనేచరియులు (VI, 44.)వంటివి కుమారసంభవమున అనేకము గలవు.

ఐతే, నన్నెచోడుడు ''విగుర్వణ జృంభణంబులన్'' అని ప్రయోగించినాడని యీ సందర్భముగా శాస్త్రిగారు చెప్పినారు. ఆ ప్రయోగ మట్లుగాదు— ''పటుదోర్బల గర్వ విగుర్వణంబులన్'' అని. 'కేవల సంస్కృత శబ్దము వికృతి శబ్దము తోడ సమసింపదు.' అను బాలవ్యాకరణవృత్తి(సమాస-3)ప్రకారముమీదిది దుష్టసమాస మనియు, అట్టి దుస్సమాసములు శివకవులు ప్రయోగించి యున్నారనియు శాస్త్రిగారి తాత్పర్యము., ఐతే ఈ చర్చ ''కలపాది'' సాధుత్వమునకు సంబంధించినది. వారు చెప్పిన గ్రంథ గ్రంథియగు ''కలకలప్యాది'' లేనప్పుడు 'కలపాది సాధుత్వ చర్చ' అనవసరము గదా!

## 3. ప్రేమన్న భోవాహినీ

వరూథిని, ప్రవరునితో తామెప్పుడును సంచరించు కాంతారసంతానముల గూర్చి చెప్పుచున్నది—

బహురత్నద్యుతి మేదురోదర దరీ
భాగంబులన్ బొల్చు ని
మ్మహికాహార్యమునన్ జరింతు మెపుడుం
బ్రేమన్ నభోవాహినీ
లహరీ శీతల గంధవాహ పరిఖే
లన్మంజరీ సౌరభ
గ్రహణేందిందిర తుందిలంబు లివి మ
త్కాంతార సంతానముల్.

—మను. II, 45.

మేము (వరూథినియు, తన చెలికత్తెలును) ఈ హిమాచలమునందు ఎప్పుడును ప్రేమతో చరింతుము—అని వరూథిని ప్రవరునితో నన్నది. ఇందలి ప్రేమ, చరించుటతో అన్వయించునది. దరీభాగములమీదగాని, క్షిహికాహార్యమునందుగాని, కాంతార సంతానములయెడగాని అపేక్ష—అభిలాష— కాంక్ష— వరూథిని కున్నది. కావుననే సంతోషముతో ఆ యా చోటుల ఆమె పంచరించును.

"అచేతనములను గామించుట, ప్రేమించుట పాశ్చాత్య సంప్రదాయమగునేమోకాని మన సంప్రదాయముకాదు. అక్కడ నెవ్వరిని ప్రేమింపను లేదు." అని శాస్త్రిగారు ఆక్షేపించినారు.

ప్రేమతో చరింతుము—అనగా సంతోషముతో సంచరింతుము అని యర్థము. ప్రేమ= హర్షము, సంతోషము. చూ. శబ్ద రత్నాకరము. శాస్త్రిగారు, ప్రేమను సురతక్రీడకై అభిలషించుటనుగా భావించుట పొరపాటు. పెద్దన, ఇట్టివే మరి యొకటి రెండు ప్రయోగించియున్నాడు.

1. అను దినము తీర్థ సందర్శనాభిలాష
   మాత్మ నుప్పొంగ నత్తరుణాగ్ని హోత్రి. I 57.

2. భూవిూసురుఁ డరిగె......కానన
   హేమాఢ్య దరీ ఝరీ నిరీక్షాపేక్షన్ I 79

3. కపటాంతేవాసినై......శిష్యుల గెడన్
   గూర్చుండి చర్చారతిన్ V 14.

4. ......జిష్ణుక్షారతిన్ V, 7.

కాబట్టి ప్రేమను ప్రణయవాంఛగా అర్థము చేసుకొనుటయు, ప్రేమన్— అనుటకు బదులు— ప్రేంఖత్ అని సవరించుకొనవలయు ననుటయు; ప్రేంఖత్ అను పదము నభోవాహినీ లహరులకు విశేషణమనుటయు వ్యర్థ విచారము.

ఐతే, "ప్రేమన్=అనురాగాతిశయముతో" అని వ్యాఖ్యాత టీక వ్రాయుట (వావిళ్లవారిది) సరసము గాదు.

## 4. పల్కు లొండొంటికి

భట్టుమూర్తి, కావ్యాలంకార సంగ్రహమను నామాంతరముగల 'నరస భూపాలీయము'వ గ్రంథాది కృత్యములయందు—నరసభూపాలుని కృతినాయకుని చేయబూని, 'రవివంశాధీశ్వరుం డీ నృసింహ భూపాలాగ్రణి కీర్తివర్ణనము' (I, 28)' నకు మున్నుగా, కృతినాయక ప్రాముఖ్యమును తెలుపు సందర్భమున ఈ పద్యము చెప్పెను—

సీ. రామాయణాదిక గ్రంథంబు లనవద్య
   వేతృవర్ణనల వన్నియకు నెక్కె
   వైశేషికాది నానా శాస్త్రములు శిఃప్రతిపాదనమున సన్నుతి వహించె
   సంధ్యాది మంత్రముల్ శశ్వదీశ్వరనామ
   జప సాధనత ననశ్వరము లయ్యెఁ
   బలుకు లొండొంటికిఁ బ్రాబిన్కులును బర
   బ్రహ్మగోచరములై ప్రణుతిఁ గాంచె

—కావ్యాలం. సం. I, 24

ఇందలి "పలుకు లొండొంటికి" అను మాట పూర్వాపరములకు అనువుపడి అన్వయింపకున్నది. ఇది భట్టుమూర్తి చెప్పిన "సంబంధ వర్జితము" (IV,40) అను వాక్య దోషము. ఈ దోషమును శాస్త్రిగారు సవరించినారు. కాని "పల్కు లొండేటికి" అని సవరించుటవలన 'భిన్నవచనదోషము' (IV, 38.) ఏర్పడలేదా? పల్కులు—బహు వచనము. ఒండు—ఏకవచనము. కాబట్టి 'పల్కొకండేటికి' అని యుండదగునేమో? పలు పల్కులేటికి, పలుమాట లేటికి, పలుకులు వేయేల—ఇత్యాదిగాను సవరణలు సూచించవచ్చును. కాని లిఖిత ప్రతులు సంప్రతించనిదే స్వతంత్రించి సవరణలకు పూనుకొనరాదు.

## 5. యవసైంధవంబు

కృష్ణుని రాయబారము విఫలమైనది. అతడు తనను అంపి వచ్చుటకు కర్ణుని రథముపై గొనివచ్చి యేకాంతమున కర్ణ జన్మ రహస్యమును వివరించెను. అదియును వ్యర్థము కాగా సమరము నిశ్చయించి కర్ణునితో ననుచున్న వచన మిది—

".. .ఇమ్మాసంబు సౌమ్యంబై శీతోష్ణంబులు లేక పుష్పఫలోపేతంబును, సమగ్ర ధాన్యంబును, సులభ యవ సైంధవంబును నగుచు నొప్పియున్న యది; యేడెనిమిది దివసంబులకు నమావాస్య వచ్చునది పుణ్యదినంబునాడు భండనంబు గావలయు....".

ఉద్యోగ. IV, 49

ఈ వచనములోని "యవ సైంధవంబు" సందర్భమునకు సరిపడిలేదు. యవలు ఒక రకపు ధాన్యము. 'సమగ్ర ధాన్యంబును' అని ముందే చెప్పి మరల ధాన్యవాచకమగు యవలను పేర్కొనుట అనుచితము. కాబట్టి ఆ పదము యవలుగాక యవసము అగునని, యవస మనగా తృణమని శాస్త్రిగారు

సవరించినారు. సైంధవము అనగా ఇందుప్పు (సైంధవ లవణము), గుఱ్ఱము అని యర్థములు. ఇందుప్పు గాని గుఱ్ఱములుగాని ఒకానొక మాసములోనని యేమి, ఎప్పుడైనను లభించగలవుగాన అక్కడ నున్నది సైంధవముగాదు, ఇంధనము అనియు శాస్త్రిగారు వివరించినారు. ఇంధన మనగా వంట చెరకు. గడ్డిగాదమును, వంట చెరకును, అటు 'సమగ్ర ధాన్యంబు'నకు తోడుగా నుండుట యుద్ధకాలమున ముఖ్యమే. కాలిబంటులకు, గుఱ్ఱములకు, ఏనుగులకును గావలసిన ధాన్యము, వంటచెరకు, తృణము అన్నియు సులభసాధ్యములైనకాలమని కృష్ణుని యభిప్రాయము. కాబట్టి శాస్త్రిగారు సూచించినట్లు "యవసేంధనంబు" సరిపడును. కాని యీ పాఠము ఎక్కడిది? వ్రాత ప్రతులలోనిదా? శాస్త్రిగారు వూహించినదా?

పరమ ప్రామాణికముగా నుండదగిన భారతమునే మన మిప్పటికి చక్కగా ముద్రించుకొనలేకున్నాము. మన యసమర్థత కింతకంటె ప్రబల నిదర్శన మేమి కావలయును?

## 6. ఉర్వీ రాల, బలిఘోషాడంబరంబుల్.

తెనాలి రామకృష్ణుడు, పాండురంగ మాహాత్మ్యమున రాధాదేవి తపోవర్ణనా సందర్భమున తొలకరిని వర్ణించినాడు—

> అద్రి గ్రావము లుర్వీరాల బలిఘో
> షాడంబరంబుల్ ' వియో
> గి ద్రోహం బొనరింప వారినిధి కెం
> గేలంటఁగా వాహినుల్
> భద్రేభప్రతిమాన మూర్తియగుచున్
> బాధోధరశ్రేణి కుం
> భద్రోణంబులు గుమ్మరించె విమలాం
> భః పూర ధారావళిన్
>
> —పాండు: IV, 26.

అద్రిగ్రావము లనగా కొండల రాళ్లు. అవి తొలకరి వానకు భూమిపై బడినవని వర్ణన. రాలుట భూమిపైనేగాని మరి ఎక్కడ రాలును? అని శాస్త్రిగారి ఆక్షేపము. కవులు ఛందోబంధమున ఇఱికించిన "ఉర్వులు" లక్షోపలక్ష లున్నవి! వీని నన్నిటిని సవరింపబూనుకొన్నచో అది అలవిగాని పని. ఇట్టి వానివి గ్రంథ గ్రంధు లనుట సరిగాదని మనవి. "దిగిరాను దిగిరాను దివినుండి భువికి" అన్నప్పుడు భువికిగాక, పాతాళమునకు దిగివచ్చునా? అనుట సరసముగాదు. ఉర్వీరాలన్—అనుటకు బదులు "ఉర్లిరాలన్" అని శాస్త్రిగారి సవరణ. ఉరలు—క్రియ. దీనికి రూపాంతరము ఉర్లు. దీనికి కార్యార్థక రూపము ఉర్లి. దొర్లి, కాఱి, రాలి, వీడి— అని దీని కర్థములు. కొండరాళ్లు దొర్లిపడినవని చెప్పుట ఉచితమని శాస్త్రిగారి యభిప్రాయము. కొండరాళ్లు తొలకరి వానకు పడినవి అనిన చాలదా? దొర్లిపడినవని చెప్పుట యేల? దొర్లిన తరువాత పడకుండునా? పడిన రాళ్లు లోయలలో పడినవా? నేలపై బడినవా? కొట్టుకొనిపోయి నదులలో సముద్రములో బడినవా? అని యిట్లు కాకదంతపరీక్ష చేయుట సమంజసమేనా?—

"కొండరాళ్లు చిన్నవి. ఏ వర్షమునకైనను రాలును. దానికి తొలకరి వానయే అక్కరలేదు. పెద్ద బండలు ఏ వర్షమునకును రాలవు" కాబట్టి దొర్లిపడును—అని శాస్త్రిగారి భావము. అప్పుడు ఉర్లన్ అన్నచో సరిపోవునుగదా? ఉర్లిరాలన్ అనుట యెందుకు?

తరువాత—బలిఘోషాడంబరంబుల్— పూజల సంబంధమైన గొప్ప చప్పుళ్లు—అను నర్థము సరియైనదికాదు అని వా రన్నారు. 1962 నాటి వావిళ్లవారి ప్రచురణలో బులుసు వేంకట రమణయ్యగారి టీక— "గొప్ప బలముకల ఉరుముల ఆర్బాటములు" అని యున్నది. ఇది గ్రాహ్యమే. "పవిఘోషాడంబరంబుల్' అని శాస్త్రిగారి సవరణ. పవి అనగా వజ్రాయుధము. ఇది రమ్యతరమగు పాఠమని వారి భావము. కావచ్చును. పరిశోధకులు స్థితగతిచింతనము చేయవలయునేగాని స్వారస్యముల కొరకు పాఠముల మార్చవచ్చునా?

## 7. ప్రథమ జామాత.

భీమరాజు, నలదమయంతీపరిణయమున— అల్లునకు అరణమిచ్చు సందర్భమున—శ్రీనాథుడిట్లు రచించెను:

> తే. ప్రథమ జామాత కిచ్చె భూపాల తిలకుఁ
> డగ్గి శోభంబు లైన దివ్యాంబరములు...
>
> —శృం. నై. VI, 97,

[‘మనుజనాథుండు ప్రథమ జామాత కొసఁగె’ అని శాస్త్రిగారు చూపిన పాఠము.]

“ప్రథమ జామాతకు=పెద్ద యల్లునకు—అని వెంకటరాయశాస్త్రి గారి వ్యాఖ్యానము. అబద్ధమునకు అసంబద్ధముగా వ్యాఖ్యానించిరే కాని పాదదోషమును పరికింప జాలరైరి. అక్కడ ఉండవలసిన పాఠము ‘ప్రథిమ జామాత కొసగె’. ప్రథిమన్ ప్రశస్తితో అని అర్థము.” అని శాస్త్రిగారి వ్యాఖ్యానము.

భీమరాజునకు దమయంతి ఒకర్తయే కూతురు. దముడు, దాంతుడు, దమనుడు—అని ముగ్గురు కొడుకులు. ఆమెకు భర్తయైన వాడు నలుడొక్కడే. కాగా, ప్రథమ జామాత అను పాఠమును, దానికి పెద్ద యల్లు డను నర్థమును వ్యర్థము కదా యని శాస్త్రిగారి యభిప్రాయము. కాని శ్రీనాథుడే అదేఘట్టమున దీనికి మూడు పద్యముల ముందు—

తే. జముని నాలుకతో నెకసక్కె మాడఁ
దమకపడు క్రొత్త పైఁడి మోళము గటారి
భీమనృపుఁ డిచ్చె గారాపుఁ బెద్దపెండ్లి
కొడుకుఁ గుఱ్ఱకు నైషధక్షోణిపతికి.

(VI, 94.)

అని నలుని “పెద్ద పెండ్లికొడుకు గుఱ్ఱ”గా వర్ణించెను. కాబట్టి వేదము వారి వ్యాఖ్యానము సరైనదే యనియు, శ్రీనాథుని తాత్పర్యమేమో శాస్త్రిగారికే తెలియ లేదనియు గ్రహింపవలసియున్నది. ప్రథిమన్ అనునది వారి అపోహా కల్పితము.

ప్రథము డనగా— మొదటివాడని గాక—ముఖ్యుడు, శ్రేష్ఠుడు అనియు నర్థము. నలుడు భీమరాజునకు శ్రేష్ఠుడైన అల్లుడు. ఒక రాజునకు చక్రవర్తి అల్లుడగుట, శ్రేష్ఠతాపాదకమే కదా? పెద్ద అనుమాటను గూడ ఈ యభిప్రాయముననే శ్రీనాథుడు ప్రయోగించెను. పెండ్లికొడుకు వయస్సున కుఱ్ఱవాడే గాని, యోగ్యతలయందు పెద్దయే అని పెద్దపెండ్లికొడుకుఁగుఱ్ఱకు తాత్పర్యము. “మనయశోద చిన్ని మగవానిఁ గనెనట” “ధనంజయ ప్రవరు కరమ్ము” ఇత్యాదులును ఇట్టివే కదా?

## 8. కన్నేఱు కాఁదారి

భీమేశ్వర పురాణమున—దక్షారామపురవర్ణనమున—శ్రీనాథుడు భీమేశ్వరస్వామివారి రాసిక్యము నిట్లు వర్ణించెను—

ఎనయం గల్గిన కూర్మి భృంగిరిటిఁ గా
నీ తండుఁగానీ నికుం
భునిఁ గానీ కయిదండ పట్టుకొనిసం
భోగేచ్ఛ నంతఃపురాం
గనలన్ గన్ను మొఱంగి యప్పురము నం
గన్నేఱు కాఁదారి ప్రొ
ద్దున భీమేశుఁడు సానివాడ కరుగున్
ధూర్త ప్రకారంబునన్ —భీమ I.112

ఇందలి “కన్నేఱు కాఁ దారి ప్రొద్దు”ను శాస్త్రిగారు సరిగా పరిశీలించి అర్థ వివక్ష చేయరైరి. “కన్నేఱు” అను పదమును— సరళాదేశమును, శకట రేఫమును గుర్తింపక—“గన్నేరు—పుష్ప విశేషము” గా భావించి, యిక్కడ సందర్భపడదని త్రోసివేసినారు. కంటిని బాధించు, దృష్టి ప్రసరింపనీయని అను నర్థము లిచ్చునది యని “కన్నేర్చు” శబ్దమును సూచించిరి. కాని “కన్నేఱు” శబ్దమునకు గూడ సందర్భపడగల యర్థమున్నదనియు, అదియొక జాతీయమనియు గుర్తింపవలసియున్నది. కన్ను+ఏఱు=కన్నేఱు—కంటితో శోధించు, కంట వత్తి పెట్టుకొని చూచు, కళ్లు పొడుచుకొన్నట్లు చూచు—ఇత్యాదిగా గ్రహింపవలయును. ఇదియు ‘గొడ్డేఱు’ వంటి జాతీయము. గొడ్డు+ఏఱు—గొడ్లను పూన్చి సేద్యము చేయు—అని యర్థము. “బొడ్డుపల్లెను గొడ్డేఱి మోసపోతి” అని శ్రీనాథుని చాటువు.

కాబట్టి, కన్నేఱు కాఁదారి ప్రొద్దు—అనగా కళ్లు పొడుచుకొన్నను కనిపించని అర్ధరాత్రివేళ అని యర్థము. దీనికి ప్రయోగాంతరము లేదనియు, ‘కాందారి. మాఁదారి ప్రొద్దున’ అనియుఁ జదువవచ్చును అనియు సూర్యరాయాంధ్రనిఘంటువు సూచించినది. (చూ. కాఁదారి ప్రొద్దు). కన్నేఱు కాఁదారి ప్రొద్దును—కాందారి మాఁదారి ప్రొద్దుగా గూడ చదువవచ్చునను సూచన నిఘంటుకారులు చేయవలసినది కాదు. ఇట్టివన్నియు అప్రామాణికములైన వ్యర్థ ప్రసంగములు.

"మరియొక వింత. ఈ కాదారిప్రొద్దు శివరాత్రి మాహాత్మ్యమునందును ప్రయోగింపబడినది. సారస్వత పరిషత్ప్రకటితప్రతియందు 'గాంధారి ప్రొద్దున' అని ముద్రింపబడినది. దానిని నేను సవరించి పంపినను ద్వితీయ ముద్రణమున సవరింపరైరి. తాళపత్ర గ్రంథస్థమో పరిష్కర్తృ ప్రణీతమో తెలియరాదు. గాంధారి ప్రొద్దను పదము శ్రీనాథుడు ప్రయోగించునా?" అని శాస్త్రిగారు అన్నారు.

కాందారి ప్రొద్దునకు కాందారి ప్రొద్దు అని రూపాంతరము కద్దు. వర్ణాదేశమును (కాకుగా), అల్పప్రాణమునకు బదులు మహాప్రాణాక్షరము(దా కు ధా) పడిన యచ్చు తప్పును గుర్తింపక శాస్త్రిగారు కాందారి ప్రొద్దును గాంధారి ప్రొద్దుగా పొరపడి యుందురు. నేను చూచిన సాహిత్య పరిషత్ ప్రకటిత ప్రతి శివరాత్రి మాహాత్మ్యమునందు ఈ ప్రయోగములేదు. 'కాందారి ప్రొద్దు' అను ప్రయోగము భీమఖండమున దప్ప మరియొకటి లేదని సూ.ని.సూచన.

## 9. సాని పెండ్లి

భీమఖండమునందే దక్షారామ మహిమను వర్ణించుచు శ్రీనాథు డీ పద్యమును రచించెను—

> పదునాల్గు మహా యుగముల
> మొదాకండగు భీమనాథు మొగచాటై యుం
> డదు సానిపెండ్లి యెప్పుడు;
> నది దక్షారామమహిమ మగునో కాదో
>
> —భీమ. I. 113

ఇక్కడ 'సానిపెండ్లి' సరిపడదని "సాని పెంటి" అని యుండవలయునని శాస్త్రిగారి సంస్కరణము. 'పెంటి యనగా యువతి అనిఅర్థము' అని వా రనుచున్నారు. సాని అనగా దేవదాసి, గుడిచేటి, వేశ్య అనిగదా? ఇది స్త్రీ వాచకమే. దీనిపై మరల 'పెంటి' యేల చేర్చవలయునో శాస్త్రిగారే చెప్పవలె. అట్లయినను తిర్యగ్జంతువులయం దుపయోగించు పెంటికంటె 'పిల్ల' వాడియుండ నగును గదా? సానిపెండ్లి సంప్రదాయము తెలియక వారు పాఠము మార్చవలె నన్నారు.

ఆటపాట నేర్చి యీడేరిన సానిజాతి కన్య వారిమతసంప్రదాయానుసారము మొదట శంకరుని గుడిలోనో, కృష్ణుని యాలయములోనో గజ్జకట్టి యా పదుగురియెదుట స్వామినే పెండ్లాడవలె. ఆ తొలినాటి యాటకు పురప్రముఖులతోపాటు సరసులునువచ్చి వినోదింతురు. ఆమెకు కన్నెరికము పెట్టిన సరసాఢ్యుని తల్లియనుమతిపై అంగీకరించి ఆమె అతనితో కాలక్షేపము చేయును. ఐనను ఆమె యెందరిని వలపించి అనుగ్రహించినను ఆమెకు భర్తయైనవాడు ఆ భగవంతుడే. ఇదీ ఆనాటి వారి యాచారము.

దక్షారామములో సానులందరును శైవ సంప్రదాయముగలవారై భీమేశ్వరునే పెండ్లియాడుదురనియు, ఈ స్వామివారి మొగచాటున ఎప్పుడును మరియొక స్వామితో సానిపెండ్లి జరుగదనియు సారాంశము. కాబట్టి "సానిపెండ్లి" సరియైనదే.

## 10. ధరణీధర పత్ని, దైన్యము ముంచెన్.

శాస్త్రిగారు చూపిన భీమఖండమునందలి పద్య మిది—

> పరమాసించుచు బరమే
> శ్వరు నానతి జేసె దివ్య భవనంబులు దా
> నరికాలుడు కరికాళుడు
> ధరణీధరపత్ని మనసు దైన్యము ముంచెన్

జ్ఞాన ప్రసూనాంబికా గ్రంథమాలవారిచే ప్రకటింపబడిన భీమేశ్వర పురాణమునందలి పద్యము చాల మార్పుతో నున్నది—

> పరమాశించును భీమే
> శ్వరు ననుమతిఁ జేసి చోడవంశాభరణుం
> డరికాలుఁడు కరికాలుఁడు
> ధరణీధరపత్ని మనసు దైన్యము ముంచెన్.
>
> —భీమ I. 115

దీనికంటె శాస్త్రిగారు ఇచ్చిన పద్యమే సమగ్ర సమన్వయ సాధకముగా నున్నది. కాని వారి అర్థములోనే పొరపాటు దొరలినది.

కరికాలచోళుడు 'పరమేశ్వరు నాజ్ఞచే దివ్య భవనములు (దక్షారామమున) నిర్మించెను. అందువలన ధరణీధరపత్నియగు మేనకయొక్క మనస్సును,

దైన్యము (కర్త), ముంచివేసినది. శాస్త్రిగారును ఈ యర్థమును యథా సంభవముగా గ్రహించినారు. కాని మేనకాదైన్యమునకు కారణ మగపడుటలేదని పాఠము మార్పునకు పూనుకొన్నారు.

మేనకాహిమవంతులకు తొలి సంతానమైన మైనాకుడు ఇంద్రునకు భయపడి సముద్రములో దాగుకొన్నాడు. తక్కిన క్రౌంచాదులును రెక్కలు తెగి పడిపోయిరి. పార్వతియైనను పరమేశ్వరునితో పాటు తమయింట—హిమాలయమున—నుండగలరని ఆశించినందుకు, పార్వతీపరమేశ్వరులు కరికాల చోళుడు కట్టించిన దివ్య భవనములందు జేరుటకు దక్షారామము పోయిరి. మేనకకు సంతానపు ఎడబాటువలన దైన్యము కలిదినది. ధీరుడగు హిమాలయుడు దీనుడు కాలేదు. మేనకకు స్త్రీజన సహజమైన దైన్యము ఏర్పడినది. ఈ విధముగా పద్య భావము సరిపడిపోయినది.

కాని శాస్త్రిగారి చర్చయిది—

''.....మేనక....దైన్యమునకు కారణమేమి ? ఇల్లు వాకిలి లేక మెట్టలవెంట పుట్టలవెంట తిరిగెడి తన అల్లునకు కూతురునకు దివ్య భవనములు లభించుట అత్తకు దైన్య హేతువగునా? అల్లుడు కూతురు సుఖించుట అత్తకు దుఃఖహేతువగునా? ఈ దురభిప్రాయము తప్పు పాఠమువలన కలిగినది. ఇల్లు వాకిలి లేకపోవుట ఇల్లాలికి దుఃఖహేతువగును. కాని ఇల్లాలి తల్లికే కాదు. కావున యిక్కడ పత్ని యనుచోట పుత్రియని దిద్దవలయును. ముంచెన్ అనుచోట మాంచెన్ అని దిద్దవలయును. ఈ రెండు పాఠములు సవరించిన సరసమైన అర్థము లభించును.''

సవరించకయే సరసతరమైన అర్థము లభించువప్పుడు పాఠాంతర ప్రసక్తి అనవసరమని నా మనవి.

## 11. వట పల్లవంబులు

శ్రీనాథుడు దక్షవాటీపురమువందు వీచు మలయమందమారుతమును వర్ణించుచున్నాడు—

''కలమ పాలికల చక్కని చన్నుగవలపై
వట పల్లవంబులు వాయదట్టి...''

వట పల్లవము లనగా మఱ్ఱి చిగుళ్లు. వీనివి చన్ను గవలపై అలంకారముగా గాని, తాపశాంతికి గాని ఉపయోగింపరు. కాబట్టి .....ఆ కన్నెల చన్నులపైని నున్నవి వటపల్లవములుకావు. పట పల్లవములు. అనగా సన్నని చిన్నిపయ్యెదచెరగులని అర్థము.'' అని శాస్త్రిగారు సూక్ష్మముగా పాఠ సవరణ గావించినారు. పటపల్లవములనగా వస్త్రపు కొంగులు, పయ్యెద చెరగులని యర్థము. బాగున్నది. కాని చిక్కని చను గవలపై నున్న యీ పటపల్లవము లెవరివి? కలమపాలికలవి. కలమపాలికలనగా ఎవరు/ ఏమి? శాస్త్రిగారు సూచించి నట్లు కన్నెలా, జడపదార్థములా? కవి ఈ పద్యమున అన్నియు జడపదార్థములనే సేకరించినాడు, చూడుడు—

సీ. తిలకంబు బలుతేనియలఁ బోఁకమోకల
పువ్వుఁ బాళల తావిఁ బుక్కిలించి
కలమ గోపికల చక్కని చన్నుగవలపై
వట పల్లవంబుల వాయదట్టి
సప్తగోదావర జలతరంగారోహ
కేళీసుఖంబు లంగీకరించి
దేవ గంధర్వ లీలావతీ హాటక
ప్రాసాద వలభి గర్భములు దూఱి

తే. ప్రతిదినము దక్షవాటీపురంబునందు
మలయ వేలావనీ మందమారుతంబు
గంధసార లతా కుడుంగముల మెలఁగు
చిలువ లేమలు సేవింప వెలితి పడుచు.

—భీమ. I, 98.

(జ్ఞాన ప్రసూనాంబికా గ్రంథమాల వారి ప్రతిలోనిది.)

మలయ పర్వత ప్రాంతము నుండి వీచుచు వచ్చు మందపవనుడు, ప్రతిదినము దక్షారామ పురమున ప్రవేశించి సొగసుకాడై సరసుడై చందన వృక్షముల కల్లుకొనియుండు పొదరిండ్లలో విహరించుచు నాగకన్యలు సేవించుటవలన— అనుభవించుటచేత— అలసి చిక్కి సగమయ్యెడువాడు. మందపవనుడు మలయ వేలావనీ జనుడు గాన అతనికి చల్లదనము, సౌగంధ్యము సహజసిద్ధములు. దక్షవాటి అన్ననో మలయముకంటె మధుర మోహనమైన శృంగార వాటి. అతడీపురమున ప్రవేశించి, తిలకవృక్షములయొక్క పూదేనెలను, పోకచెట్లయొక్క పూగుత్తుల వాసనలను పుక్కిలించి తన

ముఖమును మధుర వాసనాసంభరితము గావించు కొన్నాడు. (తాంబూల చర్వణము వంటి భోగము ననుభవించినాడన్నమాట.) తరువాత, కలమ గోపికల (పాలికల) యొక్క బిగువైన చనుదోయిపై నుండు పయ్యెద చెరగులను మెల్లగా జారదట్టి బాహ్యరతిసౌఖ్యమును సంభావించినాడు. ఆ మీదట ఏడుపాయలై ప్రవహించు గోదావరీ జలముల తరంగము లనెడు ఉత్తమ స్త్రీ పిఱుదుల సంప ర్కమున అభ్యంతర రతి సౌఖ్యమునకు ఉన్ముఖు డైనాడు. అటుపై, శృంగారవతులైన దేవకాంత లయు గంధర్వస్త్రీలయు బంగారపుటంతిపుర ములపై మేడలలోపలి భాగములందు చొచ్చి అచ్చటి రాసిక్యము గ్రహించినాడు.

దక్షారామము లోని చెట్లు చేమలు, పైరుపచ్చలు నీటి వనరులు, మిద్దెలు మేడలును అన్నియు ఎట్టివావిన్నైవ రసిక శేఖరుని గావింపజాలు శృంగార వాసనా సంవిలసితము లని కవి యీ మలయ మారుత వర్ణనా సందర్భమున ధ్వనింపజేసినాడు.

ఇందలి "కలమ పాలికలు (గోపికలు) కన్నెలు కావు; తిలక వృక్షములు—పోకమోకలు, జలతరంగములు వలభిగర్భములు— ఇత్యాదులవలె అవియు జడములెయని నాయూహ. కలమము అనగా వరిపైరు. కలమము ఆవెడు గోపికలు లేక స్త్రీలు అని రూపకము. గోపికలు పాలు మోయునట్లు లేతపైరుల పొట్టలలో పాలుపట్టి యుండి చిరుగాలులకు పయనించులాగువ తోచుమ. లేదా, కలమ పాలిక లనగా వరిపైరుల వరుస లని యైనను అర్థము. (పయిమంచుపొర పయ్యెద కావచ్చును. ఇట్లిది యూహ్యమై గూఢ రూపకముగా తోచును.)

మొత్తముమీద శ్రీ సాంబమూర్తిశాస్త్రి గారు చూపిన కొన్నిసవరణలు—వివరణలు ఉచిత ములై గ్రాహ్యములగుచున్నవి. కాని వారు తమ సొంత పాఠములు సూచించుటకుముందు, తాళ పత్రములు, వ్రాతప్రతులుచూచి అందలి పాఠముల సంగతి సందర్భములు చర్చించి సరిపడనియెడల వారి యభిప్రేత పాఠములు వెలువరచవచ్చును. అది సంప్ర దాయముగదా? ఈ విధముగా శ్రీనాథుని శివరాత్రి మాహాత్మ్య గ్రంథ గ్రంథులగూర్చి గూడ చర్చించ గలరని కోరుచున్నాను.

ఈ నా యభిప్రాయముల నిట్లు వెల్వరచు టకు కారణభూతులైన శ్రీ శాస్త్రిగారికి పునరభి వాదములు.

---



# భయం భయంగా....

శ్రీ మురళీధర్

రామారావుకు బతుకంటే భయం. ప్రొద్దున్నే నిద్రలేస్తూనే సూర్యుణ్ణి చూడటమంటేనే భయం. వాడి వేడికిరణాలు కళ్ళల్లో గుచ్చుకుంటాయని! నిద్ర లేవగానే కాఫీ తాగుదామని ఎంతో మనసు. ముఖం కడుక్కుంటేనేగాని కాఫీ యివ్వదు సరోజ. చిన్నప్పుడు అమ్మకూడా యింతే. పెద్దయిన తర్వాత, తనంతటి వాడు తానై, భార్యా పిల్లల్ని పోషించుకునే స్థితి, వయస్సూ వచ్చినా తనకి కావలసినట్టు జరగదు తన యింట్లోనే. సరోజ మేనమామకూతురు కావటం ముప్పొచ్చింది నిజానికి.

గట్టిగా ఆలోచిస్తే (దానికీ భయమే మరి!) దేన్ని చూసినా భయం వేస్తోంది రామారావుకు. హైద్రాబాదులో ఇన్సూరెన్సు కంపెనీలో గుమాస్తా రామారావు గుడ్డి కన్ను మూసినా తెరిచినా ఒకటేనని మిత్రుల కథనం.

ఆమధ్య ఒకరోజున ఆఫీసుకు వెళ్ళాలనిపించ లేదు రామారావుకు. సరోజ తలంటుకుని జుట్టు చిక్కు తీసుకుంటూ 'డ్రీమీ'గా చూస్తోంది అప్పుడు. ఒక్కసారి ఏదో అనిపించింది అంత మామూలుగా కనిపించే రామారావుకూను. ఒక్కసారి వెనకగావెళ్ళి కళ్ళు మూసి కటుక్కున ముద్దెట్టుకుందామని పించింది. కిటికీలోంచి కిరణాలు జారుతున్నాయి జలతారు పోగుల్లాగ. సరోజ బుగ్గమీదపడి మెరుస్తున్నాయి. కనిపించని ఒక్క క్షణం ఆగి ఆగి మురిపిస్తున్నాయి. సరోజ ఎలాఉందని ఆ క్షణంలో!

ఒక్కసారి మనస్సు ఝుల్లుమంది. 'అబ్బ. వెధవ ఆఫీసు. వెధవ పాలసీలు. వెధవ ఉత్తరాలు. వెధవ చాకిరీ. వెధవ సూపర్నెంటు. వెధవ చివాట్లు. ఈక్షణం యిలాగే ఉండిపోతే సరోజ కళ్ళల్లోకిచూస్తూ వళ్ళోకి తీసుకుని ఉక్కిరి బిక్కిరి చేసేసి...'

'అలా నిలబడిపోయారేమండీ బెల్లం కొట్టిన రాయిలాగ? ఇవాళ ఆఫీసు ఎగ్గొడదామనా ఏమిటి, వేషం? అదేం కుదరదు' అని సరోజ అనేదాకా తెలివి రాలేదు. 'అబ్బెబ్బే, అదేంకాదు వూరికే నిల్చున్నా. చూస్తున్నా. అంతే.'

మరో నిమిషంలో రామారావు బస్‌స్టాప్ దగ్గర ఉన్నాడు. చేతిలో కాఫీ ఫ్లాస్కూ, అల్యూమినియమ్ టిఫిన్ డబ్బా, చెక్కిన పెనసలూ, యింకు నింపిన పెన్నూ, వో లాగూ చొక్కా, అరిగీ అరగని చెప్పులూ, పొగదీసి లెంపకాయకొడితే బిక్కముఖంవేసే ముఖాన్ని తగిలించుకుని.

బస్సెక్కి తిన్నగా ఆఫీసుకు వంటిని చేరవేసాడు. బల్లమీద కాగితాలకట్ట 'రెడీ'గా ఉంది. రామారావు ఆఫీసుకురాగానే ఫ్లాస్కులోంచి కాఫీ తాగబోయే ముందర మరో పెద్ద గుమాస్తాకు యిస్తాడు. 'తప్పేమిటోయ్ కాఫీ తాగటం? అందులో యింటి కాఫీ వదులుకోవటం ఏమిటిలే' అని గటాగటా తాగేస్తాడు. 'ఈ కాగితాలు సరిగ్గా ఉన్నాయేమో చూడవోయ్. నాకు మహా విసుగ్గా ఉంది' అని తోటి గుమాస్తా అప్పారావు మరికొన్ని కాగితాలు తోసేస్తాడు. సాయంత్రం మూడు గంటలకి టీ తాగి 'యింకా కాలేదుటోయ్' అని గదమాయించి తర్వాత మరో అరగంటకి ఒక మెహర్బానీ చిరునవ్వు విసిరి కాగితాలు గుచ్చెత్తి తీసుకుపోతాడు. ఆఫీసు అయిపోయేలోగా ఒక్కవ్యామ్మ తప్ప మిగతా వాళ్ళంతా ఏదోరకంగా రామారావుచేత చాకిరీ చేయించుకుని ఉద్ధరించే వాళ్ళే.

ఆవాళ సూపర్నెంటు పిలిచి'ఏమిటోయ్' రామారావ్! మరీ అయోమయంగా ఉంది నీ వ్యవహారం. నీకు పనిమీద ధ్యాసలేనట్టుగా ఉందే చూస్తే' అన్నాడు. ఏదో మ్యావు మ్యావు మని సమాధానం చెప్పి తప్పుకున్నాడు, రామారావు.

ఇంటికి రాగానే సరోజ పలకరించనైనా లేదు. ఇటూ అటూ చూశాడు. అరిగిపోయిన చెప్పులూ,

పెన్, మిగతా చిత్తు కాగితాలూ తీసి గదిలోని టేబిల్ మీద పెట్టాడు. తగిలించుకున్న 'ఫ్లాస్క్' కూడా చిక్కు విడదీసినట్లు పక్కకు పెట్టాడు. ఆఫీసుకు వెళ్లేటప్పుడు ఒక సంచీ మడతపెట్టి తీసుకు వెళ్లటం అలవాటు. ఇంటికి వచ్చేటప్పుడు కూరలు తీసుకు రావటం ఒక డ్యూటీ. 'ఇన్నేళ్లబట్టీ కూరలుతెస్తున్నా పుచ్చువంకాయలూ, వడిలిపోయిన అరటికాయలూ, ముదిరిపోయిన బెండకాయలూ తప్ప మంచి కూరల కూడా తేవటం తెలియదు. ఏంచేస్తాం ఖర్మ? దేని కైనా పెట్టిపుట్టాలి' అని విసుక్కుంది సరోజ. ఆ రకంగా విసుక్కోవటం కూడా కొత్తకాదు.

రాత్రి భోజనం చేస్తూ 'అన్నంలో రాళ్లున్న ట్లున్నాయి' అన్నాడు రామారావు.

'రాళ్లుండక రత్నాలుంటాయేమిటి, మరీ చోద్యం' అంది సరోజ. అవాళ రాత్రి ఏదో ముక్కుతూ మూలుగుతూ పడుకున్నాడు.

మర్నాడు పొద్దున్న లేవ బుద్ధి కాలేదు రామా రావుకు. ఆలస్యంగా లేచే అలవాటులేదు రామారావుకు. ఒకవేళ లేస్తే వూరుకునే అలవాటు అంతకన్నాలేదు సరోజకు. ఎంతసేపూ లేవకపోయేసరికి కస్సుమంది. 'మీరు ఎంతసేపు పక్కతూదనుంచి లేవకపోయినా మీకు పక్కమీదకు కాఫీ యిచ్చేదిలేదు. అయినా ఆఫీసూ వ్యవహారం అదీ లేదేమిటి' అన్న మాటలతో రామారావు మత్తు కాస్తా వదలిపోయింది.

లేచి ముఖం కడుక్కుని కాఫీ తాగి ఆఫీసుకు తయారై గానుగఎద్దులాగే వెళ్లబోయేసరికి సరోజ అంది 'అమ్మయ్య, యిప్పుడు ప్రజల్లో పడ్డారు' అని. ఏదో అందామని నోటిదాకా వచ్చినదికాని మళ్లా గడియారం చూపిస్తోన్న సరోజను చూసి ముఖం చిట్లించుకుని వెళ్లిపోయాడు బస్‌స్టాప్ దగ్గరకు.

ఈ రకంగా రామారావు జీవితం జీతంలాగా ఎదుగూ బొదుగూ లేకుండా వెళ్లిపోయి ఉండవల సింది. మరో పాతికేళ్లు ఉద్యోగం చేసి పెన్షన్ పుచ్చు కుని యింకా బతికుంటే యిన్సూరెన్సు పుచ్చుకుని, మరో కాసిని ఏళ్లకి నిక్షేపంగా చచ్చిపోవచ్చు. ఈలోగా పుట్టిన కొడుకో, కొడుకులకో తద్దినం రోజునైనా తప్పకుండా జ్ఞాపకాని కొచ్చేవాడు. సరోజ కూడా సహ జంగా వార్ధక్యంవచ్చో, జబ్బుచేసో కాస్త ముందో, కాస్త వెనకో, కాలూ చెయ్యి పడిపోయో యీ లోకా న్నుంచి జారుకుని ఉండేది. అంతకన్న మరేమీ ప్రమా దం జరిగి ఉండేదికాదు. వూళ్లో వాళ్లకిగాని, దేశంలో వాళ్లకిగాని ఏమీ అనిపించేదికాదు గూడాను. కనీసం పత్రికల్లో కూడా మరణ వార్త ప్రచురించబడేదికాదు, పిల్లలు డబ్బిచ్చి ప్రకటనగా వేయిస్తే తప్ప.

సరోజ పుట్టింటినుంచి అత్తవారింటికి రావ టానికి పెద్ద సరదా పడనూలేదు. మరీ నిర్ల క్ష్యమూ చూపలేదు. పొయ్యిమీద అన్నం గిన్నె దింపి విస్తట్లో వడ్డించుకు తిన్నంత మామూలుగా చూసింది కాపరానికి రావటాన్ని. రామారావుకుమాత్రం కాస్త మనసు పడ్డాడు. మీనాక్షమ్మగారుమాత్రం ఎప్పు డైనా అనేది, 'ఇప్పుడు నన్నేడిపిస్తున్నావా, యింక దాన్ని ఏడిపిస్తావనుకుంటా' అని. ఏడిచేవాళ్లకి ఎదుటవాళ్లని ఏడిపించటం చేతకాదు. ఆ సంగతి మీనాక్షమ్మగారికి తెలియదు. తండ్రి రంగనాథంగారు ఎప్పుడూ అందలం ఎక్కి తిరిగినవాడుకాదు. ఏడవటానికీ, నవ్వటానికీ పెద్ద తేడా అంతకన్నా తెలియలేదు ఆయనకి బతికుండగా. ఏదో కొడుకు బతికి బాగుంటే చాలు అని సరిపెట్టుకు పోయే శ్రేణిలోవాడు. అదిగాక కాస్త చదువుకుని నాలుగురాళ్లు సంపాదించటం మొదలెట్టే సరికల్లా మహా గాభరా పడిపోయారాయన. ఆయన గాబరా మాట ఎలా ఉన్నా చుట్టుపక్కలవాళ్ల గాబరాఎక్కువైంది. రామనాథంగారికిమూడేళ్లముందే రిటైరైన గుర్నాథం గారు మూడు రోజుల కోసారి పని కట్టుకుని వచ్చి వసారాలో బైఠాయించి 'మీవాడు ఏం చేస్తున్నా డోయ్' అని సమాధానంకోసం ఆగకుండానే 'ఆ ఏం చేస్తాడు, బాధ్యతా ఏమన్నానా.....' అని యింకా సమా ధానం ఏమీ రాకపోవటంతో, 'అయినా మనం ఏం చెప్పగలం యీ కాలపు కుర్రకారుకు' అని కండువా బుజాన వేసుకు వెళ్లిపోయేవారు.

ఇలా ఒక మూడు నెలలు 'స్లోపాయిజనింగ్' లాగ గుర్నాథం రామనాథంవాళ్లఅబ్బాయి క్షేమంకోసం ఆత్రుత చూపించేసరికి నిజంగానే పరిస్థితి ఏదోఅయో మయంగా కనిపించింది ఆయనకి. 'ఏమే, అబ్బాయి వేళకి యింటికి వస్తున్నాడా? ఇంటి పట్టున ఉంటు న్నాడా? దుబారా చేస్తున్నాడా?' అని అడిగాడు భార్యని ఒక రోజున.

'ఇదేం చోద్యం నన్నడుగుతారు. మీ తండ్రీ కొడుకులు ఏం జేసుకుంటున్నారో నాకేం తెలుసు గనక. నా వంటిల్లూ, నేనూను' అని వార్పు కొచ్చిన అన్నపు గిన్నెవైపు వెళ్లిపోయింది.

ఆ ఆదివారం రాత్రి కాస్త ఆలస్యంగావచ్చాడు రామారావు.అంతే. ఒక్కసారి లేచిపోయాడుపైకి, 'ఏరా, యివాళ నాలుగు రూపాయిలు సంపాదిస్తున్నావుగదా అని కులాసాగా సినిమాలూ, స్నేహితులూ అని తిరుగుతున్నావు. రేపు నీకూ ఒక పెళ్లాం అంటూ వస్తే యీ దుబరా ఖర్చు ఎలా కుదురుతుంది? కొంచెం వళ్లు దగ్గరుంచుకుని మెసలుకో'' అని హెచ్చరించారు.

'పెళ్లాం వస్తే దూబరా ఖర్చు వీల్లేదు గనకే యిప్పుడైనా నన్ను కాస్త కులాసాగా తిరగనీ' అని అందామని ఆయనమాటే ఆయనకు ఒప్పజెబుదామని తెగ మనసుపడ్డాడు. గొంతులోంచి మాటలు నాలిక చివరిదాకా వచ్చి కూడా వెనక్కు వెళ్లిపోయాయి. గ్యాస్ పోయిన సోడాబుడ్డి ముఖం వేసుకుని వెళ్లిపోయాడు యింట్లోకి. 'కాళ్లు కడుక్కో, భోజనం చేద్దువుగాని. అయినా బయట ఏదో గడ్డి తినేవచ్చి ఉంటావనుకో' అని అన్నం వడ్డించింది ఆవిడ. అన్నం సయించనూ లేదు. తినక తప్పనూలేదు.

'మహా గొడవగా ఉందే, ఎప్పుడు స్నేహితులతో కాస్త సినిమాకి వెళ్లినాను? చెప్పెయ్యాలి నేను చంటిపిల్లాడిని కాదని, ఉద్యోగం చేసుకుంటున్నాననీ, నా ఖర్చులు నా కుంటాయని. నా స్నేహితులు, నా అలవాట్లు నావని' చెబుదామనుకున్నాడు. ఒక్కసారి చెప్పవలసినవల్లా చెప్పేసి తేల్చేసుకోవాలి అనుకున్నాడు రామారావు. బాగానే ఉండేది తేల్చేసుకుంటే. కాని ఆ ఆలోచన మనస్సులోనే ఉండిపోయింది మరికొంత కాలం దాకా.

ఈలోగా మహా తొందరపడిపోయాడు రామనాథం. 'ఎందుకు అంత గాబరా, మన సరోజలేదూ' అన్నది మీనాక్షమ్మ. ఇంటికి వెల్లవేసినట్లూ, తలుపుకు వార్నీసు వేసినట్లూ, రామారావు పెళ్లి రామారావుతో నిమిత్తం లేకుండా అయిపోయింది. గొంతులో మాట నాలిక చివరిదాకా వచ్చినా, అక్కడితో ఆగిపోవలసిందేనని రామారావుకు తెలిసొచ్చింది.

రామారావు గృహస్థుడయ్యాడని తెలుసుకునేటప్పటికి రామనాథం, మీనాక్షమ్మ వంతులవారీగా యీ లోకాన్నుంచి దాటుకోవడమూ, సరోజ యింటి పెత్తనంతోబాటు భర్తపై అజమాయిషీ కూడా చలాయించటమూ అమలులోకి వచ్చేసాయి! పాతకాలపు మిత్రులు కనిపించి అదోలా చూసేవారు రామారావుని. ఏకాలో చెయ్యో విరిగో, పక్షవాతం వచ్చి ఒక వైపంతా చచ్చుపడిపోయినప్పుడు చుట్టు పక్కలవాళ్లు చూసే సానుభూతిలాంటిది చూపించటం మొదలెట్టారు. 'పాపం రెండు ఉద్యోగాలు రామారావుకి—బయట ఆఫీసు ఉద్యోగం, యింట్లో భార్యా ఉద్యోగమూను, పాపం' అంటూ వేళాకోళం చేసేవారు.

నిజానికి రామారావు చేదు మేస్తున్నాడా అంటే 'చేదు అంటే ఏమిటి? నీకు చేదు అనిపించేది మరొకళ్లకి తీపి అనిపించవచ్చు. అంత అనుకూలవతియైన భార్య దొరకటం ఎంత అదృష్టం' అనే వాళ్లూ ఉన్నారు. కాని ఆ మాటలు కేవలం ఎదటివాళ్లచేత కాదనిపించుకోటానికో, లేక వ్యంగ్యాన్ని సూచించటానికోనని తెలుసుకోవటానికి మరి ఎక్కువ సేపు పట్టదు.

రామారావుచొప్పగడ్డిలాంటి బతుకులో మార్పు, మరేమిటి, విప్లవం రావటానికి కారణం ఉప్పెనలాగ కొన్ని సంఘటనలు జరగటమే.

రోజూలాగే ఆఫీసుకు వెళ్లాడు రామారావు అవాళ కూడా. ఫ్లాస్కులో కాఫీ పెద్దగుమస్తాకు యివ్వలేదు. ఇవ్వక పోవటానికి ప్రత్యేకమైన ఆలోచన ఏమీలేదు మరి. ఆయన ఒకటి రెండు సార్లు పని ఉన్నట్లు పిలిచాడు. పిలిచిన పని చూసుకుని మళ్లా 'సీట్'లోకి కూర్చుని పని చేసుకున్నాడు. మరో గంట పోయిన తర్వాత ఏదో మరిచిపోయినట్లు రామారావు దగ్గరకు వచ్చాడు. 'చాలా శ్రద్ధగా పని చేస్తున్నట్లున్నావ్' అని, రామారావు గాబరా పడకపోవటం చూసి, 'అరే, యివన్నీ నువ్వు చూసేసిన ఫైల్సే' అని మరికాస్త ఆశ్చర్యాన్ని ప్రకటించాడు. 'ఊ' అని కొంచెం పక్కకు తిరిగి ఏదో మరిచిపోయినట్లనిపించి 'మీకు కాఫీ ఇయ్యలేదు.....' అన్నాడు.

'ఫర్వాలేదు. ఇంచుమించు రోజూ తాగుతూనే ఉన్నానుకదా' అన్నాడు పెద్ద గుమాస్తా మొదటిసారిగా.

మరి కాస్సేపున్న తర్వాత అప్పారావు వచ్చాడు రెండు ఫైళ్లు పుచ్చుకుని 'ఈ ఫైళ్లు...' అని మాట పూర్తి చెయ్యక ముందే 'ఇప్పుడు పని తొందరలో ఉన్నాను, చూడటం కుదరదు' అన్నాడు ఏ లోకంలో ఉన్నాడో మరి.

అప్పారావు ఒక్కసారి 'షాక్' తిన్నాడు. ఎవరు యీ మాట్లాడుతున్నది? రామారావా; రామారావు భూతమా? ఇది ఎలా సంభవం? అని గుంజు కుంటూ వెళ్లిపోయాడు, మైకంలో ఏమీ అడగకుండానే.

అవాళ సూపర్నెంటు పిలిచి 'ఏమిటి, ఏదొచ్చినా కష్టమేనే నీతో. వారరోజుల పనీ ఒక్కరోజులో చేసేశావా, లేకపోతే వారంరోజుల బట్టీ పేరబెట్టి ఇవాళ కాగితాలన్నీ కట్టకట్టి పంపించావా?' అన్నాడు.

రామారావుకు ఏదో అనిపించింది. ఏదో కొత్తగా ఉంది చూస్తే. చాలా చెబుదామనుకున్నాడు. ఇప్పటి దాకా తను అప్పారావు బోటి తోటి సోదర గుమాస్తాల పని కూడా నెత్తిన వేసుకు చేస్తున్నాడనీ, తనకు ప్రోత్సాహం యిస్తే యింకా ఎక్కువ పని కూడా చెయ్యగలడనీ.. పెద్దగుమాస్తా తనని పురుగు లాగ చూస్తున్నాడనీ యింకా యింకా ఎన్నో... తనకు జరుగుతూన్న అవమానాల్ని గురించి ఎన్నో ఎన్నో చెబుదామని అనుకున్నాడు. మళ్లా అలావాటు ప్రకారం నోట్లో మాట నాలిక చివరి దాకా వచ్చి ఆగిపోయింది. 'అవునండి. మరండి...' అంటూన్న మాటల్ని వినిపించుకోకుండా నవ్వు కుంటూ వెళ్లిపోయారు ఆయన బయటికి.

ఆ విధంగా ఎందుకు అనిపించిందో అర్థం కాలేదు. సీట్లో కూర్చున్న తర్వాత రామారావుకి పని చెయ్య బుద్ధి కాలేదు. అటుచూస్తే ఆ వారం లోనే కొత్తగా టైపిస్టుగా వచ్చిన నిర్మలతో అప్పారావు బాతాకానీ వేస్తున్నాడు. ఆ అమ్మాయి ముఖం చిట్లించుకున్నా యింకా ఏదేదో చెబు తున్నాడు అప్పారావు.

రామారావు గబగబా లేచి వెళ్లి నిర్మలకు తనను తాను పరిచయం చేసుకున్నాడు. అప్పా రావుకు ఎందుకో అది నచ్చలేదు. 'ఈ పురుగు ఎవరు' అన్నట్లు చూసి ఏదో అనబోయి విసురుగా వెళ్లిపోయాడు. ఎప్పుడు వదిలించుకుంటావా అనుకుంటూన్న నిర్మలకి 'రిలీఫ్' అనిపించింది.

'మీకు ఏమైనా తెలియకపోతే...'

'థాంక్స్'

అవాళ సాయంత్రం కూరలు తీసుకు వెళ్లలేదు రామారావు. 'పని అంత ఎక్కువగా ఉందా' అని అడిగింది సరోజ.

'ఉంటుంది' అన్నాడు నిర్లక్ష్యాన్ని సూచించే టట్లు.

'ఇవాళ పొద్దున్నుంచే చేస్తున్నారా యీ ఉద్యోగం?'

'రేపట్నుంచి యింటి దగ్గరకు వచ్చిన వాళ్ల దగ్గరే కొను' ఇంకా అదే ఫక్కీలో మాట్లా డుతూ.

'అంతటితో ఆగారు. నన్నే వెళ్లి కొనుక్కో మ్మన్నారు కాదు యింకా'.

'నువు వెళ్లి కూరలు కొనుక్కుంటే తప్పేమిటి? పుచ్చులు లేని వంకాయలు, లేత బెండ కాయలు..' అలా అంటూ ఉండాలనిపించింది. ఆ విధంగా మాట్లాడుతూంటే ఏదో గమ్మత్తుగాఉంది.

'మీకేమయింది యివాళ? ఆఫీసులో ఏమన్నా గొడవలు అయ్యాయా?'

'అంతా సవ్యంగానే ఉంది' అన్నాడు పోర్షన్ మరిచిపోని 'ఏక్టర్' లాగా, 'నిల్చోబెట్టి ప్రశ్నలు అడగటం చాలు అనుకుంట' అని ముగిస్తూ.

మరో వారంరోజులు నిజంగా వహౌనంగా గడచింది. యాంత్రికంగా. సరోజ 'డ్యూటీ' చేసి నట్లు వంట చేసి పెట్టటం, కారియర్‌లో టిఫిన్, ఫ్లాస్క్‌లో కాఫీ పోసి యిస్తూనే ఉంది. 'ఉండి ఉండి యీ మనిషికి ఏమైంది' అనుకుంది లోపల సరోజ.

ఈ వారంలో ప్రతిరోజూ అప్పారావు ఏవో కాగితాలు రామారావు పైకి విసరటమూ, రామా

రావు వాటిని తిప్పి కొట్టటమూ జరిగింది. దానికో ప్రత్యేకమైన కారణంలేదు. సూపర్నెంటు రామారావంటే చాలా గౌరవంగా మాట్లాడటం మొదలు పెట్టాడు. పెద్దగుమాస్తా అదే విధంగా సర్దుకున్నాడు.

ఒకరోజున 'కాంటీన్'లో నిర్మల కాఫీ తాగుతోంది యింటర్వెల్లో. రామారావును చూసి 'విష్' చేసింది. 'కాఫీ తీసుకుంటారా' అంది.

'ఉహు'

'మీరు యింటి కాఫీగాని తాగరనుకుంట.'

'ఇవాళ తీసుకు రాలేదు.'

'అయితే తీసుకోండి' అని రామారావు వద్దంటూన్నా కాఫీ తీసుకువచ్చి యిచ్చింది.

ఒక 'కార్నర్ సీట్'లో కూర్చొని రామారావు వైపే చూస్తోంది.

'నేను చాలా విచిత్రంగా కనిపిస్తున్నాను కదూ' అన్నాడు నిర్మలతో రామారావు ఏదో మాట్లాడాలి గనక.

'మీరు విచిత్రంగా కనిపించరు గాని,మిమ్మల్ని గూర్చి విచిత్రంగా చెప్పుకుంటారు...'

రామారావు సమాధానం చెప్పలేదు. ఆపు చెయ్యనూ లేదు.

'నేను యీ ఆఫీసుకు కొత్తగదా, ఎంత కాలం బట్టో మీరంతా కలిసిమెలిసి పని చేస్తున్నారు గదా, ఒకళ్లమీద ఒకళ్లకి...'

ఈలోగా ఎవరో అక్కడికి రావటంతో వాళ్లిద్దరూ అక్కడనుంచి లేచి వెళ్లిపోయారు.

ఆవాళ సాయంత్రం ఆఫీసు కాగానే అప్పారావు యించుమించు కాళ్లకు అడ్డం తగిలాడు.

'ఏం గురూ, కనిపించటం మానేసావు'

'అవును రామారావు యీమధ్య ప్రజల్లోనే వడుతున్నాడు'

'రామారావు సూపర్నెంటు' 'యింప్రెషన్' కొట్టేస్తున్నాడు.'

'రామారావులో వస్తూన్న మార్పులు రావటానికి కారణం నాకు తెలుసు.'

'పిల్లి కళ్లుమూసుకుని పాలు తాగితే.. వడుస్తూ నడుస్తూ 'జంక్షన్'లోని హొటల్ దాకా వచ్చారు.

'రామారావు మనందరికీ కాఫీ యిప్పిస్తాడు'

'అవును యిప్పిస్తాడు.'

'ఆ మాత్రానికి వెనక్కి పోతాడేమిటి?'

'అవును, వెనక్కి పోతాడేమిటి?'

'కాఫీ తాగ దలుచుకుంటే తాగండి. నాకేమీ అభ్యంతరం లేదు' అన్నాడు రామారావు.

'పాపం వాళ్ల ఆవిడ నెలకి యింతని పైఖర్చుకి డబ్బు యిస్తుంది..'

'అది ఏ కూరలకో అయిపోయి ఉంటుంది'

'ఇహిహిహి'

'ఇహి... యిహి... హిహిహి'

'అదికాదు మీరు నా డబ్బుతో కాఫీ తాగ దలుచుకుంటే'

'పోనీ ఎవరి డబ్బులు వాళ్లు.. సోల్జర్ సిస్టమ్....'

'అమెరికన్ సిస్టమ్'

'రైటో'

కాఫీ తాగుతూన్నంత సేపూ అప్పారావు నిర్మలని గురించి ఏమిటేమిటో చెబుతూనే ఉన్నాడు. ఆ అమ్మాయి అంతకుముందు ఎంత మందినో దగా చేసిందనీ అసలు యిక్కడ ఉద్యోగంలోకి రావటంలో ఉద్దేశ్యం కూడా ఏదో ఉందనీను. అసలు రామారావు అమాయకుడు గనక, అభమూ శుభమూ ఎరుగనివాడు గనక, భార్యా సంసారం ఉన్నవాడు గనక, ఆ నిర్మల, చనువుగా మాట్లాడినా తనని మాట్లాడవద్దని చెప్పాడు అప్పారావు. మిగతా మిత్రులు అప్పారావు చెప్పిన దాన్ని మరీ మరీ నొక్కి చిలవలూ పలవలూ కల్పించి చెప్పారు.

అప్పారావూ మిత్రులూ వదలగానే యింటికి వచ్చాడు రామారావు. సరోజ ముఖం ముడుచుకుంది ఆలస్యంగా వచ్చాడని. మరో రోజైతే మరేవన్నా అనేవాడేమో? కాని అవాళ రామారావు

కిమ్మనకుండా కూర్చున్నాడు, ఏదో పాతపత్రిక తిరగేస్తూ. సరోజ మాట్లాడకుండా తనమానాన్న తన్ను వదిలెయ్యటం ఎంతో హాయిగా ఉన్నట్లుగా ఉంది అతని ప్రాణానికి.

మొట్టమొదటిసారిగా తనకి తానుగా ఉండటానికీ యిదంతా ఏమిటని ఆలోచించటానికీ అవకాశం దొరికింది— గానుగెద్దులాగ తన ప్రమేయం లేకుండా సాగిపోతూన్న బతుకుని ఒక్కసారి సింహావలోకనం చేసుకోవటానికి.

తను ఎవరు యింతకీ? అమ్మా నాన్నా కనిపెంచి అత్తెసరు చదువు చెప్పించి గుమాస్తాగా ఫ్యాక్టరీలోకి తోసి తన యిష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా మరో జీవిని పట్టుకొచ్చి తన జీవితానికి ముడివేసి తమ కర్తవ్యం తీరిపోయిందని, నిశ్చింతగా వెళ్లిపోయినందుకు ఒక్కసారిగా కసిగా కోపం వచ్చింది. ఎదురుగా ఉంటే సాగదీసి అడిగేద్దామనుకున్నాడు. కనీసం ఫోటోలు— మొన్న తద్దినం నాడు దండ వేసిన ఫోటోలు పగలగొటేద్దామనుకున్నాడు. దాని వలన కలిగే లాభం ఏమీ లేదని తెలుసుకునే సరికి ఉత్సాహం పైన నీళ్లు చల్లినట్లయింది.

అవును, తను యింతకీ ఎవరు? అందరూ యంత్రం లాగ వాడుకుంటున్నారు? భర్త అయిన నేరంగా యీ సుఖంలేని సంసారం భరించవలసి వస్తోంది. ఉద్యోగి అయిన నేరంగా తనకు యిష్టం లేని ఉద్యోగాన్ని సహించవలసి వస్తోంది. పొద్దున్న లేచినది మొదలు పడుకోబోయే దాకా తను ప్రతివాడికీ లొంగిపోతున్నాడు. ప్రతివాడూ తన చెవి మెలిపెట్టి తమకు కావలసిన పని చేయించుకుంటున్నారు. అది గాకుండా యింకా తన మీదే అజమాయిషీ చేస్తున్నారు? ఎందుకిలా అవుతోంది? అవుతోందా, లేక తనే యీరకంగా అవనిస్తున్నాడా?

రామారావుకు నిద్ర పట్టలేదు, ఆరాత్రి. అర్ధరాత్రి వేళ లేచి పక్కకు చూసాడు. సరోజ నిశ్చలంగా నిద్రపోతోంది. మరెప్పుడైనా మరేమన్నా అనిపించేదేమో? కనీసం సరోజను నిద్ర లేపేవాడు, కిటికీ చాటున యింకా దాక్కున్న చందమామని చూడమనో, ఆకాశంలోని మబ్బుల్ని చూడమనో, లేక పక్కింటివాళ్లు కట్టేయ్యని రేడియోలో పాట వినమనో. కాని రామారావు సరోజ నిద్రాభంగం చెయ్యలేదు. ఆక్షణంలో సరోజ ముఖం ఎందుకో అంత అమాయకంగా కనిపించనేలేదు. పక్కమీదనుంచి లేచి అటూ యిటూ పచార్లు చేసి పడుకున్నాడు. తెల్లవారు ఝామున కునుకు పట్టబోయేసరికి సరోజమీద కాలు వేసింది అలవాటుగా. మరొకప్పుడైతే తను కూడా అలవాటుగా సరోజ పక్కకు తిరిగేవాడు. కాని మెల్లిగా ఆ కాలు పక్కకి తప్పించాడు. ఒక్కసారి ఉలిక్కిపడి లేచింది సరోజ, 'ఏమిటండీ పడుకోలేదూ' అంటూ. 'పీడకల ఏమన్నా రాలేదు కదా?'

పొద్దున్న నిద్ర లేచిన సరోజకు ఏదో వెలితిగా ఉంది. కాఫీ యిస్తూ అంది. 'ఏమిటె, యీమధ్య మీరు అదో రకంగా ఉంటున్నారు' అని.

'సరిగ్గానే ఉన్నానే'

'ఆరోగ్యం బాగానే ఉంటున్నదా'

'చూస్తూనే ఉన్నావుకదా?'

ఇంక ఏమి మాట్లాడటానికీ తోచలేదు సరోజకు. ఏదో అనిపిస్తోంది. కాని దానిని స్పష్టంగా చెప్ప లేక పోతోంది. ఏమిటది?

ఆఫీసులో అందరితోనూ ముభావంగానే ఉంటున్నాడు. నిర్మలతో పరిచయం ఎక్కువైంది. రోజూ 'ఫ్లాస్కు'లో కాఫీ, పెద్ద గుమాస్తాకి బదులు నిర్మలకి ఇవ్వటం మొదలుపెట్టాడు. ఇది ఎవ్వరికీ నచ్చలేదు. పెద్ద గుమాస్తాకి కూడాను. కాని ఏమీ అనలేక పోతున్నారు కూడాను.

ఆఫీసులో ఒకళ్లంటే ఒకళ్లకి పడదనీ, అంతకుముందు గాడిద చాకిరీచేస్తూ, అందరికీ అడిగి ఒడిగి ఉండే రామారావు మనిషిలాగ మసలుకోవచ్చేసరికి వాళ్లంతా ఎడముఖం పెడముఖం పెట్టారనీ తెలుసుకోవటానికి ఎక్కువ రోజులు పట్టలేదు చురుకు పాలున్న నిర్మలకు.

ఉన్నట్టుండి ఒక రోజున 'మా యింటికి రావాలని ఉంది. మీ వాళ్లని పరిచేయం చెయ్యరూ' అంది నిర్మల.

రామారావుకు అర్థం కాలేదు, ఏమి చెప్పాలో. అవునంటే ఒక చిక్కు, కాదంటే మరో చిక్కొను.

అవాళ సాయంత్రం ఆఫీసునుంచి సరాసరి నిర్మలని తీసుకుని యింటికి వెళ్ళాడు. సరోజ తలుపు తీస్తూనే ఆ దృశ్యం ఒకబోసింది. నిర్మలని పరిచయం చేసాడు:

''ఈవిడ మా ఆఫీసులో పనిచేస్తారు.''

కాఫీతాగి ఏదో కబుర్లుచెప్పి పంపించేసాడు రామారావు. నిర్మల వెళ్ళిపోయిన తర్వాత సరోజ సరిగ్గా మాట్లాడలేదు కాస్సేపటిదాకా. నిర్మలని గూర్చి తనకు తానుగానే చెబుతాడనుకుంది. కాని మామూలుగా ఊరుకునేసరికి సరోజకి ఏమి అనాలో తోచలేదు.

మర్నాడు కొంచెం ఆలస్యంగా యింటికి వచ్చేసరికి సరోజ గుమ్మం దగ్గరే కాపలా వేసింది.

'ఏమండీ, మీరు యింత ఆలస్యంగా వస్తే....'

'వస్తే......'

'ఇల్లూ అదీ పట్టకుండా తిరుగుతూ ఉంటే'

'ఉంటే'

రామారావు లోపలికి వచ్చి కాస్సేపున్నతర్వాత టీ కప్పు అందిస్తూ 'అయినా మీకు తీరిక ఎక్కడ...'

'పిక్చర్లో పార్కుల్లోనే తిరుగుతారా, యింటికే వస్తారా'

రామారావు పెళుసుగా ఏదో సమాధానం చెప్పేద్దామనుకున్నాడు.

'మాట......'

'మాట తప్పించటంలేదు నేనుగాని, మనం తర్వాత తీరికగా మాట్లాడుకోవచ్చు. ఇప్పుడేగా యింటికి వచ్చింది?'

సరోజ బిక్కముఖం వేసింది. ఈరకంగా తను భరించలేకున్నది.

అవాళ రాత్రి రామారావు సరోజతో ఎంతో ముచ్చటగా మాట్లాడాడు. సరోజ ఉక్కిరి బిక్కిరి అయిపోయింది. ప్రేమలో పడ్డదానికి మల్లే ఎంతో మత్తుగా రామారావు కళ్లల్లోకి చూస్తూ రాత్రంతా గడిపేసింది. మొదటిసారిగా వాళ్లిద్దరూ ఏకాంతంలోని మాధుర్యాన్ని జుర్రుకున్నారు. తెల్లవారుఝామున మగత నిద్ర పట్టింది.

'అరెరె, ఆలస్యం అయిపోతోంది సరోజా, ఆఫీసుకు' అన్నాడు, పక్కమీదనుంచే. లేచి మంచం దిగేలోపలే కాఫీ యిచ్చింది రామారావుకు సరోజ.

'ముఖం కడుక్కోనీ'

'కడుక్కోవచ్చు లెద్దురూ కాఫీ త్రాగి.....'

అప్సరసవచ్చి అమృతం అందిచ్చినట్టుగా ఉంది రామారావు ప్రాణానికి. కాఫీ త్రాగి ముఖం కడుక్కుని స్నానం చేసి రాగానే టిఫిన్ రెండు ప్లేట్లల్లో పెట్టి 'రెడీ'గా ఉంది సరోజ.

'ఇప్పుడు టిఫిన్ ఏమిటి అన్నం తిని వెళ్లద్దూ'

'అబ్బ ఏంగాబరాపడి పోతున్నారండీ,రోజూ వెళ్లే ఆఫీసుకోసం. ఒక్కరోజు వెళ్లకపోతేనేం?'

'వెడితేనేం'

'అబ్బ.....ఉండిపోదురూ'

'నిజంగా'

'నాకు అబద్ధాలు చెప్పటం రాదు'

'పోనీ నేర్పనా నేను'

ఆఫీసుకు వెళ్లమన్నా వెళ్లే స్థితిలోలేడు రామారావు అవాళ. సరోజను చూస్తూంటే అలా చూస్తూ ఉండిపోవాలనీ, తియ్యగా మాట్లాడుతూ ఉండిపోవాలనీ అనిపించింది.

మరో రెండు రోజులు కూడా ఆఫీసుకు వెళ్లలేదు. ఆ మూడు రోజులూ రామారావు ఉపన్యాసాలు దంచెయ్యనూలేదు. సరోజ చెంపలు వేసుకోనూలేదు.

మూడు రోజులూ మూడుమధురక్షణాలుగా గడచిపోయాయి. ఇంతకాలంబట్టీలేని ఆనందం ఎక్కడనుంచి పెల్లుబికి వచ్చింది? ఈ ఆప్యాయత యిప్పటిదాకా ఎక్కడ దాక్కుని ఉంది? సరోజలో యింత 'సెన్స్ ఆఫ్ హ్యూమర్', యింత పిపాస ఉందని ఎందుకు తెలియలేదు తనకి?

భర్తకు తనపైన యింత అనురాగం ఉందని తనకు యీ అయిదేళ్లబట్టీ ఎందుకు తెలియలేదు? దాంపత్యంలో యింత తీపి ఉందని ఎందుకు అనిపించలేదు? ఒక సారిగా ఉప్పెనలాగ ఏమిటిది?

రామారావు ఆఫీసులోవాళ్లంతా అతన్ని ఏదేదో అడుగుదామనీ, దుమ్ముపట్టిద్దామని మహ

మనసు పడ్డారు. 'ఇంటర్‌వెల్'లో చుట్టు ముట్టి తలోలేక్రశ్నావేసి ఏడిపిద్దామనుకున్నారు.

రామారావు మాత్రం 'లీవ్' కాగితం అంతకు ముందే పంపించాడు గనక 'హెడ్‌క్లర్క్'గాని, సూప ర్నెంటుగాని ఏమీ అనడానికి వీల్లేకపోయింది. నిర్మల మాత్రం మరీ చనువుగా పలకరించింది.

'మీరు రాకపోతే యింటికి వద్దామనిపించింది. మీకు వంట్లో ఎలా ఉందోనని'.

'రాకపోయారా.'

'నేను ఎందుకురానో మీకు తెలుసు.'

'అదికాదు మీరు రండి చెబుతాను.'

'నేను రావటంవల్ల మీరు ఘర్షణ పడటం నాకు యిష్టంలేదు. అవాళ కూడా చాలా బాధపడ్డాను. అనవసరంగా కష్టపెట్టానేమా అని.'

'మీరు పొరబడుతున్నారు. మీరు యిప్పుడు సరోజను చూస్తే అలా అనరు?'

'ఊ......అలాగేం? అయితే తప్పకుండా వస్తా. వచ్చేటప్పుడు 'స్వీట్స్' కూడా తెస్తాను'

'మీరు రండి. మీరు వస్తే 'స్వీట్స్' తెచ్చి నట్లే!

'ఊ......'

'మిమ్మల్ని చేసుకున్నవాళ్లు చాలా అదృష్ట వంతులు'

'కాదు ఆ అదృష్టం నాదే'

వాళ్లు మాట్లాడుతూ మాట్లాడుతూ ఉండగా అప్పారావు బృందం రుస రుసా చూసి వెళ్లిపోయారు. 'ఎందుకో యీ ప్రజల కింత అసూయ' అంది నిర్మల.

'వాళ్లు ప్రజలు గనక. మనం ఎందుకో తెలియ కుండానే ప్రతి దానికీ భయపడతాం. దాన్ని అలుసుగా తీసుకుని ప్రతివాడూ భయపెడతాడు. పూచిక పుల్ల కూడా మనల్ని ఝడిపిస్తుంది. అవునా?'

'నిజమేనండి మీరు చెప్పింది' అంది నిర్మల. ఆమె కళ్లల్లో ఏదో నమ్మకం, ఉత్సాహం స్పష్టంగా కనిపిస్తున్నాయి.

రామారావు యింటికి వచ్చాడు. సరోజ నవ్వుతూ ఎదురొచ్చి పలకరించింది. ఇటూ అటూ చూస్తోంది, ఏదో పోయిన వస్తువును వెదుకుతున్నట్లుగా.

'ఏమిటి వెదుకుతున్నావు?'

'నిర్మల ఏదీ?'

'నా వెంట ఉంటుందనుకున్నావా ఎప్పుడూ?'

'ఒకేచోట పని చేస్తున్నప్పుడు ఉంటే తప్పే మిటో? అయినా అవాళ నేను కనీసం సరిగ్గా పలక రించనైనా లేదు. ఏమనుకున్నారో ఏమిటో ఆవిడ?'

'ఆ అమ్మాయి వస్తాననే అన్నది'

'మరి......మీరే తీసుకు రాలేదన్నమాట..... అవును, అవాళ మీదపడి పీకేసేలాగ మాట్లాడాను కదా!'

'అదికాదు'

'కాకపోవటమేమిటి, నా మూర్ఖత్వం అప్పుడు తెలియదుగాని, యిప్పుడు తలుచుకుంటే తెలియడం లేదా ఏమిటి?

'బాగుంది వరస'

'మీరు రేపు వచ్చేటప్పుడు తప్పకుండా తీసుకు రండి. లేకపోతే నేనే వాళ్ల యింటికి వెళ్లి బొట్టు పెట్టి పిలుచుకువస్తాను'

'అది బాగుంటుంది కూడాను'

'మిమ్మల్ని నిల్చోబెట్టే మాట్లాడుతున్నాను. టీ అయినా ఇవ్వకుండా'

'రోజూ తాగే 'టీ' ఏ గదా?'

ఆ రాత్రీ, మరో రాత్రీ, మిగతా అన్నిరాత్రులూ ఎంతో తియ్యగా గడిచాయి.

గానుగెద్దు జీవితం మారింది. రామారావు బతుకు పూర్తిగా మారిపోయిందనటంకన్నా, మార్చుకున్నా డనటం నిజం. బతుకు మామూలుగా, నిస్సారంగా అయిపోవటానికి ప్రయత్నం అనవసరం. ఆ గాడిలోంచి తప్పించి మరో బతుకుబాట వేసుకోవాలంటేమాత్రం దానంతట అది సాధ్యపడదు. సాధించాలి. వదిలేస్తే పొలం అంతా కలుపు మొక్కలువేసి చేనుని తినేసినట్లు 'ధాని మానాన్న దాన్ని వదిలేసి, అన్నిటికీ తలఒగ్గి భయ పడితే బానిసగా మారిపోతాడు మనిషి. మనలో యించు మించు ప్రతివాడూ ఒక రామారావే. కనీసం రామారావు పోళ్లు అయినా ఉన్నాయి మనలో చాలామందిలో. ఇది తెలుసుకున్న మరుక్షణం మనలో చాలామంది బతుకు లకి ఒక కొత్త అర్థం వస్తుంది.

# ‘జక్కులు’ మాగధీ ప్రాకృత భవమా?

డా. తూమాటి దోణప్ప

సంస్కృత ప్రాకృతాద్యష్టభాషా స్వరూప నిరూపణము (అప్ప. 1, 71 నుండి 81) సందర్భమున కాకునూరి అప్పకవి కావ్యనాటకాదుల వాని ప్రయోగవిధానము (పైది, 1–82, 83)ను వివరించి తనచర్చను విస్తరించి వ్రాసినట్లు అప్పకవీయము మనకు ప్రత్యక్ష సాక్ష్యము. సందర్భోచితముగా లక్షితములయిన యుదాహరణములతో గూడ ఈ చర్చారీతి బాలసరస్వతి సంక్షిప్త సూచనకు విపులవ్యాఖ్యానమను నాశయము వక్ష్యమాణము. శాస్త్రకారులు సాధారణముగా తాము ప్రమాణముగా నంగీకరించిన శాస్త్రగ్రంథములయం దుదాహృతమయిన లక్ష్యములనే స్వీకరించి ప్రతిపాదితాంశములను వివరించుటయు తక్కుంగల విషయములయందును వాని ననుకరించుటయు శాస్త్ర సంప్రదాయము. బాలసరస్వతి యుదాహరించిన ప్రాకృతభవ విభేదముల రూప నిష్పాదన విధానమును ప్రాకృత వ్యాకరణ మూల సూత్రముల మూలమున సమగ్రముగా విశదీకరించుట అప్పకవీయమునందలి విశిష్టత.

‘ఆద్యః ప్రకృతిః ప్రకృతిశ్చాన్యే యేషా తయోర్భవే ద్వికృతిః (ఆంధ్ర శబ్ద చింతామణి, సంజ్ఞా. సూ. 10) అను చింతామణి మూలసూత్రములను వివరించి బాలసరస్వతి తెలుఁగునందలి షడ్విధ ప్రాకృత భవములకు లక్ష్యములను , నిర్దేశించుచు ‘..... జూదము శూరసేనీ తద్భవము. జక్కులు మాగధీ తద్భవము....’ (బాలసరస్వతీయము, వావిళ్ల. 1963, పు. 152) అని కావించిన లఘువివరణము ఆధారముగా అప్పకవి—

‘శౌరసేని జూదంబు, పైశాచియందు
సాన, మాళికయనియెడు రాచ
కొల, మపభ్రంశ భాషోక్తివలన మూఁగ
దనరు, మాగధి జక్కులు తద్భవములు’
(అప్ప. 1–94)

‘....జక్కులు......మాగధీ భాషనైన తద్భవము’(పైది) అని ప్రపంచించినా డనుట సుస్పష్టము. అప్పకవీయమునం దీ విభాగమున వివృతమైన సకలాంశములు బాలసరస్వతి వచన రూప ప్రసంగమునకు పద్య రూప ప్రతిబింబములు. ఆ యా పద్యములకడ నుద్ధృతములయిన ప్రాకృత వ్యాకరణ సూత్రములయు, తద్వివరణములయు ఎత్తుగడ మాత్రము క్రొత్తదనమును అప్పకవిగొప్పదనమును ప్రకటీకరించునట్టిది.

కాని ‘జక్కులు మాగధీ తద్భవ’ మను బాలసరస్వతి ప్రతిపాదనమును ప్రాకృత వ్యాకరణసూత్రములాధారముగా సాధించుటలో అప్పకవి చేసిన కసరత్తు నేల విడిచిన సాముగాఁ గన్పట్టుచున్నది. ‘.. .జక్కులు......ఇది మాగధీ భాషనైన తద్భవము’ (పైది; పుట. 37) అనిఅంగీకరించి, ఏతద్రూప నిష్పాదనమున తత్త్వవికసనప్రక్రియాచణములుకాని ప్రాకృత వ్యాకరణ సూత్రములను ప్రకరణ విరుద్ధముగా అన్వయింప నుద్యోగించుట, అప్పకవివంటి లాక్షణిక శిరోమణి ఉపలక్షింపఁ దగినదికాదని నిర్ధారించుట ప్రకృత సమీక్షావ్యాపారము పరమార్థము

ప్రాకృత లక్షణ గ్రంథములు ప్రాచ్యములు, ప్రతీచ్యములునని ద్వివిధమని శాస్త్రప్రపంచవిదుల వివేచనము[1]. ప్రాచీశాఖ (Eastern School) కు ప్రాకృతప్రకాశకర్తయగు వరరుచి ఆచార్యపీఠము.

---

1. Sir george A. Grierson, The Eastern School of Prakrit Grammarians and Paisaci Prakrit.

ప్రతీచీశాఖ (Western School) కు వాల్మీకి సూత్ర కర్తగా సంభావితుఁడగు వాల్మీకి గురుస్థానము2. ప్రాకృతానుశాసనకర్త పురుషోత్తమదేవుఁడు (1265—1300), ప్రాకృత కామధేనుకర్త లంకేశ్వరుఁడు, సంక్షిప్తసారకారుఁడు క్రమదీశ్వరుఁడు ప్రాకృత కల్పతరుకర్త రామశర్మ తర్కవాగీశభట్టాచార్యుఁడు (1600—1650), ప్రాకృత సర్వస్వకారుఁడు మార్కండేయ కవీంద్రుఁడు (1666—1696) మొదలగువారు ప్రాచీశాఖానుయాయులు. సిద్ధ హైమ వ్యాకరణ నిర్మాత హేమచంద్రముని (1088—1172), ప్రాకృత శబ్దాను శాసన కారుఁడు త్రివిక్రమదేవుఁడు (1236—1300), ప్రాకృతరూపావతార రచయిత సింహరాజు (1200-1360), ప్రాకృత చంద్రికాకర్త శేషకృష్ణపండితుఁడు, షడ్భాషా చంద్రికాకారుఁడు లక్ష్మీధరుఁడు (1500—1580), ప్రాకృతమణిదీపకర్త అప్పయ్య దీక్షితులు (1554—1630) మున్నగువారు ప్రతీచీ మార్గానుగాములు.

హేమచంద్రాది ప్రతీచీ మార్గానుసారుల ప్రాకృతవ్యాకరణములే ఆంధ్రలాక్షణికులకు సుపరిచితములయినట్లు నిష్కర్షించుట ప్రమాణోపపత్తి సంకలితము. 'విశ్రుతులు హేమచంద్ర త్రివిక్రమాదు లొసరఁ జూపిరి ప్రాకృతంబునకుఁ ద్రోవ....' (కావ్యా. చూ. 9—8), 'హేమచంద్రాది మునభిః కథితం చాంధ్ర లక్షణమ్' (త్రిలింగ శబ్దాను శాసనము), 'ఇల త్రివిక్రమరచిత వృత్తులను హేమ చంద్ర సూరి ప్రణీత భాష్యంబుచేతఁ దనరు వాల్మీకి మూల సూత్రములవలనఁ బ్రాకృతాది షడ్భాషలుద్భవముఁ జెందె'(అప్ప. 1—79) 'ప్రాకృతే షడ్విధే చాపి వాల్మీకిం వా మహేశ్వరం'(వికృతి వివేకము, సంజ్ఞా. 5). ప్రాచ్య మతమునకుఁ జెందిన మూలగ్రంథమగు వరరుచిప్రాకృత ప్రకాశమునకుఁదప్ప తక్కిన ప్రాచ్య ప్రాకృత వ్యాకరణములకు ఆంధ్ర లాక్షణిక ప్రపంచమున అంతగాఁ బ్రచారమున్నట్లు కన్పట్టదు.

విశేషించి త్రివిక్రముఁడు, సింహరాజు, లక్ష్మీధరుఁడు అచ్చముగా ఆంధ్రులని కొందరు విజ్ఞుల యభిప్రాయము. తక్కినవారి మాటకేమిగాని వైకృత చంద్రికాకారుఁడగు మంచెళ్లవాసుదేవకవి లాక్షణిక దృక్పథముమీఁద లక్ష్మీధరుని ప్రభావము ప్రగాఢముగా పడినట్లు పరిశోధక నిర్ధారణము.3 లభ్యమయిన లక్ష్మీధరుని షడ్భాషాచంద్రిక లిఖిత ప్రతులన్నియును తెలుఁగు లిపిలో వ్రాయఁబడి యుండుట వలన దీనికి తెలుఁగునాటఁగల ప్రచార ప్రశస్తులు సువ్యక్తము. అప్పకవ్యాదుల యుద్ధరణములలో అనువారము నుట్టంకితుఁడయిన ప్రాకృత వ్యాకర్త అధోక్షజుఁ డెక్కడివాఁడో, అది యతని పుట్టు పేరో పెట్టుపేరో, యేతత్కృత కృతికాస్వరూపము లెట్టివో ఇత్యాదు లింతవరకు సమాధానమురాని సవాలక్ష శాస్త్ర సమస్యలలో కొన్ని.

ప్రకృత సమీక్షలో మాగధీ ప్రాకృత భాషా స్వరూపమును గురించి సంగ్రహముగా వివరించుట సమంజసము. 'ప్రచక్షతే మాగధీం తాం యా భాషా మగధోద్భవా' యని భాషాప్రదీపోక్తి. 'కైవర్తభిల్ల ముఖ్యానాం మాగధీ వినియుజ్యతే' యని దండి నిరూపణము. 'రాక్షస భిక్షు క్షపణక చేటాద్యా మాగధీ ప్రాహుః' యని కోహలుని మతము. 'తథా ప్రాకృత భాషైవ కించి ద్విశేష లక్షణా మాగధీ కా భణ్యతే' యని నమిసాధు వ్యాఖ్యానము. 'అత్రేహ మాగధ్యను శిష్యతే యా క్రవ్యాద భిక్షు క్షపణకాదికానాం' అని ప్రాకృత కల్పతరు వివరణము. 'మగధ దేశోక్తులు మాగధీ భాష' (అప్ప. 1-81), 'ధీవరలుబ్ధకాది వినీచజాతుల మానవులకు నెల్ల మగధ భాష' (వై. ది. 1—83) అను అప్పకవీయానుసర్జనము పూర్వ లాక్షణిక మతమున కనుప్రాసము. మాగధ ప్రాకృతమునందు ర, స లు—ల, శ లగుటయు, జ యు లు యకారముగా మారుటయు, క్ష, ద్య లు క్రమముగా శ్క, య్య లుగా పరిణతినందుటయు ప్రకృష్ట ప్రాకృతముల కంటె విభిన్నములైన ధ్వని పరిణామములు.

మాగధీ ప్రాకృతమునందు పదాది యకారము స్థితిలో మార్పుండదు. య—యగానే నిలుచుట

2. త్రివిక్రముఁడే సూత్రకర్తయని కొందఱు. Bhattanatha Swamin, Trivikrama, and his followers, Indian Antiquary, 40, pp. 219–223.

3. Dr. T. Donappa, Old and Middle Indo-Aryan Assimilated Loan words in Telugu (Unpublished Thesis).

మాగధిలో నిత్యసూత్రము.[4] అశోకుని ధర్మలిపి శాసనములలో నుపయుక్తమయిన ప్రాకృత భాషా భేదములయందును, యత్ర, యథా, యాదిస, యారిస (< సం. యాదృశ)—ఇత్యాది యకారాది పదములు తప్ప జకారాదులు కానరావని పరిశోధక పండితుల నిర్ణయము.[5] పైశాచీ ద్వితయమునందు మాత్రము యకార పరిణామ మనియతము. ఇందు య—య గా నుండవచ్చు. మాగధిలో పదాది జకారము సైతము యకారముగా మారుట నిత్యవిధి.[6] మాగధీ ప్రాకృత స్వరూప నిరూపణావసరమున సర్వ ప్రాకృత వ్యాకరణముల యందును, సంస్కృత యక్ష శబ్దము యᳵక—, యశ్క—అను రూపద్వయముతో మాగధ ప్రాకృతమునందు ప్రవర్తిత మయినట్లు సూత్రితము. స్పష్టప్రతిపత్తి నిమిత్తము ఉభయ శాఖలలోని ప్రాకృత వ్యాకరణముల లక్ష్య లక్షణ సమన్వయశక్తి దిఙ్మాత్రముగ నిట ప్రదర్శితము.

'జోయః' (ప్రాకృత ప్రకాశ. 11-4) జకారస్య యకారోభవతి; 'క్షస్యస్కః' (పైది, 11—8) క్షస్య స్థానే స్కకారో భవతి (భామహుని మనోరమా వ్యాఖ్య,[7] రామపాణి వాద కృతవృత్తి).[8] 'జ—ద్య—యాం—యః' (హేమచంద్ర 8-4-292). మాగధ్యాం జద్యయాం స్థానే యో భవతి. యస్య యత్వ విధానం ఆదేర్యోజః ఇది బాధనార్థమ్. యణపదే < సం. జనపదః; మయ్యం < సం. మద్యం; 'క్షస్యᳵకః'(పైది, 8-4-296). మాగధ్యా మనాదౌ వర్తమానస్య క్షస్యᳵకో జిహ్వామూలీయో భవతి. యᳵకే < సం. యక్షః; లᳵకశే < సం. రాక్షసః.

'జయ్యయోః యకారోభవతి, 'క్షస్యశ్కోనాదౌ' యశ్కే లశ్కశే యక్షో రాక్షస ఇతి'' (నమిసాధుకృత టిప్పణి, రుద్రటుని కావ్యాలంకార.[9] 2-12), 'జ య ద్యాం యః' (త్రివిక్రముని ప్రాకృత శబ్దానుశాసనము[10], 3-2-31). మాగధ్యాం జకార యకార ద్యకారాణాం యకారోభవతి. 'క్షఃᳵకః' (పైది3-2-33). మాగధ్యా మనాదౌ వర్తమానస్య క్షకారస్య జిహ్వామూలీయాక్రాంత కకారో భవతి. యᳵకే- యక్షః; లᳵకశే - రాక్షసః.

'జ—ఝ—యోర్య్యయశ్చ' (పురుషోత్తముని ప్రాకృతానుశాసనము, (12—5), 'ఙస్యశ్కః' (పైది 12-6); 'జయద్యాంయః' (సింహరాజ కృత ప్రాకృత రూపావతారము,[11] 19—11), జకార యకార ద్యకారాణాం యకారో భవతి', 'క్షఃᳵకః' (పైది, 19—9).

'జయద్యాంయః'(లక్ష్మీధరుని షడ్భాషాచంద్రిక[12] 3—2—39), 'క్షᳵకః (పైది, 32—33) యᳵకే—యక్షః, లᳵకే—రాక్షః, 'వర్గస్య యస్యాత్ర భవేద్యకారోయథే యథా య ణదియా వయశ్క' (రామశర్మకృత ప్రాకృత కల్పతరు[13] 2—2—14).

'క్షస్యᳵకః' (మార్కండేయుని ప్రాకృత సర్వ

---

4. R. Pischel, Comparitive Grammar of the Prakrit Languages, translated from the German by S. Jha, Varanasi 1957, pp. 179, 180; Dr. Subhadra Jha, The Formation of Maithili Language 1958, p. 181.

5. M. A Mehendale, Historical Grammar of Inscriptional Prakrits, Poona, 1948, p. 13.

6. Pischel, pp. 170, 171; Ananta Prasad Banerji—Sastri, Evolution of Magadhi, Oxford, 1922, p. 35.

7. Ed. by E. B. Cowell, Punthi Pustak, Calcutta 1962.

8. Ed. by C. Kunhan Raja, Adyar Library Series, Madras, 1946.

9. Ed. by Pundit Durga Prasada Wasudeva Laxmana Shastry Panasikar, Nirnaya Sagar Press, Bombay, 1909.

10. Ed. by Pandit Jagannatha Sastry Hoshing, Chowkhamba Sanscrit Series, Banares; Another Edition, ed. by Dr. P. L. Vaidya, Sholapur, 1954.

11. Ed by E Hultzsch, Royal Asiatic Society, 1909.

12. Ed. by K. P. Trivedi, Bombay, 1916

13. Ed. Manomohan Ghosh, The Asiatic Society, Calcutta, 1954.

స్వము[14] 12—4), 'జయద్యాంయః' యేషాం యకారో భవతి. శమాయే—సమాజం, యయే—జయః, 'క్షగ్గకః' లగ్గకఏ—రాక్షసః (శంభురహస్యాంతర్గత ప్రాకృత శబ్ద ప్రదీపిక, అధ్యా. 267 పు.63).

తక్కిన అపభ్రంశ అర్ధమాగధీ జైనమహారాష్ట్రీ జైనశౌరసేనీ మహారాష్ట్రీ శౌరసేనీ ప్రభృతి ప్రాకృతములయందే పదాది యకారము జకారముగా ప్రవర్తితమగుననుట ప్రాకృత భాషా తత్త్వవేత్తలందఱును నిర్ద్వంద్వముగా నిర్ధారించినయంశము.[15]

మాగధ్యేతర ప్రాకృత భాషలలో పదాది యకారము జకారమగుట ప్రచురమైన ధ్వని పరిణామము. 'ఆదే ర్యోజః' (ప్రాకృత ప్రకాశ, 2—28) ఆదిభూతస్య యకారస్య జాదేశో భవతి (వసంతరాజ కృత సంజీవనీ వ్యాఖ్య[16]) 'ఆదేర్యోజః (హేమచంద్ర, 8—1—245) పదాదేర్యస్య జో భవతి (పై.ది.).

'యక్షో జక్ఖో.....భవతి' (భరతుని నాట్యశాస్త్రము, అధ్యా 17, శ్లో. 23), 'యస్యజః (చండుని ప్రాకృత లక్షణము,[17] 3—15) యకారస్య స్థానే జకారో భవతి (పై.ది.)

'ఆదేర్జః' (త్రివిక్రముని ప్రాకృత శబ్దానుశాసనము, 1—3—74, సింహరాజు ప్రాకృత రూపావతారము, 7—3; లక్ష్మీధరుని షడ్భాషాచంద్రిక, 1—3—74; అప్పయ్య దీక్షితుల ప్రాకృతమణిదీపిక 1—3—34; ప్రాకృతమణిదీప దీధితి సహితము[18]; శంభు రహస్యాంతర్గత ప్రాకృత శబ్ద ప్రదీపికా, అధ్యా. 267, పు. 24) 'ఆదేశ్చ జో యస్య' (ప్రాకృత కల్పతరు, 1—2—14.) 'ఆద్యస్య యో జః స్యాత్' (ప్రాకృత సర్వస్వము 2—30).

సంస్కృత యక్ష శబ్దము పాలీభాషలో యక్ఖో అనియు,[19] మాగధీలో యస్కే/యశ్కే అనియు, తక్కిన ప్రాకృతములలో జక్ఖో అనియు పరిణతము[20].

అసలు విషయ మిట్లుండ నానా గ్రంథసీమలు చూచి దివ్యబోధాఢ్యుఁడయిన అప్పకవి విపరీత రీతిలో 'జక్కులు' పదము రూపనిష్పాదనము సేయుట చింత్యము. 'కేవలాంధ్రులుగానరీతోవ'(అప్ప.పీఠిక55) కాబోలు! వరరుచి కృత ప్రాకృత ప్రకాశమును బహువారములు పేర్కొనిన అప్పకవి అందలి 'జో యః' (ప్రాకృత ప్రకాశ. 11—4) అను మాగధీ ప్రాకృత సంబంధి సూత్రమును విస్మరించి జక్కులు మాగధీ తద్భవమని నిరూపించుట అవిచారిత రమ యము వాస్తవముగా 'జక్కులు' మహారాష్ట్రీ ప్రాకృతభవమనుట నిర్బాధము.

అష్ట భాషా కవిత్వ సామ్రాజ్య పట్టభద్ర బిరుద విరాజితుఁడగు ఆంధ్ర లాక్షణికుఁడు మంచెళ్ల

---

14. Ed. by S. P. V. Bhattanatha Swamy. The Arsha Company, Vizag patam, 1927.

15. Pischel, pp. 179, 180; E. B. Cowell, Short Introduction to the Ordinary Prakrits, London, 1875, p. 10; John Beames, A Comparitive Grammar of the Modern Aryan Languages of India, Vol. I, 1872, pp. 248—250; A. C. Woolner, Introduction to Prakrit, Calcutta, 1928, p. 10; S. M. Katre, Prakrit Languages, Bharatiya Vidya Bhavan, Bombay, 1945, p. 47; Baburam Saksena, Evolution of Awadhl, Allahabad, 1937, p. 50; G. V. Tagore, Historical Grammar of Apabhramsa, Poona, 1948, p. 76; S. Jha, p. 181.

16. The Prince of Wales, Saraswati Bhavan Series 1927.

17. Ed. by Revatikanta Bhattacharya Sanscrit Pustakalaya, Calcutta, 1923.

18. Oriental Research Institute Sanscrit Series, Mysore, 1954.

19. T. W. Rhys Davids, Pali—English Dictionary, London 1952, part III, pp. 2, 3; Sir R. L. Turner, A Comparitive Dictionary of the Indo-Aryan Languages, Fasc. VIII, p. 601.

20. Muni Rattan Chandraji Maharaj, An Illustrated Ardha-Magadhi Dictionary, Vol. I, 1927, p. 74; AbhidhanaRajendra Kosh, Vol. IV, p. 1350; Pandit HarGovind Das TrikamChand Seth' Paia Sadda Mahannavo, Varanasi, 1963, p. 343.

వాసుదేవకవి (అప్పకవి—అహోబల పండితుల నడిమి కాలమువాఁడు) రచించిన వైకృత చంద్రికలో[21] మాగధీ ప్రాకృత విభాగమున ఉదాహృతములయిన పదములలో 'జక్కులు' పొడకట్టదు. తెలుఁగులోని తద్భవ విభాగమును విపులముగా సమీక్షించిన ఆంధ్ర లాక్షణికులలో ప్రథముఁడగు వాసుదేవుఁడు సంస్కృత భవములతోపాటు ప్రాకృత శౌరసేనీ మాగధీ పైశాచీ చూళికా పైశాచ్యపభ్రంశ భవములను ప్రత్యేక ప్రకరణములలో లక్ష్య లక్షణ సమన్వయము గావించి ఘనత వహించినవాఁడు.

పూర్వాచార్యుల యందలి ప్రమాణ బుద్ధి వలన అర్వాచీనులు వారిని అవితర్కితముగా అనుసరించుటచేత ప్రమాదములు దొరలుట అసంభావ్యము కాదు. తాను పతంజలి యవతారమనియు, ప్రథమాచార్యుఁడయిన నన్నయయే తానుగా నవతరించెననియు (అహో. పీఠిక, 75) గొప్పలు చెప్పికొనిన గురుకుల క్లిష్టుఁడు అహోబల పండితుఁడు సైతము దీని నవిమర్శముగా నంగీకరించుట అసమీచీనము. 'జక్కులు యూగేత్యా దౌజ్ఞేయౌ', 'జక్కులు ఇత్యాదౌ జిహ్వా మూలీయస్య లోపః క్షగక ఇతి మాగధ్యే సూత్రాత్...జక్కులు మాగధ్యే తద్భవః.....' అని అప్పకవి వ్యాఖ్యానము న్యామ్రేడించుచు 'కేచిత్తు ప్రాకృత తద్భవత్వంమేనిరే' (అహో, సంజ్ఞా. సూ. 12) అని జారవిడుచుట అసలు ప్రశ్నను కాదని ఖండించినట్లా? ఔనని అంగీకరించినట్లా? ఇట్లు చర్చా పరిధి దరిదాపులకు వచ్చి కూడ 'అష్టభాషా స్ఫురత్సార' పాండితీ సౌండీరుఁడగు అహోబళ పండితుఁడు చివరి మాటను జెప్పక ఉపేక్షించుట అసమీక్ష్య కారిత్వమునకు నిదర్శనము. ఈ పెద్దల 'భరోసా' వలన నారాయణీయాంధ్రకారుఁడును 'సం. యక్షాః ... మాగధీ భవము, జక్కులు' (నారాయణీయయాంధ్ర వ్యాకరణము, పు. 13) అని ప్రమాదము పడుట అంధానుకరణమునకు పరకాష్ఠ.

అసలు చింతామణి సూత్రములకు లఘు వివరణ మొనర్చిన బాలసరస్వతి సూచనకదా దీనికి మూలము! మఱి బాలసరస్వతీయము, ఆంధ్ర శబ్ద చింతామణి హృదయమని, '.....సత్కవీంద్ర మస్త మాణిక్య..'మని పండిత లోక ప్రతీతి. 'భాష్యాది బహు శాస్త్ర పరిచయోదాత్తుఁడు.....' (బాలసరస్వతీయము, పీఠిక 10), 'సకల భాషా కవితా స్వతంత్ర భట్టారకుఁడు...' (పైది, గ్రంథాంతము), సమస్త కవితాదక్షుఁడు (అహో, పీఠిక, 69) అయిన బాలసరస్వతి మహోపాధ్యాయుఁడు అల్ప బోధనుఁడని అనుట దుస్సాహసము!

> 'మూలము చెప్పిన నన్నయ
> భూలోక బ్రహ్మ యతని బుద్ధి తెలిసి వ్యా
> ఖ్యా లక్ష్యంబు లొనర్చిన
> బాలసరస్వతులఁ బోలు ప్రాజ్ఞులు గలరే'

(అప్ప. 1—91) అని అప్పకవి ప్రశంసోక్తి.

'జక్కులు' అనుట అచ్చు తప్పు కాకూడదా యను పూర్వపక్షమువారి ఆక్షేపము వృథావాదము. పరిశీలితములయిన ముద్రితాముద్రిత ప్రతులన్నింట నీ పాఠ మిట్లే యున్నది. పోనిండు. '.....మాగధి యక్కులు తద్భవములు' అని అప్పకవి పద్యమును దిద్దకూడదాయని పూర్వపక్షమువారి సవరణము. ఏమి సౌహార్దము! కర్తృ హృదయము నెఱుఁగక పాఠములను దిద్దుట చాల తేలిక. ప్రాలుమాలిక స్వాంతుల నిసర్గ లక్షణము. అలసత అజ్ఞతకంటె హానికరము! ముందు వెనుకలు ఆలోచించికొనక ఉన్న పాఠములను దిద్ది ఆ పిమ్మట నెదురగు చిక్కుల నెదుర్కొనుట నేలపైనున్న రాతిని నెత్తిమీది కెత్తికొనుట! అది పరిష్కర్త మర్యాదకాదని పెద్దల మాట. ప్రకరణము మాగధీ ప్రాకృత సంబంధి కావున ఇచ్చవచ్చినట్లు పాఠములను దిద్దుట ఇచటకాదు ఎచ్చటను వలనుపడదు.

ఒకవేళ 'యక్కులు' అనియో, 'యెక్కులు' అనియో దిద్దినచో తెలుఁగు మాటలయందే కాదు తద్భవములయందును పదాది యకారము కానరాదు. యకారాదిగా స్వీకరించినచో దీని కజ్వత్కార్యము ప్రవర్తితమగునా? అప్పకవి పాఠమును దిద్దినచో బాలసరస్వత్యాదులు పాఠములను సైతము దిద్దక తప్పదుకదా! ఇట్లు ఒక తప్పును గాచికొనుటకు పది తప్పుల నొప్పుకొనవలయునుగదా!

సమ్యక్ప్రకారముల 'గ్రంథములన్నియు వెదకి వెదకి సారమెల్ల....' (అప్ప. 2—7) ఆపోశనము పట్టిన అప్పకవి నిర్యుక్తికమగు నిట్టి ప్రసంగము సేయుట ఆశ్చర్యకరము.

---

21. వాఙ్మయ మహోధ్యక్ష శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారియొద్దఁగల తాళపత్త్రప్రతి.

'కాళిదాస మయూరాది కవులకైనఁ
గలవు తప్పు లరంగ నస్మ్యులకు లేవె
దిద్దఁదగునట్టి దిద్దుడు దిద్దరాని
యెడల నా నేరములు క్షమియించు టొప్పు'
(వై.ది. 1—28)

అని వర్తమాన కవులఁ బ్రార్థించి 'సకల గ్రంథములునుఁ జదువక తెలియునె లక్షణ ప్రపంచంబెల్లన్' (వై.ది. 2—6) అని ప్రతిజ్ఞచేసి—

'వినఁదగు వెండియుఁ బొత్తము
గనఁదగు, బుధ జనుల నడుగఁగాఁదగుఁ, గాకెం
దును దెలియని పట్లనఁ ద
ప్పున వలదని భావి జనుల కంజలివేడ్తున్'

(వై.ది 1—30) అని లక్షణ మొసర్చిన ఈ విజ్ఞప్తిని పురస్కరించికొని పెంపొందిన దీ తత్త్వ విచారాంశ. '.....సుకవి వరుఁడు తప్పు యోచించి తెలియునంతటను దెలియకున్నఁ దన్నయుఁ బెద్దల యొద్దఁ దెలియు....(వై.ది, 1—50) అను సూచనయును, 'విరచించు శక్తి పుట్టని పురుషుని చదువులు ప్రకాశములు గావు.....' (వై.ది. 1—53) అను అప్పకవీయ వివక్షితార్థమును ప్రేరేపఁగా ఈ చర్చ యింత దూరము సాగినది.

'అధికం యది నాధీషే తథాపి పఠ పుత్ర వ్యాకరణమ్' అను సుభాషితము మాట సరియకాని బహుధా విప్రతిపత్తి ధీ కలితములగు నిట్టి శాస్త్రార్థముల మాట యేమి? కళాప్రపూర్ణులు వజ్ఝల వారుగాని (వైయాకరణ పారిజాతము, ద్వి. ము. పు. 73), అహోబలపండితీయమునకు ఆంధ్ర వివరణమును సంధానించిన సొంఠి భద్రాద్రిరామ శాస్త్రులుగారుగాని (అహోబలపండితీయము, మంజువాణీ ముద్రాక్షరశాలవారి ముద్రణము, పు.72), అహోబల పండితీయమునకు క్రొత్తగా వ్యాఖ్యను వెలయించిన శిరోమణి చెలమచర్ల రంగాచార్యులుగారుగాని (అహోబల పండితీయము, ఆంధ్ర రచయితల సంఘము, హైదరాబాదు, 1965, పుటలు 151-155), దీనికి పీఠికను సంతరించిన కవితాభూషణులు వెంపరాల వారుగాని 'జక్కులు' మాగధ్ఛీభవమను ఈ ప్రవాదమును గూర్చి ప్రస్తావింపకపోవుట జిజ్ఞాసువుల దురదృష్టము. పూర్వోక్తమయిన సందేహమును విపర మాంద్యముగా ఉపేక్షింపక, నా చెప్పిన నాలుగు మాటలను విపరీత ప్రతిభాషలుగా భావింపక, బహుజ్ఞులును, సంప్రదాయజ్ఞులును నగు వాగ్యోగవిదులు సమ్యగ్రీతిని వివేచించి ఆంధ్ర లాక్షణిక హృదయము నావిష్కరింప వేడికోలు!

---



# విశ్వేశ్వరకవిచంద్రుని “చమత్కారచన్ద్రికా”

## శ్రీ నోరి నరసింహ శాస్త్రి

బహుకాలమునుండి ప్రసిద్ధముగా పేరుమాత్రము వినవచ్చుచున్న ఈ ఉత్తమ సాహిత్య శాస్త్ర గ్రంథము నేటికి డా. శ్రీరామమూర్తి సంపాదకత్వమున ఆంధ్ర విశ్వకలాపరిషత్తువారు చక్కగా ముద్రించి ప్రకటించుట ఎంతయు ప్రమోదావహము. కీ. శే. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తమ రెడ్డి రాజ్యముల చరిత్రములో ఈ గ్రంథమును ప్రస్తావించి ఇందులోని కావ్య స్వరూపమునే ప్రాతిపదికగా గ్రహించి జగన్నాథపండితరాయలు రసగంగాధరములో విస్తరించెనని ప్రకటించిన దాదిగా ఈ గ్రంథము పఠింపవలెనని సాహిత్యాభిమానులకు కలిగిన తహతహ తీరెడి యవకాశము నేటికి లభించినది.

ఇందులో మూలగ్రంథము దేవనాగరలిపిలో ముచ్చటగా 200 పేజీలలో ముద్రితమైనది. మూల గ్రంథ భాగములను ఉదాహృతగ్రంథశ్లోకాదికములను వేరువేరు టైపులలో ముద్రించుటవలన పాఠకులకు సౌకర్యము చేకూరినది.

సంపాదకులు శ్రద్ధగా 5 లిఖితగ్రంథములను పరిశీలించి మూలము నిర్ధారించిరి. (1) అడయారు లైబ్రరీలో నున్న తెలుగులిపి తాళపత్రగ్రంథము (2) లండను ఇండియా ఆఫీసు లైబ్రరీలో మెకెంజీ కలెక్షన్సులోఉన్న కాగితములమీద తెలుగు లిపిలో వ్రాసిన గ్రంథము. (3) పిఠాపురము సూర్యారాయ విద్యానన్ద లైబ్రరీలో తెలుగు లిపిలో నున్న తాళపత్ర గ్రంథము. (4) మదరాసు గవర్నమెంటు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములో దేవనాగరలిపిలో వ్రాసియున్న కాగితపు పుస్తకము. (5) అడయారు లైబ్రరి పండిత రామచంద్రశర్మగారు కాగితములపై దేవనాగరాక్షరములలో వ్రాసిన గ్రంథము.

ఈ యైదింటిలో ఉత్తమ పాఠములుగా తోచిన వానిని సంపాదకులు గ్రహించి తక్కినవానిని అథస్సూచికలలో చూపిరి. అపపాఠముగా తోచిన తావులలో సరియైన పాఠము నూహించి సవరించి మూల పాఠమును బ్రాకెట్లలో నిచ్చిరి. గ్రంథపాతమున్న స్థలములలో ప్రాచీన గ్రంథములనుండి పూరించుటకు వీలైనచోట్ల పూరించి బ్రాకెట్లలో చూపి తక్కినచోట్ల అట్లే వదిలివేసిరి.

ఈ విధముగా ఉత్తమ పరిశోధక మార్గమున మూలగ్రంథ పాఠము ప్రామాణికముగా పండితులు గ్రహించుటకు అనువుగా సంపాదకులు శ్రద్ధగా పరిశోధించి పాఠకుల కందజేసినందులకు సంపాదకులు ప్రశంసనీయులు.

గ్రంథాంతమందు 4 సూచిక లిచ్చినారు. 1. లక్షణ శ్లోకముల సూచి. 2. ఉదాహృత శ్లోకముల సూచి. 3. ఉదాహృత గ్రంథముల సూచి. 4. సముద్దిష్ట గ్రంథకారుల సూచి. ఈ సూచికలు మిక్కిలి ఉపయోగకరములు. అవి నిర్దుష్టముగానే సంతరింపబడియుండును. 3 వ సూచికలో సింగభూపాలీయము ఉదాహరింపబడినవానిలో V. 20 (పే. 86) లోపించినదని మా దృష్టికి తగిలినది. అట్టివే చిన్న యితర లోపములును ప్రమాదవశమున దొరలి యుండవచ్చును.

ఈ గ్రంథమునకు సంపాదకులు సంస్కృత

ములో సంక్షేపముగా కృతిపరిచయమును, ఆంగ్ల ములో 44 పేజీలలో విస్తృతమైన ఉపోద్ఘాతమును చేర్చినారు.

వీనిలో ఆంగ్లోపోద్ఘాతము సర్వవిధముల సంపన్నముగా ఉన్నది. అందులో ముందు ఆంధ్రదేశములో సంస్కృతములో పుట్టిన రమారమి 50 అలంకార శాస్త్ర గ్రంథముల స్వరూప మీయబడినది. ఆ భాగము ఉచితమైన ఆంధ్రాభిమానమును సూచించుటయే గాక, ప్రస్తుత గ్రంథము ఎట్టి సాహిత్య వాతావరణములో పుట్టినదియు ప్రదర్శించుచున్నది. సాహిత్య శాస్త్రమునకు దక్షిణ భారతములో ఆంధ్రభూమి అపర కాశ్మీర మనదగి యున్నదనుటకు నిదర్శనముగా ఆంధ్రదేశములో నేటివరకు పరంపరగా ఎంత సాహిత్య విచారణ జరిగినదో సగర్వముగా నిందు నిరూపితమైనది.

ఆ పిమ్మట ఈ గ్రంథములో నున్న 8 విలాసములలోను ఉన్న విషయములను సంక్షేపముగానే ఐనను స్పష్టముగా నుల్లేఖించినారు. అంతేకాక ఆయా సందర్భములలో పూర్వలాక్షణికులను ఎంతవరకు అనుసరించినదియు ఎక్కడ భేదించినదియు, క్రొత్త విషయముల నెక్కడెక్కడ ప్రతిపాదించినదియు సూక్ష్మముగా ప్రదర్శించినారు.

కావ్యములలో విద్వాంసులకు ఆనంద మావహింప జేయునది చమత్కారమే! గుణము, రీతి, రసము, వృత్తి, పాకము, శయ్య, అలంకృతి— ఈ ఏడును చమత్కారకారణములుగానే బుధులు వచింతురని విశ్వేశ్వరుని మతము. ఈ విషయము తెల్పిన సందర్భములో ఈ చమత్కారశబ్దము మొదట అభినవగుప్తుని అభినవభారతిలో వాడబడినదనియు, అది రసమునకు పర్యాయపదముగా నున్నదనియు, ఆ తర్వాత క్షేమేంద్రుని ఔచిత్యవిచారచర్చలోను కవికంఠాభరణమునందును అది వివరింపబడినదనియు, విశ్వనాథుడు తన సాహిత్య దర్పణములోను, ఆయన ప్రమాణీకరించిన నారాయణధర్మదత్తులును దాని నంగీకరించినట్లును ఉదాహరించినారు. ఈ సందర్భములో విశ్వేశ్వరుని చమత్కారలక్షణమును కొంత వివరించిరి.

"చమత్కారస్తు విదుషా మానందపరివాహకృత్"

"శబ్దార్థౌ సచమత్కారౌ కావ్యమ్"

వీనిని చక్కగా నిట్లనువదించిరి. "Camatkara is what produces a continual experience of extraordinary pleasure in the mind of the learned. He defines poetry as a linguistic expression possessing such a quality.'

ఇక్కడ విశ్వేశ్వరుని చమత్కారలక్షణమునకు జగన్నాథపండితరాయల కావ్యలక్షణము ఒకవిధముగా వివరణము వంటిదని సూచించిరి. జగన్నాథుడు కావ్యస్వరూపమును వర్ణించి వర్ణించి తుదకు

"స్వవిశిష్ట జనకావచ్ఛేదక ప్రతిపాదకతా సంసర్గేణ చమత్కారవత్త్వమ్ కావ్యత్వమ్" అని కావ్యత్వ లక్షణము చెప్పెను.

ఆ తర్వాత విశ్వేశ్వరు డిచ్చిన కావ్య లక్షణము సమస్త కావ్యములకు— ధ్వనినుండి శబ్దచిత్రము వరకు— అవ్యాప్తిలేకుండ నన్వయించు ననియు, జగన్నాథుని లక్షణము కేవల శబ్దచిత్రమును కావ్యకోటిలో గణింప దనియు నిరూపితమైనది.

గ్రంథస్థ విషయములను ప్రదర్శించుచు ఈ క్రింది విషయములలో విశ్వేశ్వరుడు ప్రథముడును స్వతంత్రుడును అని తెలిపిరి.

1. ఆలంకారికులలో 'రసోవై సః' అను శ్రుతిని ఉదాహరించిన వారిలో విశ్వేశ్వరకవి ప్రథముడు.

2. గ్రంథాది యందు నిలుపదగినట్టియు నిషిద్ధము లైనట్టియు వర్ణములును గణములును నిర్దేశించుట ఈయన ప్రత్యేకత.

3. రీతులను నిర్వచించుటలో విశ్వేశ్వరకవి పూర్తిగా నూతన పంథా త్రొక్కినాడు.

4. కావ్యములను (1) చమత్కారి (2) చమత్కారితర (3) చమత్కారితమ అని మూడు రకములుగా విభజించినాడు.

పూర్వ లాక్షణికులలో ముఖ్యముగా ఎక్కువగా 'భోజమతమును అనుసరించినట్లు తెలుపుచు

పూర్వ లాక్షణికులను ఎక్కడను గ్రుడ్డిగా అనుసరింపక ఎన్నియో సందర్భములలో విశ్వేశ్వరకవి స్వతంత్రభావములు ప్రకటించెనని సంపాదకులు చక్కగా విశదీకరించిరి.

ఆ పిమ్మట కవి యొక్కయు గ్రంథము యొక్కయు కాల నిర్ణయము చేసిరి. ఈ గ్రంథము రసార్ణవసుధాకరమును ఉదాహరించుటచే దానికంటె తర్వాతిది. ఈ రెండు గ్రంథములును విద్యాధరుని ఏకావళి మతమును ఖండించుటచే దానికి తర్వాతివి. సాయనుని అలంకార సుధానిధియందు చమత్కార చంద్రిక ఉదాహరింపబడుటచే దానికంటే ప్రాచీనము. అలంకార సుధానిధి రచనా కాలము క్రీ. శ. 1358–1378మధ్య జరిగియుండునని మల్లంపల్లివారి నిర్ణయమును ప్రమాణీకరించిరి. ఈ యాధారముల మీద చమత్కార చన్ద్రిక 1370 A. D. ప్రాంతమునను, రసార్ణవసుధాకరము 1368 ప్రాంతమునను రచింపబడెనని నిర్ధారించిరి. (P. LIV.)

సంపాదకులు సంస్కృతములో వ్రాసిన కృతి పరిచయములో "ఏవం చ చమత్కారచన్ద్రికాయా రచనాకాలః ప్రాయేణ క్రీ. 1360 A. D. భవితుమర్హతి' (P. XV) అని దీనికి ; విరుద్ధముగా వ్రాయుట ఇట్టి ప్రామాణిక గ్రంథములలో నెంతమాత్రము సమర్థనీయము కాదు.

ఈ రెండిటిలో నేదియు గూడ సమర్థనీయముగా తోపదు. సింగభూపాలుని రాజ్యకాలము 1386–1412 A. D అని (P. XXVI) సంపాదకులు స్పష్టపరచినారు. చమత్కారచన్ద్రికయు, రసార్ణవ సుధాకరమును, అంతకు పూర్వపు రచనయైన కువలయావళి నాటికయు స్పష్టముగా సందేహమున కవకాశము లేకుండ రాజ్యము చేయుచున్న రాజునుగానే సింగభూపాలుని వర్ణించు చున్నవి. కాని రాజకుమారునిగాని యువరాజుగాగాని వర్ణించుట లేదు. తాతగారు జీవించి యుండగానే సింగభూపాలుడు కవిగా ఐనవోలుశాసనములో కుమారసింగడుగా వర్ణింపబడి యుండుట సంపాదకుల కాల నిర్ణయమునకు మరింత బాధకము. కాబట్టి కువలయావళి, రసార్ణవ సుధాకరము, చమత్కారచన్ద్రికల రచనాకాలము 1386 తర్వాతకు పోవలెను. సింగభూపాలుని రాజ్యారంభకాలము 1386 కంటే పూర్వమనుటకు అవకాశము కనబడదు. ఇక అలంకారసుధానిధి కాలమును గూర్చి శ్రీ మల్లంపల్లివారు చేసిన నిర్ణయమును పునర్విచారణ చేయవలసి యుండును.

సంపాదకు లాపిమ్మట రసార్ణవ సుధాకర కర్త విశ్వేశ్వరకవి యగునా యను చిక్కు ప్రశ్నను ప్రస్తావించి విచారణ చేసిరి. ఆ విచారణ అవును కాదను రెండు వాదములకు గల ఉపపత్తులను కొంతవరకు నిష్పక్షపాతముగానే పేర్కొనిరి.

విశ్వేశ్వరకవియే రసార్ణవసుధాకరమును గూడ రచించి యుండు ననుటకు చూపిన ఉపపత్తులు.

(1) రసార్ణవ సుధాకరము ప్రధానముగా నాటక లక్షణములను ప్రపంచించుచుండగా చమత్కార చన్ద్రిక నాటకలక్షణములను రసార్ణవసుధాకరములో చూడదగునని చెప్పి తక్కిన కావ్య లక్షణాదికములను మాత్రమే వివరించెను. ఈ విధముగా నీ రెండును పరస్పరపూరకములు. 'The two works are complementary in nature'.

(2) రసార్ణవసుధాకరములో మొదట నున్న వంశావళిలోను ఉదాహరణములలోను సింగభూపాలుని అతిశయమును స్తుతించుటయేగాక అందున్న మూడు విలాసముల అంత్య భాగమున గ్రంథముతో సంబంధము లేకుండ సింగభూపాలుని మహిమను స్తుతించు శ్లోకములు రెండు రెండు కలవు. సింగభూపాలుడే రచించినచో స్వాతిశయము నట్లు ఉద్ఘాటించు ననౌచిత్యమునకు పాల్పడునా?.

(3) 'కందర్ప సంభవము' అను గ్రంథమును రెండును ఉదాహరించుచు అది నాదే— 'మమైవ'— అని చెప్పియుండుట.

(4) రెండు గ్రంథములును విలాసములుగా విభజింపబడి యుండుట.

(5) రెండును విషయ వివరణములో సులభశైలిలో నుండుట.

(6) రెండును లక్షణ పరిష్కారములో పూర్తిగా స్వతంత్రమార్గ మవలంబింపక పూర్వలాక్షణికులను,

అందును ముఖ్యముగా భరతుని భోజుని ననుసరించుట.

(7) రెండును కళింగాస్థానకవి యగు విద్యాధరుడు రచించిన ఏకావలిని తీవ్రముగా ఖండించుట

పై కారణములు ఏకకర్తృకత్వమును విరూపించుటకు చాలవనుచు భిన్న కర్తృకము లనుటకు ఈ క్రింది హేతువులు చూపిరి.

1. పరస్పరపూరకత్వము ఏకకర్తృకత్వమును నిరూపింప జాలదు.

2. రసార్ణవసుధాకరములో వలెనే కొండవీటి రెడ్డిరాజు పెదకోమటి వేమన రచించిన సాహిత్య చింతామణిలో గూడ స్వాతిశయ వర్ణనచేయు శ్లోకము లున్నవి.

3. కందర్పసంభవము ఉపలభ్యము కాలేదు కనుక దానిని రచించిన కవి ఎవరో నిర్ధారణ చేయలేము.

4. పైవానిలో 4—7 కారణములు గణింపదగినవి కావు.

5. రీతులను చెప్పిన తీరులో రెండు గ్రంథములును భిన్నమార్గము లవలంబించినవి. రసార్ణవ సుధాకరములో పదవిన్యాస భంగినిబట్టి కోమలా, కఠినా, మిశ్రా అని రీతులను మూడుగా విభజించి వానికే వైదర్భి, గౌడీ, పాంచాలీ అని నామాంతరము లిచ్చినాడు. చమత్కార చన్ద్రికలో పదఘటనను ఆధారము చేసికొని రీతి (1) అసమాసా (2) మధ్యమ సమాసా (3) అతి దీర్ఘ సమాసా (4) మిశ్రా— అని నాలుగుగా విభజింపబడినది. ఈ రీతి భేదము రెండు గ్రంథములకు కర్తలు వేరనుటకు బలవత్తరమైనది.

6. రసార్ణవసుధాకరము భోజమతమును పలుతావుల ఖండింపగా చమత్కారచంద్రిక తరచుగా భోజుని ననుసరించినది.

7. చమత్కారచంద్రికలో విశ్వేశ్వరకవియే రసార్ణవసుధాకరకర్త సింగభూపాలుడే యని పేర్కొనినాడు.

8. మల్లినాథసూరి మొదలగు ప్రసిద్ధ వ్యాఖ్యాతలు సింగభూపాల విరచితముగానే రసార్ణవ సుధాకరమును ఉదాహరించినారు.

9 సింగభూపాలుడు రత్నపాంచాలికానాటికనే కాక సంగీతసుధాకరమనుపేర శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరమునకు వ్యాఖ్య రచించిన విద్వాంసుడు.

10 సింగభూపాలుడు సర్వజ్ఞ బిరుదముతో విశ్వేశ్వరకవిచేతనేకాక శ్రీ నాథాదికవులచేతను స్తుతింప బడిన విద్వదగ్రేసరుడు.

పై కారణములను తెలిపి సంపాదకులు చివరకు ఈ విధముగా సిద్ధాంకరించిరి.

"Such being the attainments and talents of Singabhupala borne out by great authorities, the baseless doubt of his authorship of Rasarnava Sudhakara is to be deplored. Probably it is founded on the popular misconception that an active ruler cannot be a thorough scholar and an author."

స్థూలదృష్టికి సంపాదకుల నిర్ణయము యుక్తిసహముగానే కన్పించును గాని లోతుగా తరచి చూచినచో నది నిలువజాలదు. స్వాతిశయమును వర్ణించుట పెదకోమటి వేమన రచించిన సాహిత్య చింతామణిలో గూడ గలదని సమర్థించుట యుక్తముకాదు: సాహిత్య చింతామణి రచయితకూడ పెదకోమటి వేమన కాక ఆయన యాస్థానకవియే యనుటకు ఆధారము లున్నవి. సింగభూపాలుని పాండిత్యమునకు ఆధారముగా సంగీతసుధాకరము కూడ రచించెనని సంపాదకులు తెలిపినది పూర్ణసత్యము కాదు. ఆ గ్రంథము వ్రాతప్రతులు కొన్నిటిలో దానిని నర్మదాతీరవాసి యగు గోపనాథుడు వ్రాసినట్లు కలదని శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు భరత కోశములో వ్రాసినట్లు సంపాదకులే (పే. XXVIII) లో తెలిపినారు. ఆ విషయము సింగభూపాలుని పేర నున్న అన్ని రచనలకును కర్తృత్వ సందేహమును బలపరచునది గదా! ఈ సింగభూపాలునికి సర్వజ్ఞ బిరుదమున్నట్లు విశ్వేశ్వరకవి గాని ఇతరులుగాని చెప్పిరనుటకు ఆధారము కనపడ లేదు. సాహిత్యచింతామణిలోగాని రసార్ణవసుధాకర

ములోగాని కువలయావళిలోగాని ఆ బిరుద మెక్క డను మాకు కనపడలేదు. ఎంతసేపటికిని శ్రీ సింగ ధరణిపాల ఇత్యాది రాజ పర్యాయపదములే కలవు. కువలయావళి ప్రస్తావనలో సింగభూపాలునికి 'లలిత కవితా విలాస చతురాననేన..... విద్వజ్జనసభాజనపరాయ నేన ఖడ్గనారాయనేన' అను బిరుదములు కలవు కాని సర్వజ్ఞ బిరుదమున్నట్లు చెప్పబడలేదు. ఈ సింగ భూపుడు పండితుడు గనుక సర్వజ్ఞబిరుదము ఈయనకే అన్వయించునని భ్రాంతి కల్గినట్లున్నది. భోగినీ దండకములో స్పష్టముగా 'రావు సింగక్ష్మానాథు పౌత్రున్..... సర్వజ్ఞ సింగోర్వరాధ్యక్షు నీక్షించి.....'' అని సర్వజ్ఞ బిరుద మీయన మనుమనికి ఉన్నట్లు కలదు. ఆ సర్వజ్ఞుడు భోగినీదండక రచన నాటికి యువకుడు కనుక 1412 లో చనిపోయిన ఈ సింగ భూపునికి అన్వయించదు. శ్రీనాథుని చాటువు 'సర్వజ్ఞ నామధేయము.....' సందేహాస్పదమైనది. ఒకవేళ నది గ్రాహ్యమైనను శ్రీనాథుడు రాజుకొండకు 1420 ప్రాంతములోగాని వెళ్లియుండుట కవకాశము లేదు. సర్వజ్ఞ బిరుదమునుబట్టి కర్తృత్వమును నిర్ణ యించుట కిందుచే నవకాశము లేదు.

విశ్వేశ్వరుడే రసార్ణవసుధాకరమును సింగ భూపుడు రచించినట్లు చెప్పినమాట వాస్తవమే కాని తాను ఆయన పేరు పెట్టినప్పుడు మరి యెట్లు చెప్పును. కందర్ప సంభవ కర్తృత్వము వచ్చినప్పుడు మాత్రము పరాకుపడియో ఉద్దేశపూర్వకముగనో 'మమైవ' అని చెప్పుకొనెను. ఇంతేకాక ఇతర గ్రంథ ములను పేర్కొనుటలో తథా మహిమ్నస్తవే, ధ్వని లోచనాదిషు, యథా భావప్రకాశికాయామ్' అని ఉదాహరించెను గాని రసార్ణవసుధాకరమును ఉదాహ రించిన స్థలము లన్నింటి యందును 'సింగభూపాల రచితే రసార్ణవ సుధాకరే–నాయక స్యైవ వంశావల్యాం– ఇతి సింగభూపాలీయే—సిఙ్గభూపాలీయే నిదర్శితంహి' — ఈ విధముగా సిఙ్గభూపాల విరచితమని ప్రత్యే కముగా ఒత్తి చెప్పుటలోననే కర్తృత్వము సందే హాస్పద మవుచున్నది.

భోజుని మతమును చమత్కార చన్ద్రిక తరు చుగా అనుసరించుటయు, రసార్ణవసుధాకరము తరు చుగా భేదించుటయు పెద్ద కారణముకాదు. ఒకటి కావ్య లక్షణాదికమును చెప్పు గ్రంథము, రెండవది నాటక లక్షణములను చెప్పునది. అందుచే కొన్ని విష యములలో అనుసరించుటయు కొన్ని విషయము లలో భేదించుటయు ఒకే గ్రంథ కర్తకును సాధ్యమే.

ఇక మిగిలినది రీతులలో రెండు గ్రంథము లును అవలంబించిన భిన్న విధానము. సంపాదకులు దీనినే తమ సిద్ధాంతమునకు బలవత్కారణముగా ప్రతి పాదించినారు. స్థూలముగాచూచువారి కట్లే కని పించును. కాని లోతుగా పరిశీలించినచో దానిలోగూడ బలమేమియు లేదని తెలగలదు. సమాస పదములు లేకుండుట, కొంచె ముండుట, ఎక్కువ యుండుట, మిశ్రముగా నుండుట ఆధారముగా చేసికొని చమత్కారచన్ద్రిక రీతులను విభజింపగా, రసార్ణవ సుధాకరము కోమల, కఠిన, మిశ్ర అని విభజించి నది నిజమే కాని వానిని వివరించుపట్టున రసార్ణవ సుధాకరములోని ఈ క్రింది శ్లోక భాగములు గమ నింప దగినవి.

''తత్ర కోమలా..... సమాసరహితా స్వల్పై స్సమాసైర్వా విభూషితా.... సా వైదర్భీతి కథ్యతే

''అథ కఠినా: అతి దీర్ఘసమాసయుతా...... కఠినా సా గౌడీయేత్యుక్తా.

''అథ మిశ్రా: యత్రోభయగుణగ్రామ సన్ని వేశస్తులాధృతః సా మిశ్రా సైవ పాంచాలీ''.

ఆ పిమ్మట మిశ్రకు ఉదాహరణ మిచ్చి ''అత్రాల్పసమాస, దీర్ఘసమాసత్వరూపయోః...ఉభయ రీతి ధర్మయోః తులాధృతవత్ సన్నివేశా న్మిశ్రేయం రీతిః'' అని సమన్వయము చేసెను.

పై నుదాహరించిన దానినిబట్టి చమత్కార చన్ద్రికలోని మొదటి రెండు రీతులు నిందులో మొదటిదిగాను, మూడు నాలుగులో నిందులో రెండు మూడుగాను చెప్పబడినవని తెలుచున్నది. రీతుల విష యములో చమత్కారచన్ద్రిక సంక్షేపముగా చెప్పి నదే రసార్ణవసుధాకరములో విస్తరింపబడినది. రెండిటిలోను మూల సూత్రము ఒక్కటియే.

ఆంధ్రదేశములో కొంతకాలమునుండి ప్రభువులు రచించినట్లున్నను వారి యాస్థానకవులో పండితులో రచించిరను ప్రథ యున్న గ్రంథముల కర్తృత్వమును నిర్ణయించుటలో విమర్శకులు కొంత దురభిమానముతో ప్రభు కర్తృత్వ పక్షమును బల పరచు చుండుట సర్వ సామాన్యముగా ప్రబలుచున్నది. ప్రభువులు పండితులు కాగూడదనికాని వారు గ్రంథ రచన చేయలేరనిగాని కాదు. ప్రభువులకంటె వారి యాస్థాన విద్వాంసులు ఎక్కువ విద్వత్తుకలవారును ఎక్కువగా మననము చేసి గ్రంథరచన చేయుటకు ఓపిక, తీరుబాటు కలవారును అనుటకు సందేహము లేదు గదా! మహా శిల్పులయు చిత్రకారులయు పేరులు మన కెన్ని తెలియ వచ్చుచున్నవి? వ్యాస రచితములుగా చలామణి యగుచున్న గ్రంథజాతములో నెన్ని వందల మంది రచన లున్నవి? శంకరుల రచన లని ఎందరు గ్రంథకర్తలు తమ రచనలకు శంకరుల పేరు తగిలించినారు? మన గ్రంథకర్తలకు తమ పేరుకై ప్రాకులాడుట పూర్వము లేదు. ఆస్థాన విద్వాంసులు కవులు తమ ప్రభువులయెడ నున్న భక్తివలననో, కృతజ్ఞతవలననో, వాత్సల్యమువలననో తమ రచనలకు ప్రభువుల పేర్లు పెట్టి తృప్తి పొందినారు. మనస్ఫూర్తిగా తమ సొత్తును ఇతరుల కిచ్చుట దోషము కానేరదని వారి విశ్వాసము.

రాజుకొండ ప్రభువులకును కొండవీటి ప్రభువులకును రాజకీయముగానే కాక విద్యాత్రుపీతిలో గూడ స్పర్థ స్పష్టముగా కలదు. సింగభూపాలుని పేర రసార్ణవసుధాకరము పుట్టగా పెదకోమటి వేమారెడ్డి పేర సాహిత్యచింతామణి పుట్టినది.

కాబట్టి సంపాదకులు ఎంత గట్టిగా కాదనినను రసార్ణవసుధాకరము గూడ విశ్వేశ్వర కవిచంద్రుడే రచించెనేమోయను సందేహము తీరునది కాదు. కాబట్టి సంపాదకులు చేసిన సిద్ధాంతము కంటె ఉపక్రమములో చెప్పిన వాక్యములే యుక్తి సహముగను నిష్పక్షపాతముగను ఉన్నట్లు సూక్ష్మబుద్ధులకు తోపక మానదు. ఆ వాక్యము లివి:

"Moreovor, there is a work called Kandarpasambhava Which is referred to in both the works with the remarks మయైవ కన్దర్ప సమ్భవే, the authorship being claimed by both of them. All this goes to prove that the authorship of the Rasarnava Sudhakara is doubtful and that probably Visv.swara himself wrote the work and gave his patron's name to it." (P. LVI.)

సంపాదకులు ఉపోద్ఘాతాంతమున సాహిత్యశాస్త్రములో చమత్కారచంద్రికకు గల స్థానమును యథోచితముగా నిర్ణయించినారు.

గ్రంథ రచనా కాల విషయముననను కర్తృత్వ విషయముననను మా కభిప్రాయ భేద మున్నను సంపాదకుల ఆంగ్లోపోద్ఘాతము సర్వవిధముల శ్లాఘ్యముగను సంపన్నముగను ఉన్నది.

అపూర్వమైన విలువగల చమత్కారచంద్రిక నేటికి మనము పఠించి ఆనందించు భాగ్యము కలిగినది. కాని యిది మన యాంధ్ర లాక్షణికులకు తెలియనిది కాదు. కస్తూరి రంగయకవికృతమైన ఆనంద రంగరాట్ఛందము ద్వితీయాశ్వాసములో తొమ్మిది సందర్భములలో చమత్కారచంద్రిక ప్రథమ విలాసము నుండి ప్రమాణముగా శ్లోక భాగము తీయబడినవి. అవి గ్రంథాదియందు మగణము, యగణము, రగణము తగణము, జగణము, నగణము, కావ్యముఖమందుంచు వర్ణములు శుభాశుభములను కలిగించునని, రేఫము నుంచుటకు సంబంధించినవి. ఉదాహృత భాగములు చాల భాగము మన చమత్కారచంద్రికలోని పాఠములే. వీనిలో జగణమును గూర్చి యిచ్చిన రెండు భాగములలో మొదటిది మన చ. చ, పాఠములో నున్నది. కాని 'వర్ణోపి జగణశ్చైవ బ్రహ్మనామాక్షరేశివః' అను రెండవదిలేదు. నగణమును గూర్చి పాఠమించుక భేదించుచున్నది. "లక్ష్మీం ప్రదోహుతాశనః" అని రేఫమును గూర్చి చెప్పిన భాగము మన చ. చం.లో లేదు.

కుంఫిణి ప్రభుత్వ కాలములో ఆ. రం. ఛందము పుట్టినది. అప్పటికి లక్షణవేత్తలకు చమత్కార చంద్రిక ప్రతులు లభించుచుండెడివన్నమాట!

ఆ ఛందోగ్రంథములోనే తరుచుగా 'విశ్వేశ్వర చ్ఛందమునుండి' యని యాంధ్రపద్యములు ఉదాహరింపబడినవి. ఆ విశ్వేశ్వరుడు మన విశ్వేశ్వరు డైనచో నతడు ఆంధ్రములో గూడ లక్షణ గ్రంథము వ్రాసినా డనవలసి వచ్చును. కాక నామసామ్య మాత్రమే యేమో! శ్రీ కా. నా. పంతులుగారు ప్రచురించిన ఆంధ్రవాఙ్మయ సూచికలో విశ్వేశ్వర చ్ఛందము కనపడలేదు.

ముద్రణములో కొలది సౌలిత్యము లున్నను మొత్తముమీద గ్రన్థము నిర్దుష్టముగను అందముగను ముద్రితమై గ్రథితమైనది. ఇట్టి ఉత్తమ గ్రంథమును ప్రామాణికముగా సంపాదించి ప్రచురించినందులకు సంపాదకులకును ఆంధ్రవిశ్వకలాపరిషత్తు వారికిని సాహిత్యాభిమాను లందరు ధన్యవాదము లర్పింప దగియున్నది.

---

[గ్రంథకర్త: విశ్వేశ్వరకవిచన్ద్రః; సంపాదకులు— డా. పి. శ్రీరామమూర్తి M. A, Ph. D. ప్రకాశకులు: ఆంధ్రాయూనివర్సిటీ, వాల్తేరు. డెమీ 1/8 పేజీలు 200 + 60 హాఫ్‌కాలికోబైండు. వెల. రు. 15/-లు.]



# గ్రంథ విమర్శలు

## జీవిత దృశ్యాలు

(కథల సంపుటి. రచయిత: శ్రీ మంజుశ్రీ. ఎమెస్కో; ప్రతులకు: ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రి. బ్యూటర్స్, రాష్ట్రపతిరోడ్డు సికిందరాబాద్, కథలు 14. పేజీలు 159. వెల: రూ 2—00)

శ్రీ మంజుశ్రీ కథారచయితగా, నవలా రచయితగా, సాహితీ జీవిత పరిశోధనలలో డాక్టరేట్ పట్టం పుచ్చుకొన్న వ్యక్తిగా తెలుగు వారికి పరిచయం వుంది.

సాహిత్యంలో లోతుపాతులు తెలుసుకొని, ఆంధ్రాంగ్ల సంస్కృతాలు సవిమర్శకంగా గ్రహించి, సృజన సాహిత్యంలో కృషిచేసే అత్యల్పసంఖ్య రచయితలలో శ్రీ మంజుశ్రీ స్థానం సముచితమయినది.

ఈ రచయిత చిత్రించిన అన్ని కథలలో ప్రధాన పాత్రలకు దాదాపు ఒకేరకం మనస్తత్త్వం ఉన్నట్టుగా పాఠకులు గుర్తిస్తారు. రచయిత హార్దిక కోణం అభివ్యక్తమయ్యే రచనలలో పాత్రల వెనుక రచయిత వ్యక్తిత్వం ఉందని పాఠకులు తలపోసే అవకాశం ఉంది.

ప్రతి కథలోనూ కంటికి కనిపించే పాత్ర ముఖ్యంగా పురుషుడు సుకుమార హృదయం కల వాడుగా ఉంటాడు. శారీరకమయిన బలహీనత గల వ్యక్తిగా గోచరిస్తాడు. సున్నితమయిన హృదయం, ఏ మాత్రం కష్టం సహించలేక పోవటం, ప్రేమించిన లేదా పెళ్లాడిన స్త్రీపై అన్ని విషయాలకు ఆధార పడటం, వర్షం అంటే భయం, జంతువు అంటే ప్రేమ. సమాజంలో పీడితులూ తాడితులూ అయినవారి పట్ల ఆదరం, గలదిగా ప్రధాన పురుష పాత్ర గోచరిస్తుంది.

ఒకనాటి పల్లె జీవితం పట్టణ వాతావరణం లోకి చొచ్చుకు పోయి, దానిలో కలసిపోయి, విడదీయ రానిదిగా కనిపించటం, ఈ రెండు విధాల వాతావరణం చిత్రించటంలో రచయిత నేర్పు అభినివేశం స్పష్టంగా కనిపిస్తాయి.

ఆధునిక నాగరికత మనిషికి ప్రసాదించిన వేగం, ఈ రచయిత కథలలో చోటు చేసుకొంది. ఒక పదంతో, ఒక వాక్యంతో, ఒక వాక్య సముదాయంతో అనంతమయిన సంఘటనల సన్నివేశాల స్ఫూర్తి సాధించగల పదప్రయోగనైపుణ్యం రచయితకు వుంది. శైలిలో వేగం ఎక్కువ!

ఈ శైలి దృష్టితో, ఈ కథా నాయకుని ఏకీకృత రూపదర్శన దృష్టితో, శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి 'అల్పజీవి'లో ప్రధాన పాత్ర,కీ.శే. త్రిపురనేని గోపీచంద్ 'అసమర్థుని జీవయాత్ర'లో ప్రధాన పాత్ర శ్రీ మంజుశ్రీ కథల ప్రధానపాత్రలో కనిపిస్తారు.

'Unheroic hero' చిత్రణలో తదితర రచయితల కథానాయకుల కోవకు ఈ రచయిత కథానాయకుడుచేరే అవకాశం వుంది. Jean Paul Satre కథలలో అంతర్భూతంగా కనిపించే Existentialism ఈ రచయిత కథలలో రేఖామాత్రంగా గోచరిస్తుంది. శైలిలో stream of Consciousness ధోరణి వుంది. కథలలో చాలా తక్కువ మంది రచయితలు శ్లోకాలు ఉదాహరిస్తారు. అది వారి సంస్కృత సాహచర్య ఫలితం! ఈ రచయిత అడపాతడపా— శ్లోకోదాహరణాలు పాఠకులు గమనిస్తారు.

'వానలో తడుస్తున్న మనిషి' కొంచెంగా వానలో తడిసినా నిజంగా ఆలోచనలలో తడుస్తున్న మనిషి! బొమ్మలు గీసే రచయితలో పిరికితనం కథలో ప్రధానం! కోరింది పొందలేకపోవటం ముఖ్యంగా ప్రస్తుతం! ఆశాగత బలహీనతవల్ల ఆశోపహతుడవుతాడు ముకుందరావు.

'జీవితదృశ్యాలు' జీవితంలోని విచిత్రమైన వైరుధ్యం చూపేకథ. శివరావు చనిపోయే స్థితిలో

బ్రతికించుకోవాలనుకొన్నవాళ్ళు బ్రతికితే చనిపోయే దాకా వూరకవుండే తత్త్వం దర్శింపబడింది.

'రామదర్శన లాలసా'లో విచిత్రప్రేమ పాఠకుల్ని బాధిస్తుంది. రామారావు పిచ్చిగా ప్రేమిస్తున్నంతకాలం మూర్ఖంగా ప్రవర్తించిన జానకి గత జల సేతుబంధనం చేయ ప్రయత్నిస్తుంది.

'మేష్టారు'లో ఎంతో ఇష్టమయిన 'మేష్టారు' ఇంటికి వస్తే ఆదరించుకోలేని అవస్థ కనిపిస్తోంది.

'కుక్క'లో దేవుడు— చెప్పులు— కుక్క విచిత్రమయిన అనుభూతిని కలిగిస్తాయి.

ఏ రచయిత కథలలోనయినా అత్యుత్తమకథలు పాఠకుల హృదయంలో కలకాలంగా శాశ్వతంగా నిలిచిపోయే కథలు. ఆ కథలవలన రచయిత గౌరవం సాహితీస్థానం పెంచే కథలు కొన్నే ఉంటాయి. 'క్రాస్ వర్డ్ పజిల్' 'సాధుపాఠం' ఆ కోవలో ఉత్తమ కథలు.

రఘురామ్ భార్య శ్యామసుందరి. ఒకనాటి ప్రేయసి వేంకటలక్ష్మి! ఆమె అధునాతన జీవితపు అలరింపుల జోలలలో లీలగా తూగుతున్న స్త్రీ! ఈమె పండిత సామ్రాజ్యంలో రాజ్ఞి. జీవితంలో అతి దీనంగావున్నస్త్రీ! చెప్పినట్లు వినని భార్యతో, అనుకొన్నట్లు జరగని విధితో తలవంచలేక తలఎత్తలేక సతమతమయ్యే పాత్ర రఘురామ్. జీవితం నిజాయితీతో పరిశీలించిన కథ 'క్రాస్‌వర్డ్ పజిల్'

రమణ అమాయకుడు. వల్లి ప్రేమించిందో లేదో తెలుసుకోలేని వ్యక్తి! రైల్లో కలసిన వేంకటరావుకూ తనకూ మధ్య వల్లి జీవితం చిత్రించుకోలేక పలాయనం చిత్తగించిన ఈ అమాయక ప్రబుద్ధుణ్ణి వల్లి ఆపకపోతే జీవితం తల్లడిల్లిపోదూ! మరపురాని కథ 'సాధు పాఠం'

హృదయానికి హత్తుకుపోయే ఇతివృత్తం స్వీకరించటంలో, శిల్పంలో, శైలిలో రచయిత ప్రతిభ గోచరమవుతుంది.

ఇతివృత్త రచనా నిర్వహణలో రచయిత తొందర ప్రదర్శించకుండా కాస్తంత ఓపికపట్టి, అన్ని కథావయవాలు స్పష్టంగా చిత్రించి ఉన్నట్లయితే ఈ సంపుటిలోని చాలా కథలు సాధుపాఠం, క్రాస్ వర్డ్ పజిల్ స్థాయికి చేరుకొని ఉండేవి. కలలూ, కలవరింతలూ నిర్వహణలో జాగ్రత్త ఉన్నట్లయితే చాలా ఉత్తమ కథ అయి హృదయానికి హత్తుకుపోయి ఉండేది.

'బయట చినుకులు పడుతున్నాయి' మామూలు కథ! కోతులు' లేకపోతే ఈ సంపుటికి విలువ తగ్గదు. 'శృంగార లహరి' యువతీ యువకులు మామూలు అనుమానం కథ. 'ద్విజట' కు ఉండవలసిన పేరు అదికాదు. 'అలుక్కుపోయిన వర్ణచిత్రం' దిగులు కలిగిస్తుంది. వెంకటరత్నం సిగరెట్టు తాగకపోతే బాగుండేది.

'నాతోబాటు నలుగురు' లో రామారావుమీద అభిమానం, తారమీద జాలి కలిగినంతగా సేట్‌మీద కలగదన్నమాట అటుంచి, ఈ కథలో Unity of Plot కలం మాత్రమే సాధించింది అనుకోవలసివచ్చినప్పుడు ఇతివృత్తంమీద సరయిన గౌరవం ఏర్పడదు. ఇతివృత్తంలోని ఉదాత్తత కథకు రక్తమాంసాలు ప్రసాదిస్తుంది. అల్పమయిన ఇతివృత్తం స్వీకరిస్తే ఎంత ఉదాత్తంగా రచన చేసినా ప్రయోజనం మృగ్యం అవుతుందన్నదానికి ఈ కథ నిదర్శనం. అయితే నగర జీవితం కనిపిస్తున్నదీ కథలో!

కథా రచయితగా సముచితస్థానం సంపాదించుకొన్న ఈ రచయిత మరొక మెట్టు పైకి వెళ్ళటానికి మరింత మంచి కథలు వ్రాయవలసిన అవసరం ఉందని పాఠకులు భావిస్తారు.

—రవి.

## కథామందారము

(కథల సంకలనం: ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ; ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమి; కథలు పన్నెండు, పేజీలు 265. వెల: రూ. 3.00)

ప్రసిద్ధులయిన పలువురు రచయిత్రులు కథలు ఈ సంకలనంలో చేరలేదు. శ్రీ బొడ్డు బాపిరాజు ఈ కథల గూర్చి వ్రాసిన మధు బిందువులు కథా రచనపై ఆధికారికమయిన అభిప్రాయంకాదు. సంకలనకర్త్రికి సమతామయ రచనా విధానంకానీ

గ్రాంథిక వ్యావహారిక భాషల తారతమ్యంగానీ తెలిసి నట్లు కనిపించదు.

ఈ సంపుటిలో కథా శిల్పం గుర్తించిన కథలు 2, 4, 5, 6, 8, 11, సంఖ్య గలవి మరపురాని కథలు 2, 4, 6, 7, 8, 11, 12 సంఖ్యగలవి.

ఊహ సుందరస్వప్నంగా, అందంగా, ఆనంద తుందిలంగా, ఆహ్లాద మందిరంగా పరమానంద ప్రద ర్శకంగా ఉంటుంది. వాస్తవిక జగత్తు తెలియక పోయినా, తెలుసుకోకపోయినా, తెలుసుకొనే అవకాశం లేకపోయినా రంగుటద్దాల హృదయ అంతఃపురాంత రాలతో నిద్రామత్తనేత్రాలు కనే అందమయిన కలలు, జీవిత సత్య ద్వంద్వాలకు ఆటుపోటులకు తట్టుకొని, నిలవలేని బలహీనులూ, అంతా సౌందర్య మయంగా భావించుకొని భావనా లోకంలో విహ రించే అపరిపక్వ మనస్కులయిన యువకులు, యువ తులూ ఊహమయమయిన రచనలు ఊపిరి బిగ బట్టి చదువుతారు ఆనందిస్తారు ఆనందనగాచర్చించు కొంటారు. జీవిత నగ్న సత్యాలు ఎదురయితే బిత్తరపోయి దిక్కు తెలియక చిందర వందరైన హృదయంతో, చీకాకుపడిపోతారు. పై పాఠకులకు చెక్కిలిగింతలు పెట్టే కథలు 'మెరుపు', 'సంస్కారి' 'రంగస్వామి' 'కోరల మధ్యన కోటి స్వర్గాలు'.

'మెరుపు'లో పల్లెకు వెళ్లిన డాక్టరుకు ఇటు వంటి సన్నివేశం ఎదురయితే ఎంత హాయిగా ఉం టుందీ అన్న ఊహపైన సాగిన రచన అంతా చెక్కిలి గింత పెట్టినంతగా హృదయంలోచేరుకోదుగానీ లీల జీవిత చరిత్ర పాఠకుల సానుభూతి చూర గొంటుంది.

'సంస్కారి'లో చంద్రశేఖరం లోకంలో సహ జంగా ఉండని పాత్ర. ఉన్నా అటువంటి పెళ్లి చేసుకొనేందుకు సిద్ధపడేవారు మరీ తక్కువ. చేసు కొన్నాక, అన్నీ తెలిసి తెలిసి, మళ్లీ బాధపడేవాళ్లు, ఒకవేళ బాధపడ్డా, జీవితం గతి తప్పేంతగా ప్రవ ర్తించేవాళ్లూ అరుదు. మణి ప్రవర్తన మరీ వింత! చావు దప్పి కన్ను లొట్టబోవటం గొప్ప ఊహ! కథ అంతా కమ్మని కల్పన.అత్యద్భుతమైన ఊహపైన అల్లుకుపోయిన ఈ కథ ఏం ప్రయోజనం సాధించ గలదో, పోనీ, ఏం చెప్పటానికి వ్రాయబడిందో ఏమీ అర్థంకాకపోవటం అనకూడదుగానీ అంతా పాఠకుల లోపం!

'రంగస్వామి' కథ లోకంలో జరగదు. జరుగు తుందేమోనని సమన్వయం చేసుకోబూనటం ఆత్మ వంచనాసదృశం. భార్యా భర్తల మధ్య అనురాగపు టవధులు ప్రదర్శించాలనే రచయిత్రి ప్రయత్నం బల హీనమయిన ఇతివృత్తంలో బాహువులు చాచింది.

'కోరలమధ్యన కోటి స్వర్గాలు' రచయిత్రి 'సుకాంచన' సాహిత్యంలో క్రొత్తపేరు. పాతరచ యిత్రి ఎవరో క్రొత్తపేరు పెట్టుకొన్నట్టు శైలి కారణంగా అనుమానం కల్గుతుంది. నీతులు చెప్పటం తేలిక ఆచరించటం కష్టం! డాక్టరు అయినవాడు ధర్మ వర్తనుడు కావాలి. అదే నీతి కనిపించేది ఈ కథ. అవినీతికి పాల్పడే డాక్టరు కొడుకునయినా హత్య చేసుకొంటాడనే ఘోషలో నిజాయితీ లేదు. ఈ కథ అన్ని విధాలా బాగుందనే చెప్పవచ్చుగానీ, ఆదర్శంలో అసంబద్ధత కథా ఔన్నత్యం కించ పరుస్తుంది.

ఈ సంకలనంలో యువతీయువకుల శృంగార రంగాలకు చోటు లేదు అనటం తేలికయినపనే గానీ, యువతీ యువకుల స్థాయి దాటిపోయిన కథలు ఎక్కువలేవు.

ఎర్రవి కళ్లున్న ఆడవాళ్లంటే మగ వాళ్లలో కొందరికి చాలా యిష్టం! కొందరికి కొంచెం భయం! ఈ రెంటికీ కారణం ఒక్కటే! అది చెప్పటం కాకపోతే వ్రాయటం సాహసంగా వుంటుంది. ఆ కారణం అశ్లీలంగా లేకుండా వ్రాసిన రచయిత్రి శ్రీమతి ఆచంటశారదాదేవి అభినంద నీయ. అంతేకాదు. రచనలో సంప్రదాయం ఉన్నా ఆలోచనలో నూతనత్వం వుంది. మయూరి జీవితం వింటే ఆమెకళ్లు ఎర్రగా ఎందుకున్నాయో తెలిసి, ఎంతోదుఃఖం కలుగుతుంది. సహజత సంపాదించుకొన్నకథ.

# గ్రంథ విమర్శలు

'ఆడది' స్త్రీహృదయార్తి ప్రతీక. కాంతమ్మ పుట్టిందగ్గర్నుంచి పిచ్చిదయిందాకా దురదృష్ట వంతురాలు! కష్టాలన్నీ ఆమెనే వరించాయి. లోకంలో స్త్రీలంతా ఇలాగే బాధపడుతున్నారా? లేదు. ఇటువంటి వారు కొందరున్నారు. ఆ కొందరు పర్టిక్యులర్. కొన్ని జనరలైజు చేయటం రచయిత్రి నేర్పు! ఒకవిధమయినవ్యథ! తిరుపతి వెళదామని భార్యతోచెప్పినకొడుకు తల్లినీ వెంట బెట్టుకు పోదాం అనుకొన్నవాడూ తీరా తల్లి బయలుదేరింతర్వాత రిక్షాఎక్కబోయిందాకా చెప్పకుండా నువ్విక్కడేవుండు మేం వెళ్లి వస్తామని ఒక్కగా నొక్క కొడుకు వెళ్లి పోతాడా? ఇష్టం లేకపోతే ముందుగానే చెప్పడా? ఎంతగా భార్యతో ఆనందంగా తిరుపతియాత్ర చేసివద్దామనుకొన్నా తల్లిని అంతగా బాధపెట్టే కొడుకులుంటారా? అసహజంగా కనిపించే అంశాలు కొన్ని ఎదురు కావచ్చు! అయినా ఒక సమ్యక్‌జీవిత చిత్రణలో అల్ప మాత్రమయిన అసహజతలు భాధింపకపోవచ్చు. కాంతమ్మకథ కాస్తంత సున్నిత హృదయుల కళ్ల నీళ్లతో ఆడుకొంటుంది! కథా రచయిత్రిగా శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మ రచనా విధానం చూపే కథ!

'జీవితంలోని అగాధాలు'. రచయిత్రి శ్రీమతి భానుమతీ రామకృష్ణ! ఈ రచయిత్రి మిగతా కథల స్థాయికంటే, ఈ కథ ఒక మెట్టు మెరుగు. 'రాంబాబు' జీవితం, దుఃఖంలో ఆనందం అన్వేషించే అతని స్వభావం బాగా గోచరమవుతాయి. విషాద భరిత మయిన ఈకథలో పాత్ర రాంబాబు విషాదంలో ఆనందం వెతుక్కొనే గుణం ఉన్నవాడు కావటం వల్ల ఎంత విషాదంలో అయినా రచయిత్రి హాస్యం ఎబ్బెట్టుగా లేకుండా ఉండే ధోరణి కనిపిస్తుంది! పాఠకు లీకథ మరచి పోలేరు.

శ్రీమతి తురగా జానకిరాణి, శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి తెలుగు పాఠకులకు గతించిన రెండు దశాబ్దాల నుంచి పరిచయం ఉన్నవాళ్లు. 'పరిష్కారం' మంచి రచన. సస్పెన్స్‌తో జీవిత యాథార్థ్యంచిత్రిస్తూ సహజత స్థాపించిన రచన. ప్రతి సన్నివేశం పాఠకుల హృదయంలో ప్రతిబింబిత మవుతుంది. శ్రీమతి తురగా జానకీరాణి అభినందనీయ. 'ముత్యాల మనస్సు' రచయిత్రి శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి. సహజత కలిగిన ఇతివృత్తం స్వీకరించినా వాస్తవికతను పొదివి దాచుకొన్న విషయమే గ్రహించినా నిర్వహించిన తీరు సంతృప్తికరంగా లేదు.

'క్రొత్త నాన్న' రచయిత్రి కుమారి వాసిరెడ్డి సీతాదేవి. క్రొత్తనాన్న పాతనాన్న పదాలమీద రచయిత్రి తీవ్రత బాహాటంగా కనిపించింది. తండ్రిలేని పిల్లవాడు, భర్త పరిత్యక్త అయిన స్త్రీ, భార్యఉండే రెండో భార్యకాని భార్యతో సంసారం చేసే పురుషుడు వీళ్ల మనస్తత్త్వాలు రచయిత్రి ఆలోచన బలంతో, సహజతతో చిత్రించిన తీరు పాఠకులు హర్షిస్తారు. సుహాసిని అలా ప్రవర్తించటం తప్పని పాఠకులు అనుకోలేరు. లక్ష్మీపతిమీద కోపంరాదు. రాముఅంటే విపరీతమయిన జాలి కలుగుతుంది. దానికితోడు కామేశ్వరరావు పిచ్చివాడు కావటం దుఃఖం కలిగిస్తుంది. ఐస్‌క్రీమ్ బండి నెట్టుకొంటూ పోయిన రాము అవస్థ, ఈ సమాజం మీద, ఈ వ్యవస్థమీద కోపం తెప్పిస్తుంది. ఈ కథ చక్కని రచన! రచయిత్రి ముగింపు మరోవిధంగా ఉంటే బాగుండేదని ఆసక్తిగల పాఠకులు భావించే అవకాశం వుంది.

ఎందుకు కొందరు పురుషులు భార్యావిధేయులౌతారు అంటే సమాధానాలు చాలా వినిపిస్తాయి! అందులో ఒక సమాధానం 'ప్రకాశరావు కథ'. రచయిత్రి వాయుని కృష్ణకుమారి. నిజాయితీతోకూడిన రచన.

శ్రీమతులు 'లత', కౌసల్యాదేవి, ద్వివేదుల విశాలాక్షి, ఆర్. యస్. వసుంధర, నిడదవోలు మాలతి, పి. రామలక్ష్మి, వేల్పూరి సుభద్రాదేవి, ఉన్నవ విజయలక్ష్మి, రేవనూరి శకుంతల, పవని నిర్మలప్రభావతి, తేజోవతి, పి. సరళాదేవి, మునిపల్లె సరోజినీదేవి, డి. ప్రమీల కుమారి, బి. ప్రేమలీల మొదలయిన పలువురి కథలు ఈ సంపుటిలో లేవు.

ఈ సంకలనంలో ఇతివృత్తాలు అన్నీ చాలావరకు ప్రత్యక్షంగానో పరోక్షంగానో స్త్రీకి సంబంధించినవి. స్త్రీ హృదయం వ్యక్తమయ్యే ఈ రచనలు వల్ల, తెలుగు సాహిత్యం పుష్టి పొందుతుంది. ఇటువంటి సంకలనాలు అనేకం ప్రచురితంకావాలని తెలుగు పాఠకులు కోరుకొంటారు. ఒకటి సమర్థులయిన వాళ్ళు సంకలనం చేయటం, రెండు వాస్తవిక దృక్పథం కల రచనలు ఎన్నిక చేయటం, మూడు అర్హతానర్హతలు గుర్తించి, ప్రాతినిధ్యం సరసంగా అందివ్వ గలగటం దృష్టిలో ఉంచుకొని ముందు ముందు అకాడమీ సంకలనాలు ప్రచురింప చేయ గలదని ఆశింపవచ్చు.

## దరిజేరిన ప్రాణులు

(నవల. రచయిత్రి: ఇల్లిందల సరస్వతీదేవి. ఎమెస్కో ప్రచురణ. ప్రతులకు: ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు. రాష్ట్రపతిరోడ్డు, సికిందరాబాద్. పేజీలు 184, వెల. రూ. 2—00.)

పెళ్లంటే నూరేళ్లపంట! కనుకనే పెళ్లినాడు జరిగిన అవకతవక వ్యవహారం నూరేళ్ల మంట!

నిర్మల విషయం తలచుకొంటే జాలివేస్తుంది. ఎందుకంటే, తప్పు ఒకరిది, శిక్ష మరొకరిది. అయితే భారంగా వుండదా ఆలోచించే గుండె! నవల చదువుతూ అందరూ నిర్మలపట్ల సానుభూతి, ఉ... వ్యక్తం చేస్తారు.

నిర్మల జీవితంలో అంత భాగం భర్త పరిత్యక్తగా ఉండటానికి కారణం తల్లి! తల్లి తప్పు ఉందా అంటే లేదు. మాతృహృదయం బిడ్డ జీవితం సుఖంగా ఉండాలంటే ఇలాకాదు అనుకోవటమూ న్యాయమే!

కూటికి పేదఅయినా ఆత్మాభిమానానికి, ఆత్మ గౌరవానికి రమణ పేదకాడు. అదీ మంచిదే! అయితే అంత ఆకస్మిక పరిణామానికి, ఇంటిల్లిపాదినీ, అగ్ని సాక్షిగా వివాహమాడిన భార్యను గురి చేయటం ఉచితమో, అనుచితమో, సున్నితమూ, కోమలమూ పిరికిదీ అయిన రమణ గుండె ఆలోచింపలేదు. పిరికిది అని ఎందుకు అనవలసి వచ్చిందంటే, కష్టాలను, అవమానతుల్యమయిన కష్టాలు అయినాసరే, నవ్వు ముఖంతో ధైర్యంగా ఎదుర్కొనే వ్యక్తిని ధైర్యవంతుడంటారు గానీ రమణ వంటి వ్యక్తిని గాదు. అందుకే రమణ పిరికివాడు. వాస్తవికత సహించలేడు. దాని ఎదుట నిలబడలేడు. ఊహాజగత్తు ఇచ్చినంత ఆనందం వాస్తవిక జగత్తు ఇవ్వలేకపోయింది. అందుకే పారిపోయాడు. ఎవరికీ తెలియని, ఎవరూ గుర్తించనంతదూరం పారిపోయాడు.

నిర్మల పాఠకుల సానుభూతి పూర్తిగా పొందుతుంది. నిర్మల అందమయింది. నిర్మల గుణ సంపద గలది. నిర్మలాంతరాత్మనిరీక్షణతోకూడినది. అటువంటి నిర్మలకు భర్తృవియోగం పాఠకులు సహింపలేరు. నిర్మల పెళ్లినాడే భర్తకు దూరమయింది. తన చిన్న కల్పితానందంలో అకలంక మహిళగా జీవిస్తుంటే చూచి పాఠకులు కంటనీరు పెట్టుకొంటారు.

ఇంత దుఃఖమూ హృదయంలో పైకి తేలనంత బరువుక్రింద బంధించి, జీవితంలో ఎవరూలేని నిర్మల సమాజసమున్నతికోసం పాటుబడుతుంటే, తన కన్నీరు తుడిచే దయాహస్తం కరువైన నిర్మల, దయాహస్తం చాచి ఇతరులఅశ్రువులు తుడుస్తుంటే చూచే పాఠకులు కన్నీరు పెట్టుకొంటారు.

ఈ నవలలో శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి వేదనతో చూపిన సమస్యకు పరిష్కారం ఇవ్వగలదా ఈ సమాజం? దానికి రచయిత్రి—ఈ సమాజం అందుకు సిద్ధంగాలేదనే నమ్ముతున్నట్లు కనిపిస్తుంది.

వయస్సుతోపాటు, స్త్రీ పురుషులకు వాంఛలు, శారీరక కాంక్షలు సహజం. ఆ కాంక్షలను అణచిపెట్టుకొనటం, అసహజం, అన్యాయం, అనవసరం. అణచి

పెట్టుకోని కాంక్షలు సృష్టించే అవరోధాలు పురుషుడికి లేవు. స్త్రీకి ఉన్నాయి. శరీరం పెట్టే తొందరకు సహజంగా ప్రవర్తించిన స్త్రీపురుషులలో ఫలితం యొక్క కర్కశత్వం స్త్రీ ఎదుర్కోవలసినంతగా పురుషుడికి లేదు. ఇది తప్పుకదా! దీనికి పరిష్కారం లేదా? ఇంత అయోమయదశ ఎంతో కాలం సాగవలసిందేనా? దీనికి నిష్కృతి లేదా?

రచయిత్రి పరిష్కారం లేని ఈ సమస్యపట్ల వ్యక్తం చేసిన ఆందోళన అంతింతనరానంత!

వివాహ వ్యవస్థ మనుష్యులు కల్పించింది. అది దైవదత్తం అనటం వీలుకాదు. మంగళసూత్రం చిహ్నం మాత్రమే! వాస్తవం కాదు. స్త్రీపురుష ఆకర్షణ వాస్తవం సహజం. ఒకరికొకరు చేరువ కావటం ధర్మం న్యాయం. అసహజమయిన, కల్పితమయిన మాంగళ్యంతో సహజమూ, కల్పితంకానిదీ అయిన అనంతశక్తిని బంధించాలనుకోవటం, మనిషి దేవుణ్ణి కారాగారంలో పెట్టాలనుకోవటం! దైవభక్తి ఉన్నవాళ్లు దైవస్థితి గుర్తించినవాళ్లు, మానవ చరిత్ర సమస్తం, ఆద్యంతం కూలంకషంగా గుర్తించినవాళ్లు సహితం, మెడలో మంగళసూత్రం లేకుండా పుత్రవతి అయిన స్త్రీని ఎంత చులకనగా చూస్తారు! సహజతను అసహజతతో బంధించి, పరౌనంగా ఉండటం వరౌఖ్యంకాదా? కాకపోదు! అలా సంతానం కలగటంలో మానవులు కల్పించిన హద్దులు అవరోధాలూ తృణీకరింపబడ్డాయి కాని భగవదిచ్ఛ పూర్తిగా పాటింపబడింది. భగవదిచ్ఛను గౌరవించవలసిన సమాజం ప్రవర్తించే తీరు వింతగా వుంటుంది. అలా ఉండవలసిన అవసరం లేదు.

అలా పుట్టిన సంతానం ఇంకోలా పుట్టిన సంతానం కంటే భిన్నంగా చూడబడవలసిన తొందర ఏమీలేదు. ఉండకూడదు. వాళ్ల సంరక్షణ చూడటానికి సంబంధించిన వ్యక్తులకు సమస్య అయితే అది సమాజం చూచుకోవలసిన కార్యక్రమం! దేవుడిచ్చిన బిడ్డలు, మానవుడు నిర్మించిన సిద్ధాంతాలకు అతీతంగా జన్మించినంత మాత్రాన వాళ్లు చులకనగా అగౌరవంగా చూడబడకూడదు. అర్థంపర్థంలేని ఆచార వ్యవహారాలులో బంధింపబడ్డ సంఘం పూర్ణపురోగతి చెందవలసిన అవసరం ఉంది.

ఈ నవలలో లీలామాత్రంగా గోచరించిన ఈ సమస్యను ఈ సోదరి రచయిత్రి భవిష్యత్తులో, పరిపూర్ణంగా ఆలోచించి ఒక చక్కని రచన, ఈ సమస్యకే పరిమితంగా, చేయాలని కోరడమయినది!

నిర్మల పెంచుకొన్నపిల్ల వెళ్లిపోతుంటే నిర్మలతోపాటు పాఠకులకూ దుఃఖం కలుగుతుంది. నెలతప్పిన పసిపిల్ల ఆత్మహత్య చేసుకోవటం దుఃఖం కల్పిస్తుంది.

అనాథ బాలబాలికల సంరక్షణ, నర్సింగ్ హోం నడపటం, స్త్రీసంఘాలు, సభ్యులు కార్యక్రమాలు నవలలో చర్చింపబడ్డవి. అన్నీ చదువుతుంటే స్త్రీ సంక్షేమశాఖ కార్యక్రమాలకు రూపు దిద్దుతున్నట్లు కనిపిస్తుంది.

అసహజంగా సన్నివేశాలు సంభాషణలు చిత్రించటంలో ఈనాటి నవలలు ప్రధానంగా స్త్రీల రచనలు పేరుబడటం అందరికీ తెలిసినదే! కొందరికి సహజాలు కొందరికి అసహజాలు. ఎన్ని కృతకమయిన పాత్రలు, కృత్రిమ సంభాషణలు ఉన్నా చింత లేదు గానీ, ఒక విధంగా అసహజతలోనే ఆనందం పొందే పాఠకులున్నారు గానీ, కన్నూ చేయి లేని వ్యక్తి మిలటరీలో ఉండలేడు. ఉండ నివ్వరు. ఉండే అవకాశంలేదు. ఈ విషయం రచయిత్రి ఆలోచించలేదు అనటంకంటే మిలటరీ జీవితం ఈ రచయిత్రికి ఏమీ తెలియదనటం మంచిది. అందరికీ అన్నీ తెలియవు. తెలియకపోవటం తప్పుకాదు. అయితే తెలియనివి వ్రాయకూడదు. వ్రాయవలసి వస్తే వివరాలు తెలుసుకోవటం అవసరం. అంతకాలం స్నేహం చేసిన కరుణాకరం తన మిత్రుడికి చేయి కన్నూలేవని తెలుసుకోలేకపోవటం వింతకదా!

పురుష ఆకర్షణకు లోనుగాకుండా, నిర్మలంగా జీవించిన నిర్మల, ఒంటరిది. తల్లిదండ్రులు లేనిది, అదుపాజ్ఞల పెట్టే వాళ్లు లేనిది, వయస్సు ఉన్నదీ, సంపద ఉన్నదీ, యువ్వనం ఉన్నదీను. అందుచేత కృత్రిమ జీవితంతో సానదేలింది.

వెంకట్రామయ్య అందరినీ వదులుకొని నిర్మల జీవితం బాగుచేయటం లోకష్ఠమయిన మంచి తనానికి నిదర్శనం.

—మనోరాణి.

## నా య కు రా లు

(నా ట కం)

(రచన: శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ. పేజీలు: 132. వెల. 3 రూపాయలు. త్రివేణి పబ్లిషర్సు—మచిలీపట్టణం—1, మద్రాసు 1.)

పలనాటి చరిత్రని ఆధారంగా చేసుకుని రాసిన నాటకం ఇది. ఈ నాటకానికి శ్రీ పంచాగ్నుల ఆది నారాయణశాస్త్రిగారు విపులంగా పీఠిక రాశారు.

పలనాటిని పాలించిన ప్రభువులలో మొదటి వాడు అనుగురాజు. అతనికి మైలమ్మ, విజ్జలదేవి, భూరమాదేవి ముగ్గురు భార్యలు. అనుగురాజు తనకు సంతానం కలగకపూర్వం బాదరాజును పెంపు తీసుకున్నాడు. బాదరాజు తమ్ముడు బ్రహ్మనాయుడు. తరువాత అనుగురాజునకు మైలమ్మవలన నలగామరాజు, భూరమాదేవివలన కామరాజు, విజ్జలదేవివలన పెదమల్ల, పినమల్ల, బాలమల్లదేవులు జన్మించారు. అనుగురాజు మరణానంతరం నలగామరాజు పలనాటికి ప్రభువయ్యాడు. బ్రహ్మనాయుని తండ్రి దొడ్డనాయకుడు మరణించిన పిమ్మట బ్రహ్మనాయుడు కారణాంతరములవలన నలగామరాజు తమ్ములను, వారి అర్ధ రాజ్యమును తీసుకుని మాచర్లకు తరలిపోయాడు. పలనాడు రెండు భాగములుగా చీలిన పిమ్మట రెండు రాజ్యముల మధ్య శత్రుత్వం పెరగటం దగ్గర నుంచి ఈ నాటకం ఆరంభ మవుతుంది.

మొదటి అంకం మొదటిరంగంలోనే ప్రతాపుడి మాటలలో జననష్టం తప్పదనీ, పాపన్న, కాశీపతుల సంభాషణలో యుద్ధం అనివార్యమని స్పష్టమవుతుంది. మొదటి అంకం మొదటిరంగంలో— నరసింగరాజు, కేతురెడ్డి నాగమ్మను నలగామరాజునకు మంత్రిణిని చెయ్యటానికి ప్రయత్నం చెయ్యటం మంత్రిణిని చెయ్యటం జరుగుతుంది. రెండవఅంకంలో— బ్రహ్మనాయుడు మలిదేవరాజు, మొదలుగాగలవారు సమావేశమై కన్నమదాసుని సేనానాయకునిగా నియమిస్తారు. పాపన్న రాయబారం విఫల మవుతుంది. మూడవ అంకంలో— రాయబారం విఫల మవటంతో నాగమ్మ మాచర్ల నాక్రమించాలనే ఉద్దేశంతో మార్గాలను అన్వేషించటం, కోడిపందాల పథకం వెయ్యటం, మోసంతో బ్రహ్మనాయుణ్ణి ఓడించటం జరుగుతుంది. పాండవుల మాయాజూద పరాజయం అనంతరం అరణ్య, అజ్ఞాతవాసాల నియమం భారతంలో ఎలాంటిదో బ్రహ్మనాయుడు అతని అనుచరులు ఏడు సంవత్సరాలు మాచర్లను వదిలిపోయే నియమం పలనాటి చరిత్రలో అలాంటిది. ఐదవ అంకంలో— బ్రహ్మనాయుడు, అనుచరులు మండాదికి వలస పోవటం, అక్కడి కోయలు, చెంచులతో నాగమ్మ కుయుక్తులు పన్నటం, కోయలు, చెంచులకి బ్రహ్మనాయుని అనుచరులకి మధ్య యుద్ధం జరగటం, ఆ యుద్ధంలో పశువులకాపరి లంకన్న మరణించటం, ఆపైన శ్రీశైల ప్రాంతమైన మేడపికి బ్రహ్మనాయుని పరివారం వలసపోవటం జరుగుతుంది. ఆరవఅంకంలో — నియమానుసారం ఏడేళ్లు గడిచిన పిమ్మట, బ్రహ్మనాయుడు, మలిదేవరాజు, అనుచరులు పలనాడు ప్రవేశించి రాజ్యభాగానికి అలరాజును రాయబారం పంపటం, నరసింగరాజు మోసంతో అలరాజును విషం పెట్టి చంపటం, ఆ పైన పలనాటి యుద్ధంతో ఈ నాటకం ముగుస్తుంది.

మతావేశం, రాజ్యకాంక్ష ఈ రెండూ ఏకమై అలనాటి పలనాటిని శ్మశాన వాటికగా మార్చినాయని చెప్పొచ్చు. నాగమ్మ వర్ణాశ్రమ ధర్మాలను పాటించే పరమశైవభక్తురాలు. బ్రహ్మనాయుడు వర్ణాశ్రమ ధర్మాలను వ్యతిరేకించే వైష్ణవుడు. బ్రహ్మనాయుని పాత్రలో ధర్మరాజు లక్షణాలు, నాగమ్మ పాత్రలో దుర్యోధనుని లక్షణాలు గోచరిస్తున్నాయని పీఠికలో ఆదినారాయణశాస్త్రిగారు పేర్కొన్నారు. జాతీయ భావన, స్వాతంత్ర్యకాంక్ష, జాతి ఐక్యత బ్రహ్మనాయునిలో మూర్తీభవిస్తే— జాతి విచ్ఛిన్నకర శక్తులు, వేరుపాటు ధోరణి, మతోన్మాదం, తన వైయక్తిక సమ్మకం కోసం మానవ మారణ హోమానికి తలపడే రాక్షసత్వం నాగమ్మలో మూర్తీభవించాయి. ఈ నాటకంలో నాగమ్మ పాత్ర చిత్రీకరణని జాగ

త్తగా పరిశీలిస్తే నాగమ్మకు మంత్రి పదవిమీదగాని, రాజ్యాధికారంమీదగాని మమకారం లేదని తెలుస్తుంది. శైవమత ప్రచారం ఆవిడ ప్రధానోద్దేశంగా కనబడుతుంది. బ్రహ్మనాయునికి కూడా రాజ్యాధికారం మీద దురాశలేదు. న్యాయంకోసం మనిషికోసం పోరాడాడు బ్రహ్మనాయుడు. ఇరువర్గాలలోను ప్రధానులనుకునే వారికి రెండుగా చీలటం, వైషమ్యాలు పెరగటం ఇష్టంలేక పోయినప్పటికీ పరిస్థితుల ప్రాబల్యంవలన చీలిక తప్పలేదు. ఐక్యం ఏకైక లక్ష్యమైనా నరసింగరాజు, కేతురెడ్డిలాంటి స్వార్థపరుల కుట్రలలో మారణహోమం జరిగింది. యుద్ధానంతరం బ్రహ్మనాయుణ్ణి నలగామరాజునకు మంత్రిని చేసి నాగమ్మ నిష్క్రమిస్తుంది.

ఈ చారిత్రాత్మక సంఘటనని నాటకంగా మలచడంలో రచయిత అద్భుతమైన ప్రతిభని చూపారు. నాటకీయమైన శైలి శిష్టవ్యవహారికం అవటంవలన ప్రతివానికి సులభ గ్రాహ్యంగా ఉన్నది. పాత్రచిత్రీకరణలోగాని, అంక విభజనలోగాని, సన్నివేశాలను సృష్టించడంలోగాని ఏ లోపమూలేని నాటకం ఇది. శ్రావ్యనాటకంగా మంచి నాటకమయినప్పటి దృశ్య నాటకంగా రాణిస్తుందా అన్నది అనుమానం.

## కళాస్రవంతి : విజయతోరణం

(రేడియో నాటికల సంపుటి)

(రచన : శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ. మూల్యం— ఒక్కొక్క సంపుటి 3 రూపాయలు. త్రివేణి పబ్లిషర్సు, మచిలీపట్టణం—1 మద్రాసు—1.)

మల్లంపల్లి సోమశేఖర శర్మగారు చారిత్రక పరిశోధకులుగా ఆంధ్ర దేశ చరిత్రకి, ఆంధ్ర సాహిత్యానికి అపారమైన సేవ చేశారు. వారు రాసిన కళాస్రవంతి, విజయతోరణం రెండూ చారిత్రాత్మకమైన నాటికల సంపుటాలు.

కళాస్రవంతి సంపుటిలో స్వాతంత్ర్య సముపార్జనము, హంపీక్షేత్రం, విప్లవజ్వాల, తెలంగాణా, శాలివాహనుడు అనే , ఆరు నాటికలున్నాయి. కళాస్రవంతి నాటికలో ధనకటకంలోని బుద్ధ జయంతి ఉత్సవం, కొండవీడు భూపతి కుమారగిరి నాట్యశాస్త్రాభిమానం, విజయనగరంలోని రత్నకూట ప్రసాదంలో రామరాజభూషణుని గ్రంధరచనా ప్రేరణా పేర్కొనబడ్డాయి. స్వాతంత్ర్యసముపార్జనలో వేంగిరాజ్యం మీద చాళుక్యుల ఆధిపత్యాన్ని అంత మొందించిన విక్రమచోళుడి కథఉంది. హంపీ క్షేత్రంలో హంపీక్షేత్రవర్ణన ప్రధానమైనది. విప్లవ జ్వాలలో కుంఫిణి ప్రభుత్వంపై భారతీయుల తిరుగుబాటు సిపాయిల కలహంతో సహా వైఫల్యం చిత్రించబడింది. తెలంగాణా నాటిక చారిత్రక దృశ్య ప్రధానమైనది. ఇందులో ఒకక్కొక్క ఘట్టం మారుతున్నప్పుడల్లా రాబోయే ఘట్టం యొక్క ప్రధానాంశాన్ని కథకుడు ప్రవేశించి వివరిస్తాడు. మొదటి ఘట్టంలో ద్రాక్షారామ భీమేశ్వరు నారాధించే తెలుగువారు కనిపిస్తారు. రెండవ ఘట్టంలో శాతవాహనుల రాజైన హాలునికాలంలో కవిత్వం వర్ణించబడింది. మూడవ ఘట్టంలో శకులు, పహ్లవులు యవనులు మొదలైన వారిని జయించిన గౌతమీపుత్ర శాతకర్ణి ఆంధ్ర రాజ్య విస్తరణం, ఆ కాలంనాటి నౌకా వ్యాపారాభివృద్ధి వివరించబడ్డాయి. నాల్గవ ఘట్టంలో చాళుక్యుల కాలంలో చిత్రలేఖనం, ఐదవ ఘట్టంలో రాష్ట్రకూట భూధవుల పరిపాలన, ఐదవ ఘట్టంలో చాళుక్యుల విజయం, ఆరవ ఘట్టంలో కాకతి గణపతిదేవ చక్రవర్తి కళాప్రియత్వం, ఏడవ ఘట్టంలో తెలంగాణాకు చెందిన మహాకవుల పరిచయం, ఎనిమిదవ ఘట్టంలో ముసునూరి కాపయనాయకుని, సర్వజ్ఞ సింగభూపాలుని పరిచయం, శ్రీనాథ, పోతనాది కవుల పరిచయం, తొమ్మిదవ ఘట్టంలో విజయనగర ప్రభువు రామరాయలుగోల్కొండకోటను ఇబ్రహింనకు అప్పగించటం, ఇబ్రహిం యొక్క కావ్యప్రియత్వం, ఆఖరి ఘట్టంలో గోల్కొండ చివరి కుతుబ్‌శాహ్ తానీషా కాలంలో రామదాసు చరిత్ర వర్ణించబడ్డాయి. శాలివాహనుడు నాటికలో విష్ణుశర్మ అనే బ్రాహ్మణుని పుత్రికకి నాగేంద్రునివలన అతి చిన్న వయస్సులోనే పుట్టడం, అతను విక్రమాదిత్య చక్రవర్తిని జయించటం కథావస్తువు.

విజయతోరణం సంపుటిలో విజయతోరణం, అమరావతి, శంకరాచార్య, నందరాజ్యపతనం, పీష్వా నారాయణరావు, రాణి సారంధా, బసవేశ్వర అనే ఏడు

నాటికలున్నాయి. మొదటి నాటిక ఆరు రంగాలుగా విభజింపబడింది. మొదటి రంగంలో గౌతమీపుత్ర శాతకర్ణి విజయం, రెండవ రంగంలో కాకతి గణపతి దేవ మహారాజు విజయం, మూడవరంగంలో ముసునూరి ప్రోలయ నాయకుని విజయం, నాల్గవరంగంలో కుమార గిరిరెడ్డి వైభవం, ఐదవరంగంలో శ్రీ కృష్ణ దేవరాయల పండితసభ 'భువన విజయం, ఆరవ రంగంలో రఘునాథాభ్యుదయ నాటక ప్రదర్శనం వివరించారు. అమరావతి నాటికలో బుద్ధునిగూర్చి బౌద్ధమత వ్యాప్తిని గూర్చి వివరించారు. శంకరాచార్య నాటకంలో శంకరాచార్య జననం, కర్మ సిద్ధాంతాన్ని వ్యతిరేకించి సన్యాసియై అద్వైత మతాన్ని ప్రచారం చెయ్యటం చిత్రించారు. నంద రాజ్యపతనంలో సుకల్పనందుడు చాణుక్యుని అవమానించటం, చాణుక్యుడు నందవంశ నిర్మూలనం చేస్తానని ప్రతినచేసి మౌర్య చంద్రగుప్తునితోకలసి నందులను నిర్మూలించటం నాటికేతివృత్తం. పీష్వా రఘునాథ రావు భార్య ఆనంది చేతిలో కీలుబొమ్మ అయి పీష్వా నారాయణరావు మరణానికి ఏవిధంగా కారకుడైందీ పీష్వా నారాయణరావు నాటిక విశదం చేస్తుంది. మొగల్ చక్రవర్తి ఔరంగజేబు సార్వభౌమత్వాన్ని అంగీకరించని రసపుత్ర వీరుడైన రాజా చంపతురాయి, అతని రాణి సారంధాల పౌరష విషాదగాథకి రాణి సారంధ నాటకం ఉదాహరణ. వీర శైవంయొక్క ఆవేశం బసవదండనాథుడు కల్యాణపురాధిపతి బిజ్జలుణ్ణి వధించటంతో బుజువవుతుంది బసవేశ్వర నాటికలో.

ఈ రెండు నాటికల సంపుటాలు చరిత్ర ప్రధానమైనవి. ముఖ్యంగా ఆంధ్రుల చరిత్రని కళాత్మకంగా మలచిన రచయితలలో సోమశేఖరశర్మ గారు అగ్రగణ్యులు. ఈ నాటికలు చదువుతున్నంత సేపూ పాఠకుడు ఆనాటి కాలంలో విహరిస్తున్నట్లుగా అనుభూతి పొందుతాడు. చక చకా చదివించ గలిగే శైలి, సూటిగా, స్పష్టంగా సాగిపోయే సంభాషణలు ఈ నాటికలు పాఠక జనాదరణ పొందటానికి అనుకూలమైన కారణాలు. ఆంధ్రుల చరిత్రని కథల రూపంలో చదువుకుందామనుకునే ప్రతివ్యక్తీ చదువ తగిన నాటిక లివి. ఈ కాలంలో ఈ నాటికలని (ధైర్యంగా) ప్రచురించిన త్రివేణి పబ్లిషర్సు అధిపతులు అభినందనీయులు.

# అధికారమూ - అంధత్వమూ

(నవల)

[రచన:—'శ్రీ రాగి'. పేజీలు 256. వెల. 6 రూపాయలు. అనుపమ పబ్లిషర్సు—ఏలూరురోడ్డు—విజయవాడ—2.]

రవి అనే ఒక మధ్యతరగతి యువకుడు ఉద్యోగంలో ప్రవేశించడం, ప్రైవేటుగా ఎకౌంటు టెస్టు, బి. ఎ. పాసుకావడం, చేస్తున్న గుమాస్తా ఉద్యోగం లోంచి ప్రమోషను రాక పిచ్చెత్తి బజార్లవెంటపడటం ఈ నవల ఇతివృత్తం. "ఈనాడు ఉద్యోగరంగంలో అనేకులు సింగరాజు, లింగరాజువంటి వ్యక్తులమూలంగా అన్యాయంగా శిక్షలకు గురవుతున్నారు. పై అధికారులకు అప్పీలు చేసుకుంటే దానిలో న్యాయాన్యాయాలను పరిశీలించేనాథుడు లేడు. క్రింది అధికారులు ఏది వ్రాస్తే దానిని పై అధికారులు గ్రుడ్డిగా ఆమోదించడం జరుగుతున్నది. ఎంతోమంది నిరపరాధులు ఈ రథచక్రాల క్రింద నలిగిపోతున్నారు. ఈ నవలలో అటువంటి సంఘటన ఊహామాత్రంగా చిత్రించబడింది" అన్నారు రచయిత ముందుమాటలో. రవి గవర్నమెంటు ఆసుపత్రిలో గుమాస్తా. అప్పటికతను యస్. యస్. ఎల్. సి పాసయ్యాడు. ఉద్యోగంలో చేరిన తరువాత ఎకౌంటు టెస్టు, బి. ఎ. పాసయ్యాడు. అయితే తన వృత్తిలో తను ఆశించిన ప్రమోషను రాలేదు. దానికి బాధ్యులు సింగరాజు, అతని శిష్యుడు లింగరాజు.

ఈ నవల చదివిన ఏ పాఠకునికి కూడా సింగరాజు, లింగరాజుల మీద ద్వేషంకాని, రవి మీద సానుభూతిగాని రచయిత ఆశించిన స్థాయిలో పుట్టదు. దానికి రెండు కారణా లున్నాయి. సింగరాజు, లింగరాజుల దుష్కార్యాలని పాఠకుల కళ్లకు కట్టేటట్లు రచయిత చిత్రించలేక పోవటం మొదటి కారణం. రవి బాధలకి మానవ సహజమైన బలహీనతవల్ల సింగరాజు, లింగరాజు నిమిత్త మాత్రులుగానే కనిపిస్తారు. రవిని ఆదర్శవంతుడైన కథానాయకుడుగా రచయిత చూపలేకపోవడం రెండో కారణం. సింగరాజు పీడించి లంచం తీసుకుంటే రవి తను అడక్కుండా పార్టీ యిచ్చింది మాత్రమే పుచ్చుకునేవాడు. ఇది అతని

మానసిక ఔన్నత్యానికి, వైయక్తికమైన నీతికి కళంకమేగాని నిదర్శనం కాదు.

ఈ నవలలో ఏ పాత్రకి జీవంలేదు. పాత్ర చిత్రీకరణ మీద రచయిత తగినంత శ్రద్ధ తీసుకొనక పోవటమే దీనికి కారణం. రవి, సింగరాజు, లింగరాజు, ఉమామహేశ్వరం, విశ్వం, ఇతర డాక్టర్లు వస్తూ ఉంటారు., పోతూ ఉంటారు. ఏ పాత్రకి నవలలో ప్రాముఖ్యత లేదు. సంభాషణలు నవలా రచయిత యొక్క ప్రాథమికదశని సూచించడమేకాక కొన్ని కొన్ని చోట్ల వెగటు కూడా పుట్టిస్తాయి. రవి డాక్టరు సర్టిఫికెట్టుకని వెళ్లినపుడు "మూత్రం కూడా టెస్టు చేయించాడు.........ఏమన్నా ఉందా అబ్బాయి అని ప్రశ్నించాడు?" లాంటి సంభాషణలు వెగటుకి ఉదాహరణలు. "అహ్హహ్హా ..... నా కాన్ఫిడెన్షియల్సా! అహ్హహ్హా..... అవి చూడటానికి ఆఫీసర్లకు కళ్లుంటే నా కసలు రివర్సను యెందు కిచ్చేవాళ్లు— అహ్హహ్హా....వాళ్లకి చెవులే ఆధారం అహ్హహ్హా.... కాకారాయుళ్లకు ప్రమోషనిస్తారు. గాని....అహ్హహ్హా... నా బోటివాళ్లకిస్తారా...... డాక్టర్.....అహ్హహ్హా...... మిమ్మల్ని చూస్తే..... అహ్హహ్హా.... జాలేస్తోంది". ఇది రవికి పిచ్చెత్తినప్పటి సంభాషణ. రచయిత పిచ్చి వాళ్లిలా మాట్లాడుతారు అని భావించి రాశాడని పాఠకుడు భావిస్తే తప్పులేదు. నవల ముగింపులో "ఈ విషాదగాథ మీ హృదయాలను కదిలిస్తే విడవండి ఓ కన్నీరు" అంటారు. విడవండి ఓ కన్నీరు అన్న మాట సరైనది కాదు. అంతకంటే విడవండి ఓ కన్నీటిబొట్టు అనికాని, విడవండి కన్నీళ్లు అని గాని అంటే బాగుండేది. లేపాక్షి దేవాలయ వర్ణన కొన్ని పేజీ లాక్రమించింది నవలలో. దీని ప్రయోజనం శూన్యం తరువాత గాజుగ్లాసు పరుగెత్తటం ఒక వింత. గాజుగ్లాసులోనికి ప్రేతాత్మరావడం (పునర్జన్మ ఎత్తకుండా ఉంటే) అడిగిన ప్రశ్నలకి సమాధానా లివ్వడం ప్రత్యేక విశేషం. ఆపైన పుట్టపర్తి శాయి బాబాగారి మహిమలు, వగైరాలు నవలలో కావల్సినంత స్థలాన్ని ఆక్రమించాయి. విశ్వాసాలు వైయక్తిక సిద్ధాంతాలపై ఆధారపడి ఉంటాయి. ఈ సంఘటనలను చిత్రించటంవలన నవలకు వచ్చిన నిర్దిష్ట ప్రయోజనం లేదు. చిత్రించకపోవడంవలన నవలకు అపకారం జరగదు. రవి భార్య హిందీ పరీక్ష పాసయిందని సందర్భ రహితంగా నవల మధ్యలో ఎక్కడో చెప్పి ముగింపులో ఆవిడకు ఉద్యోగం దొరకలేదని రాస్తారు. ఆవిడ ఉద్యోగ ప్రయత్న వైఫల్యాన్ని జెప్పటానికా అన్నట్లు మధ్యలో ఆవిడ హిందీ పరీక్ష పాసయిందని రచయిత రాసిఉంటారని పాఠకులనుకుంటే అది దోషంకాదు. నవల ముగింపులోనున్న ప్రధానమైన లోపం రవికి పిచ్చెత్తడం. ఇది సరైన ముగింపుకాదు. దీనివల్ల సాధించిన ప్రయోజనంలేదు. నవలకి ఏదో ముగింపు ఉండాలి కనుక రవికి పిచ్చెత్తించి నవల ముగిస్తే బాగుంటుందని రచయిత భావించి ఉండవచ్చు. అన్నిటికంటె ఆశ్చర్యం నవల ఖరీదు. ఆరు రూపాయలవటం. శైలీ నిర్మాణంలోను, పాత్రచిత్రీకరణలోను, సన్నివేశాలను సృష్టించడంలోను రచయిత తగినంత శ్రద్ధ తీసుకుంటే ముమ్ముందు మంచి నవలలు రాయగలరని ఆశించవచ్చు.

## అంపశయ్య

(ప్రయోగాత్మక నవల)

(రచన:— శ్రీ నవీన్. పేజీలు: 256. వెల: 5 రూపాయలు. ప్రతులకు (1) సృజన పబ్లికేషన్సు— వరంగల్, 2. (2) నవీన్ 6—3—117 రామగిరి – నల్గొండ.)

తెలుగు సాహిత్యంలో నవలా ప్రక్రియకి కందుకూరి వీరేశలింగంపంతులుగారు వారి రాజశేఖర చరిత్రతో నాంది పలికారని పలువురి భావన. అప్పట్నుంచీ ఇప్పటిదాకా తెలుగు భాషలో నవల విచిత్ర పరిణామాలకి గురవుతూనే ఉంది. నవల ఉద్దేశం జీవితాన్ని సంపూర్ణంగాను, సమగ్రంగాను రూపకల్పన చెయ్యటమే ననుకుంటాను. కథకి, నవలకి ఉన్న తేడా కూడా ఇదే. జీవితంలో ఒకానొక ప్రధాన సంఘటన కథ అయితే అలాంటి అనేకానేక సంఘటనల సమాహారమే ఒక జీవితం అయినప్పుడు తజ్జీవిత రూపకల్పనే నవలగా పరిణమిస్తోంది. కందుకూరిగాని, ఉన్నవగాని వారి వారి రచనల్ని సామాజిక సంస్కరణకి

అభిముఖంగా మలుచుకున్నారు. తరువాత, తరువాత తెలుగు నవల తన పాత తొడుగును విప్పేసుకుని కొత్త రూపంలో సాకాత్కరించటం ప్రారంభించింది. కందుకూరికి, ఉన్నవకి మూఢ విశ్వాసాలు కులతత్వాలు నవలేతివృత్తాలుగా కనిపిస్తే గోపీచెంద్‌కి, కొడవటిగంటికి, రావిశాస్త్రికి సామాన్య మానవుడు నవలకి నాయకుడుగా కనిపించాడు. ఈవిధంగా తెలుగు నవల జీవితంలోని ప్రతికోణాన్ని వెలుపల నుంచి సమీక్షించుకుంటూ ఎదుగుతున్న కాలం ఇది. తెలుగు సాహిత్యానికి వచన కవిత్వం చరమ పరిణామమని ఎట్లా అనుకుంటున్నామో అట్లాగే తెలుగు నవలా సాహిత్యానికి ఈ బాహ్య జీవిత సంఘర్షణ రూపంతో కూడిన ఈ నవల అంత్య దశ అని ఇప్పటి దాకా భావిస్తూ వచ్చాం.

ఫ్రాయిడియన్ సైకాలజి అభివృద్ధి చెందిన తరువాత పాశ్చాత్య నవలా ప్రపంచంలో అనూహ్యమైన మార్పు వచ్చింది. ఈ మార్పుకి మూలపురుషుడు జేమ్సు జాయిస్. జేమ్సు జాయిస్ రచయితగా తన తొలి రచనలైన డూబ్లినీర్సులో కొత్తమార్గం ఏమీ తొక్కలేదుగాని అతని సొంత విధానం A portrait of an young man as an Artist అనే నవలలో కనిపించి, Ulysses అనే నవలలో సంపూర్ణ ఆకృతిని పొంది Finnegans Wake లో ఆ ముద్ర స్థిరపడింది. జేమ్సుజాయిస్ ప్రారంభించిన ఈ కొత్త ప్రక్రియనే Stream of Consciousness technique అంటున్నాం, మనం. జేమ్సు జాయిస్ తరువాత ఈ విధానానికి బహుళ ప్రచారాన్ని తెచ్చిన రచయిత్రి వర్జీనియా ఉల్ఫ్. వర్జీనియా ఉల్ఫ్ రచనలన్నింటిలోనూ మిసెస్ డాలీ గొప్ప నవలగా పరిగణించారు ఆంగ్ల విమర్శకులు. 'Modern fiction' అనే వ్యాసంలో వర్జీనియా ఉల్ఫ్ తన రచనా విధానానికి అనుకూలంగా జీవితాన్ని గొప్పగా నిర్వచించింది. "Life is not a series of gig lamps symmetrically arranged; life is a luminous halo, a semitransparent envelope surrounding us from the begining of the consciousness to the end." ఈ వివరణ ఎందుకు రాయవలసి వస్తోందంటే—మన నవల ఇంతవరకూ వ్యక్తుల బాహ్యసంఘర్షణలను ఒక క్రమంలో చిత్రించటానికి అలవాటుపడిందేకాని వ్యక్తియొక్క Conscious state లోగాని Sub Conscious state లోగాని లోపల జరిగే సంఘర్షణని వాస్తవంగా చిత్రించలేదు. అంపశయ్యలో ఈ పరిణామం కనబడుతోంది. మన పాఠకులకి ఈ విధానం కొత్తగా ఉంటుంది. అంచేత Stream of Consciousness technique ని మనం కొంతవరకైనా అర్థం చేసుకునేందుకు ప్రయత్నించాలి. వర్జీనియా ఉల్ఫ్ technique ని గూర్చి ఐవర్ ఇవాన్సు ఈవిధంగా రాస్తాడు. 'Her method was usally to accept a plot which had a simple outline, but to exploit it with an impressionism which seized upon every detail, however minute and to order these details not in a rational arrangement but as they stream through the mind of one of her characters." ఈ పద్ధతిలో ఓ పెద్ద కథ, కథకి తగిన సన్నివేశాలని సృష్టించడం, తదనుగుణంగా పాత్రలని మలచడం ఒక క్రమమైన ముగింపు ఇవ్వటం ఉండదు. మనిషి Conscious state లో అంతర్గతంగా అనేకమైన ఆలోచన లుంటాయి. ఈ ఆలోచనలకి ఒక క్రమం ఉండదు. ఆలోచనలు అందమైనవి కావచ్చు. వికృతమైనవి కావచ్చు. భయంకరమైనవి కావచ్చు. ఆలోచనలు ఏ వరుసలో వస్తున్నాయో ఆ వరుసలో ఆలోచనలని అక్షరాల్లో పెట్టడం Stream of consciousness technique లో ప్రధానాంశం. మానవుడు అనేక నియమాలకు నిలయమైన బాహ్య ప్రపంచాన్నుంచి వేరై ఏ నియమాలకు లొంగని తన 'లోనికి' తను తొంగిచూసుకోవడం ఈ విధానంలో కనబడుతుంది. Time and Novel లో Mendilow ఇలా అంటాడు. "Today the movement towards greater inwardness in fiction has gone to extreme limits; but there has always been a progression in this direction since the earlist days of the Novel......The technical devices of modern fiction, the changes of convention, the close approximation of the symbols of communication to the

**process they symbolize, the reduction in importance of plot—these are secondary derivatives of the primary quality of inwardness."**

తెలుగులో ప్రప్రథమంగా ఈ టెక్నిక్‌ని ప్రవేశపెట్టింది బుచ్చిబాబు. అతను రాసిన 'చైతన్య స్రవంతి' నూతన రచనా విధానానికి దారి తీసింది. కాని చాలామందికి ఆ మార్గం అగమ్యంగా కనబడింది. ఆ తరువాత దరిదాపుగా అదేమార్గంలో వచ్చిన నవల అంపశయ్య. జేమ్సుజాయిస్‌ని, వర్జీనియా ఉల్ఫ్‌ని తన శక్తిమేర అర్థం చేసుకున్నానని రచయిత ముందు మాటలో చెప్పారు. **Stream of Consciousness technique** లో కొన్ని ప్రధాన లక్షణాలను పాటిస్తూ సామాన్యపాఠకులకు అందుబాటులో ఉండేటట్లు ఈ నవల రాశానని పేర్కొన్నారు. "1963 వ సంవత్సరంలో నేను యూనివర్సిటీహాస్టల్లో ఉంటున్నరోజుల్లో, ఒక హాస్టల్ స్టూడెంటు జీవితంలోని ఒక రోజుని ఇతివృత్తంగా తీసుకుని ఒక నవల రాస్తే ఎలా ఉంటుందన్న ఐడియా నాలో మెదిలింది." అని రాశారు రచయిత ఇంట్రోలో. 63 నుంచి 66 వరకూ నవలను గూర్చి ఆలోచించటం 66 లో నవల రాయటం మొదలుపెట్టి 68 లో పూర్తి చెయ్యటం జరిగింది. అంపశయ్య తెలుగు నవలా సాహిత్యంలో ఒక కొత్త మలుపు. శిల్పపరమైన, భావపరమైన విప్లవానికి నాంది. మరో మహత్తర నవలా ప్రక్రియ ఈ నవలలో తనురూపాల్ని దిద్దుకుంటోంది.

**Stream of Consciousness technique** ఈ నవల ప్రారంభంలో కొంత భాగం, ముగింపులో కొంతభాగం, మధ్యలో అక్కడక్కడా **Flashes** గా కనిపిస్తుంది. అంటే పూర్తిగా నవలంతా ఒకే పద్ధతిలో రాసినదికాదు. ఒక హాస్టల్ స్టూడెంటు తెల్లవారుఝామున నిద్ర లేచింది మొదలు అతని ఆలోచనా విధానం, అతని స్నేహితులతో సంభాషణలు, వారి మానసికావస్థలు, అతని గతస్మృతులు, రాత్రి పడుకునేదాకా జరిగిన సంఘటనల రూపకల్పన, ఈ నవల. నవలలో ప్రధానమైన పాత్ర రవి. రవి కలలోంచి మేల్కోవటంతో నవల ప్రారంభమవుతుంది. కలలోంచి అమ్మ స్మృతిలో నిద్ర లేస్తాడు. మళ్లీ పడుకునేటప్పుడు అమ్మ స్మృతిలోనే పడుకుంటాడు. నిద్రలేచేటప్పుడు తను ఒంటరి వ్యక్తి. పడుకునేటప్పుడు అతనొక సంఘం. వ్యక్తి ఏకాకితనంతో ప్రారంభమైనజీవనం వ్యక్తి సంఘంగా రూపొందటంతో అంతమవుతుంది. ఈ మధ్యలో జరిగిన పరిణామాలన్నీ అతని జీవితంలో కొన్ని గంటలలో మాత్రమే జరిగాయి.

రవి ఒక సామాన్య కుటుంబంలోంచి యూనివర్సిటీ చదువుకోసం వచ్చిన విద్యార్థి. అతని చుట్టూ చిత్రాతిచిత్రమైన మనుషులు, సమస్యలు. యూనివర్సిటీ విద్యార్థులు ఏవిధంగా తయారవుతున్నది, విద్యాదానం చెయ్యవలసిన ఉపాధ్యాయులు విద్యార్థుల్ని ఏవిధంగా అవినీతి మార్గాల్లోకి దింపుతున్నది బాగా చిత్రించారు. పోస్టుగ్రాడ్యుయేటు స్టూడెంట్సుకి క్లాసులు ఏవిధంగా లభిస్తున్నదీ కూడా ఈ నవలలో విశదీకరించారు. కులభేదం, అధికారగర్వం, డబ్బు మదం, ప్రొఫెసర్‌కి, రీడర్‌కి మధ్య కక్షలూ, విద్యార్థులు కాకాపట్టడం, తన రిజల్టుకోసం ప్రక్క విద్యార్థి నెత్తిమీద దుమ్ము పొయ్యటం కళ్లకి కట్టినట్లుగా రూపింప జేశారు రచయిత. జెనివిన్ ఎడ్యుకేషన్ తప్ప ప్రపంచంలోని అన్ని ఈవిల్సుకీ స్థానం మన యూనివర్సిటీస్ అని చెబుతారు.

నవలలో రెడ్డి, శ్రీశైలం పాత్రలు రెండూ ఒక వ్యవస్థకి ప్రతీకలు. రవి, వేణు మొదలైనవారు తత్‌వ్యతిరేక వ్యవస్థకి ప్రతీకలు. ఉండటానికి, లేకపోవడానికి మధ్య సంఘర్షణే, ఈ వ్యక్తుల మధ్య సంఘర్షణ కూడా.

రవి గొప్ప భావుకత-కలవాడు. ప్రతి సంఘటనని విశ్లేషించి ఆలోచించ గల్గినవాడు. అతని ఆలోచన గాఢతనిబట్టి అతని Stream of thought కూడా ఉంటుంది. Stream of thought కి అనుకూలంగా శైలిలో మార్పు వస్తుంది. శైలి విషయంలో రచయిత చాలా జాగ్రత్త వహించారు. కిరణ్మయి పాత్ర రవిని కదిలించిన పాత్ర. కిరణ్మయి తలపు రాగానే అతను వూహాలోకాల్లో మరో ప్రపంచంలో ప్రయాణం చేస్తుంటాడు. రవిలోని శృంగార

భావావిష్కరణకి కిరణ్మయి ఒక సాధనం. కిరణ్మయితో పరిచయాన్ని గూర్చి ఆలోచించుకుంటూ రవి ఇలా అనుకుంటాడు: "కిరణ్మయితో పరిచయం కలలో జరిగినట్లుగా, క్షణంలో జరిగి పోయింది. ఏ పూర్వ జన్మ సంబంధమో, కిరణ్మయిని చూడటంతో తన హృదయద్వారాలు ఒకసారి తెరచుకొన్నాయి. అసలు దయానిధి కోమల్ని గూర్చి అనుకున్నట్లు, మరో ప్రపంచంలో తనూ కిరణ్మయి ఒక్కరే. ఇక్కడెందుకో విడి పోయారు. తను నశించి ఆమెలో ఐక్యం కావా లంటే ఇద్దరూ కైలాస పర్వతంపైనుంచి పారే మంచు నదిలోపడి కొట్టుకునిపోయి హతమవాలి. అందుకే ఈ ప్రయాణం. యెక్కడికో యే హిమాలయపర్వత సానువుల్లోకో, యే నయాగరా జలపాత సమీపానికో, యే మధ్యధరాసముద్రతీరానికో, యెక్కడికో గొప్ప సౌందర్య విలసిత ప్రపంచానికి తనూ కిరణ్మయి తప్ప వే రెవరూ లేని ప్రపంచానికి. ఒకరి హృదయంలో ఒకరు ఒకరిశరీరంలోఒకరు ఐక్యమై ఒక గొప్ప అద్వైత స్థితిని అనుభవిస్తారు. ఆ లోకంలో ఆ లోకం చలం సృష్టించిన పూర్వశి పురూరవులలోకం, కాళిదాసు వర్ణించిన శాకుంతలాదుష్యంతులలోకం, జయదేవుడు వర్ణించిన రాధామాధవులలోకం, అక్కడికి ఆ లోకంలోకి కిరణ్మయితో, గొప్ప సౌందర్యజోతుల్ని వెలారుస్తున్న కిరణ్మయి కళ్లలోకి చూస్తూ కిర ణ్మయి ఒళ్లో సర్వ ప్రపంచాన్ని మరచిపోయి, కిరణ్మయి హృదయం మీద గాఢ సుషుప్తిలో మునిగి, తేజస్సులా క్షణక్షణానికి మారుతూ, వినూత్న కాంతుల్ని వేలా రుస్తున్న కిరణ్మయి శరీరంలో తన యుగయుగాల మూగ బాధని చేర్చుకుని, యెక్కడికో యింకా యింకా దగ్గరగా కలసి, ఒకరె అన్ని రహస్యాలు భేదించి అన్ని లోతుల్నీ శోధించి, అన్ని శిఖరాల్ని సాధించి, ఒంటి జీవంగా కొట్టుకుని, విశ్వరహస్యానికి ప్రాణం పోస్తేనే గాని ఈ హృదయానికి శాంతిలేదు." ఈ నవలలో కిరణ్మయితో రవిఅనుభవాలసంస్మరణ ఒక వచన కావ్యం అంటే తప్పుకాదు. బుచ్చిబాబు మరణంతో ఒకవిధమైన తెలుగు వచనశైలి అంతరిం చిందేమోననే అనుమానం ఉండేది. ఇప్పుడా అను మానానికి ఆస్కారంలేదు. ప్రేమపైత్యంతో, సామా జిక విప్లవం అనే భ్రాంతిలో సోషలిస్టు సిద్ధాంతం ముసుగులో కొనవూపిరితో చచ్చిపోబోతున్న తెలుగు వచనశైలి ఈ నవలలో స్వేచ్ఛగా గాలి పీలుస్తూ స్పష్టమైన రూపాన్ని పొందింది. కిరణ్మయి ఊహ లోంచి బయటపడ్డ రవికి మళ్లీ ఎన్నో జీవిత సమ స్యలు గుర్తొస్తాయి. ఆ సమస్యల్ని ఆలోచించేటప్పుడు అతని ఆలోచనాస్రవంతికి అనువైన శైలి ఏర్పడు తుంది. ఇక్కడ నవలలోని కొన్ని పంక్తులు ఉదహ రించటం ఈ శైలీవైవిధ్యాన్ని విశదపరచటానికే. ఆ రోజు శ్రీశైలం, రెడ్డిలతో సంఘర్షణపడిన తరు వాత రవి పడుకునేటప్పుడు ఆ సంఘర్షణ ఒక సారి గుర్తొస్తుంది. 'రాయక పోయారా మీరూ ఓ మహా ప్రస్థానం' అని రెడ్డి తనని అన్నమాటకి తన ఆలో చనా స్రవంతిలో సమాధానం చెప్పుకుంటాడు. "మిస్టర్ రెడ్డీ రాపేస్తున్నాను నేను ఓ మహాప్రస్థానం నీకు తెలియదేమో. ఈ దేశంలోని ప్రతి పేద వాడూ ఓ మహాప్రస్థానం. చదవటం తెలిస్తే ప్రతి వాడూ ఓ అగ్నిపర్వతం (అయి) ఎప్పుడో అప్పుడు భయంకరంగా. నిప్పులు చిమ్ముకుంటూ నిన్నూ, నీ చుట్టూ తిరిగే ఆల్సేషియన్ కుక్కల్ని (శ్రీశైలం లాంటి వాళ్ళు) నిన్ను భరిస్తున్న సమాజాన్ని, నిన్ను రక్షిస్తున్న పెట్టుబడిదారుల్ని కాల్చి వేస్తాడు కూల్చి వేస్తాడు మసిచేస్తాడు నుసిచేస్తాడు కసితీర్చు కుంటాడు కష్టాల్నికడతేర్చుకుంటాడు. కాచుకో ఆ రోజు వస్తుంది. ఈ రోజులా మొదట చిన్న ప్రవా హంగా, ఈ నాటి మా ప్రవాహంలా మొదలై మహా ప్రవాహంగా ఉత్తుంగ తరంగాలతో నీ మీద విరుచుకు పడుతుంది. నిన్ను ఉక్కిరిబిక్కిరి చేసి నీ నామ రూపా ల్లేకుండా తుడిచి పెడుతుంది. తప్పదు ఆ ప్రవాహం రాక తప్పదు వచ్చింది, ఇవాళ వచ్చింది". ఇలాగే ఆలో చనల వేగాన్ని అనుసరించి శబ్ద పునరావృతికూడాను. కొంతమందికి ఈ శబ్దపునరావృతి విసుగనిపించవచ్చు. కాని పాఠకుడు అక్కడ ఆగి కొంచెం ఆలోచిస్తే అలా శబ్దాలను పునరావృతం చెయ్యడంలోగల ఔచిత్యం బోధపడుతుంది. కిరణ్మయి రవిని పిక్చర్‌కి రమ్మంటుంది. తను వస్తా నన్నాడు. కాని తన దగ్గర డబ్బులేదు. "డబ్బు డబ్బు డబ్బు ఎలా? ఎలా? ఎలా? టిక్ టిక్ టిక్ టిక్" ఒక వైపు పిక్చర్‌కి లైమవుతోంది. తనని పిక్చర్‌కి పిలిచింది

తన ఇన్‌స్పైరింగ్ దేవత. ఆ తొందర అతని మనస్సుని నిలకడగా నిలవనీయలేదు. అంచేతనే అన్నిసార్లు వెంటవెంటనే డబ్బుని బ్రైంని గుర్తుకు తెచ్చుకోవడం. "తాళం వేస్తున్నాడు తీస్తున్నాడు వేస్తున్నాడు తీస్తున్నాడు వేస్తున్నాడు తీస్తున్నాడు తీస్తున్నాడు వేస్తున్నాడు తీస్తున్నాడు వేస్తున్నాడు వేస్తున్నాడు తీస్తున్నాడు తీస్తున్నాడు వేస్తున్నాడు". ఈ పంక్తులు చదివినప్పుడు కూడా కొంతమందికి విసుగు కలగవచ్చు. అలా తాళం వెయ్యటం తియ్యటం ఒక మనిషి అనేకసార్లు చెయ్యటం బుద్ధిపూర్వకంగా కాదు. అలా అతను తాళం వెయ్యటం తియ్యటం వలన అతనికి తెలియకుండానే అతని అంతరాంతరాల్లో ఎక్కడో అణిగి ఉన్న ఒక Craving, satisfy అవుతున్నదన్నమాట. అంటే అతని చేష్ట అతని మానసికావస్థని తెలియజేస్తున్నది. ఈ నవలలో చాలా మందికవులవి రచయితలవి పాదాలు కొటేషన్సు లేకుండా వాడుకోవటం జరిగింది. నవల చదువుతున్నప్పుడు పాఠకునికి ఆ పాదాలు మరొకరివి అనే అనుమానం కలగనంతగా అతికిపోయాయి, కొన్ని కొటేషన్లు (పాఠకుడు తత్కవుల రచయితల రచనలతో, పరిచయం లేనివాడైతే.) మొత్తంమీద అంపశయ్య ప్రయోగాత్మకమైన నవల అనటంలో ఎలాంటి సందేహం లేదు. దీని ప్రయోజనం దీనికున్నది. మనిషి తనలోని మనిషిని చూసుకుని తన్నితను సంస్కరించుకోవటానికి ఈ కోవకు చెందిన నవలలు బాగా ఉపకరిస్తాయి. వ్యక్తి తన ద్వారా తన్ని సంస్కరించుకునేందుకు ప్రయత్నించటం కంటె సాంఘిక ప్రయోజనం మరొకటి లేదు. ఈ నవల ద్వారా రచయిత సాధించ దలచుకున్న ప్రయోజనంకూడా ఇదే.

ఈనాటి యువతరం, విద్యాలయాల స్థితి, రాజకీయపు ఎత్తుగడలు, విద్యార్థులలో స్వైర విహారం చేస్తున్న సెక్సు, కులతత్వాలు, ప్రాంతీయ భేదాలు ఇత్యాదులన్నీ నవలలో చర్చించ బడ్డాయి. ముఖ్యంగా విద్యార్థుల మానసిక స్థితికి, అధ్యాపకుల మానసికస్థాయికి అంపశయ్య దర్పణం లాంటిది. ఈ నవలకి అంపశయ్య అని పేరు పెట్టడంలో జీవితం ముళ్లపాన్పులాంటిదని ధ్వనింప చెయ్యటం కన్నా వేరే సంకేతం ఏంలేదు.

నవలలో నెహ్రూమీద, ఆయన విదేశాంగ నీతిమీద వాదవివాదాలు దీర్ఘంగా ఉన్నాయి. ఈ వాదాలకి నవల ప్రధాన ఉద్దేశానికి ఏం సంబంధం లేదు. చాలా పేజీలవరకూ ఈ వాదాన్ని పొడిగించవలసిన అవసరం కూడా ఏం కనబడదు. నవల చివరి భాగంలో అక్కడక్కడా కొన్ని బూతులున్నాయి. అవి పరిహరింపబడినట్లయితే బాగుండేది. Realism పేరుతో బూతులు రాయనక్కర్లేదు. బూతు అంతా Realism కాదు. రెండో ముద్రణలో రచయిత ఈ అంశాల్ని గమనించగలరని ఆశించవచ్చు. చదవటం వచ్చిన ప్రతి తెలుగువాడు చదివి ఆలోచించదగిన నవల. "The experiments of today in a range of new experience may be prelude to the master pieces of tomorrow."

—టి. ఎల్. కాంతారావు.

## పసిడిపంట

(కర్త: శ్రీ జోస్యము జనార్దన శాస్త్రి. తాడిపత్రి.)

రెండువందల పదునొకండు పద్యములు గల లఘుకావ్యమిది. ఈ కథ రఘువంశమున రఘుమహారాజు కథలో కలిసియున్నది. రఘువు యొక్క దాతృతను లెస్సగా చూపించు కథ కౌత్సునికథ. వరతంతుమునివద్ద చదువుకొన్న కౌత్సుడు గురుదక్షిణను యాచించుటకు రఘువు వద్దకు వచ్చినాడు. అప్పటికే రఘువు తనకున్న దంతయు దానముచేసి తాను మిగిలియున్నాడు. కౌత్సుని కొరకు రఘువు కుబేరునిమీదకు దండెత్త సిద్ధమయ్యెను, కుబేరుడు బంగారమును కురిపించెను. ఆ బంగారము నంతటిని తీసికొనిపొమ్మని రఘువు కౌత్సుని బలవంతము చేసెను. కౌత్సుడు తనకు కావలసిన దానికంటె అధికముగా స్వీకరింప నని నిశ్చయముగా పలికెను. ఆ దాత యెంతవాడో ఈ యాచకుడును అంతవాడు. ఇట్టి రమణీయమైన సన్నివేశము రూపమైన కథేతివృత్తముచేత ఆకర్షింపబడి శ్రీ జోస్యము జనార్దనశాస్త్రి గారీ లఘుకృతిని వెలయించిరి. ఇంతకుపూర్వము కూడ ఈ కథ ఒకరిద్దర నాకర్షించినది వారును ఇట్టి లఘుకృతులనే వెలయించిరి

విద్యా సమాప్తివేళ వరతంతుమహాముని శిష్యులకు స్నాతకోపన్యాస మిచ్చుటను శ్రీ శాస్త్రిగారు రఘువంశ కథకు తమ పీఠికగా సంతరించిరి. వేద వేదాంగ విద్వాంసులైన శ్రీ శాస్త్రిగారు పీఠికా భాగమును రచించుటకు కావలసిన విషయమును తైత్తిరీయోపనిషత్తు శిక్షావల్లి నుండి గ్రహించిరి. ఆ విషయము నాయనయే చెప్పుకొనిరి. ఈ ఘట్టమును స్వయముగా శ్రీ శాస్త్రిగారు కల్పించిరి. మరియు చిట్టచివర బంగారము విషయమున రఘువు కౌత్సుడు వివాదపడుసందర్భమున వరతంతుమహర్షియేవచ్చి ఆ వివాదమును తీర్చినట్లును శ్రీ శాస్త్రిగారు కల్పించిరి. ఇక మిగిలిన కథాంశము కాళిదాసు ననుసరించియే యున్నది. కాని శ్రీ శాస్త్రిగారు కాళిదాసుకథను సముచితములైన వర్ణనలచేత మిక్కిలిగా పెంచిరి.— ఇందు ప్రథమఖండము విద్య సమాప్తియై కౌత్సుడు గురుదక్షిణార్థము బయలుదేరుట. రెండవ ఖండము కౌత్సుని యభీష్టము తీర్చుటకు రఘువు కుబేరుని మీదకు యుద్ధ సన్నద్ధుడగుట. మూడవ ఖండమున కనక వర్షము— రఘుకౌత్సుల వివాదము— వరతంతుని యాగమనము. ఇత్యాది కథ. వరతంతు మహామునిని ఆద్యంతముల యందు ప్రవేశపెట్టి కథను నిర్వహించుట శ్రీ శాస్త్రిగారి ఉపజ్ఞకు నిదర్శనము.

శ్రీ శాస్త్రిగారి రచన సారళ్యమునకు సారళ్యము, ప్రౌఢిమకు ప్రౌఢిమ కలిగి ఉచిత రమణీయముగా నున్నది. మరియు శ్రీ శాస్త్రిగారి వైదికత ఎంత నిర్దుష్టమైనదో లౌకికత అంత నిశితమైనది. వర్తమాన సమాజము పోకడల జాడలను పసికట్టని ఛాందసులుగారు శ్రీ శాస్త్రిగారు. అన్ని విధములను ఈ లఘుకృతి గుణ సంపదచేత అలఘువుగా నున్నది.

తొలినాటను మలిసంజవేళ రవి రాత్రులన్నివు
కాపాడుమీ
తెలవాఱన్ గయికొందునంచు నిడు నా తేజంపు
మేల్సొత్తు లౌ
ప్పులుగా నప్పన సేయ దెచ్చెనన గప్పుంద్రోవ
జన్వేల్పు దా
వెలిగెన్ గౌత్సు డొనర్చు వేలిమికి దాల్మిం
దాల్చి ముమ్మార్తులన్.

శ్రీ శాస్త్రిగారి పద్యము లన్నియు నీ దృశమైన సంప్రదాయ బలము కలిగి నిండుగా నుండుట నీ గ్రంథమున చూడవచ్చును.

— క్షేమేంద్ర.

## మనీషి

(రచన : నండూరి విఠల్, ఎమెస్కో ప్రచురణ; 164 పేజీలు; వెల: రూ. 2)

మనిషికి భవిష్యత్తు తెలిస్తే జీవితం ఎలా ఉంటుందో ఎత్తి చూపిస్తుం దీ నవల. ఉత్తమ పురుషలో కథ నడిపించటంలో సోమర్సెట్‌మామ్ సిద్ధహస్తుడు. ఈ రచయితలోనూ ఆ చక్కదనం, బిగువూ కనిపిస్తున్నవి. పార్థసారథి అందమైనవాడని అందరూ అంగీకరించకపోవచ్చు. కానీ అతనిలో ఓ అవ్యక్తమైన ఆకర్షణశక్తి ఉందంటే ఎవరూ కాదనరు. అందుకనే మోహిని ఆత్మీయునిగా భావించింది. హెలెన్ వలచింది. లింగరాజు భార్య కల్యాణి కామించింది. వైదేహి, సుమబాలలు సారథి పొత్తు కోరారు. సారథికి తాను ఇరవైతొమ్మిదోయేట చచ్చిపోతానని తెలుసు. భవిష్యజ్జీవితంలో జరగబోయే సంఘటనలన్నీ చెబుతూండేవాడంటారు రచయిత. అవేవీ చెప్పలేదు. ఆయుర్దాయం మాత్రం చెప్పాడు. ఇవన్నీ ఎలా చెప్పగలుగుతున్నాడంటే అతనిలో అతీతశక్తి ఉందంటున్నారు. ఆ అతీతశక్తి మహాయోగులకు పరమమూర్ఖులకు మాత్రమే సాధ్యమవుతుందని రచయిత వ్యాఖ్యానం. సారథి మహాయోగికాడు. పరమ మూర్ఖుడూకాదు. అతీత శక్తి ఉందంటే నమ్మ శక్యం కాకుండా వుంది. సారథి మరణంచూస్తే ముందు అలా చెప్పిఉంటంవలన యిలా చేశాడనిపిస్తుంది. కల్యాణి కూడా సారథి ప్రాణం తీసుకోవాలనే ఆ పని చేశాడంటుంది. నిజమే. సారథి మరణం యాదృచ్ఛికం కాదు. బుద్ధిపూర్వకమే. జీవితం దగ్గరపడుతోందన్న తొందరపాటు వుంది. నిలబడలేకపోయాడు. దారం తెగిన గాలిపటంలా పల్టీలు కొట్టాడు. దారిద్ర్యాన్ని, ప్రమాదాలను, అవమానాలను, ఆకలిని, మంటల్ని

కావాలనికోరి తెచ్చుకున్నాడు. అనుభవించాడు. అనుకున్నది చేయగల సంకల్పశక్తి (will power) సారథిలో బలంగా వుంది. అందుకే అన్నీ చేయగలిగాడు. చివరి క్షణాల్లో మళ్లీ లోకాన్నంతా కౌగిలించుకోవాలని, కన్నీటితో తన పాపాన్ని, శాపాన్ని క్షాళనం చేసుకోవాలని తపించాడు. కాని యౌవనంతో ఆత్మహత్య చేసుకునే సౌందర్య వికాసం కలిగింది. ఫలితం ఆత్మహత్య. ఈ నవల చదివితే భవిష్యత్తు తెలియకుండా వుంటేనే మంచిదనిపిస్తుంది. భవిష్యత్తు చెప్పిన మనిషి బ్రతుకు కారుచీకటుల నరకరూపమని నవల కన్నుపొడిచి చూపుతోంది. భాష మధురంగావుంది. చదువ తగింది. రచయిత సాంఘిక వాతావరణాన్ని చక్కగా చిత్రించారు.

## మల్లిక

(రచన : పణతుల రామచంద్రయ్య. ప్రచురణ. ఎమెస్కో. 212 పేజీలు. వెల రు. 2.)

తెలుగులో నవలలు పుంఖానుపుంఖంగా వెలువడుతున్నవి. కాని ఆధునికత స్వల్పం. పాత్రలలో సంఘర్షణ పూజ్యం. మనోవిశ్లేషణ, సామాజిక విశ్లేషణ శూన్యం. పాత్రలు చివరివరకూ కట్టేసిన బొమ్మల్లా వుంటాయి. ప్రతిభావంతులైన వారు కూడా నవలను సీరియస్‌గా తీసుకొనక పోవటం దురదృష్టం.

ఆధునిక నవలకుండవలసిన లక్షణాలు ఈ నవలలో లేవు. బాల్యం నుంచి వర్ణించటం పాతకాలపు పద్ధతి. పాత్రలు ఆధునికమైనవి. వెంకటరామయ్య, అనసూయమ్మలకు ఒక కొడుకూ, కూతురూ. తండ్రికి కూతురంటే యిష్టం. తల్లికి కొడుకు మీద అభిమానం. కొడుకు లక్షణంగా చదువుకుని సహాధ్యాయిని శారదను ప్రేమించి పెళ్లి చేసుకొంటాడు. అతిగారాబంగా పెరగటం వలన కూతురు మల్లిక తండ్రి ఆశల్ని అడియాసలు చేసింది. మల్లికకు అన్నయ్య మీద అభిమానమున్నా వదినంటే ద్వేషం. ఇంటిలో మల్లిక ఒంటరిదై పోయింది. అందకని బయట కలుపుగోలుతనం ఎక్కువైంది. నాటకాలలో వేషాలు వేసింది. గోపీనాథ్‌తో పరిచయం ముదిరి కలియటం. గోపీనాథ్ భార్య చనిపోయాక పెళ్లి చేసుకుందామనుకుంటే అందలేదు. ఒకప్పుడు నారాయణను ప్రేమించింది కానీ, అతడు దూరమయ్యాడు. వాడు దగ్గరకు వస్తే ఆమె యిష్టపడలేదు. మల్లిక మనస్సులో లేచిన అడ్డుగోడలు తొలగిపోయాక వదిన శారదకు సన్నిహితమయింది. తన భవిష్యత్తును ఆమెపై వుంచింది. వివాహానికి యిష్టపడింది. తండ్రి గారాబంవల్ల పెరిగిన అహంకారం, అధిక్యతాభావం ఆమెను వక్రమార్గం పట్టించాయి. గోపీనాథ్ పరిచయంతో ఆమె అహం నశించింది. గోపీనాథ్‌లో సంఘర్షణ వుండటంవలన జీవితానుభవాల ఆధారంగా ఉన్నతుడవుతూ జీవితాన్ని మలుపు తిప్పుకొని ప్రశాంత జీవనపథాన్ని అందుకోగలిగాడు, సర్వధర్మాలను పరిత్యజించి. మల్లికలో ఆ సంఘర్షణ లేదు. గతాన్ని మరచిపోయి రాజీపడి వివాహాన్ని స్వీకరించింది. కథ ఒడుదుడుకులు లేకుండా సాఫీగా సాగిపోయింది. కథలో శిల్పవిన్యాసం లేదుగాని శైలీ విన్యాసం వుంది. ఒకసారి చదవవచ్చు.

—శివకుమార్.

## నేను

శ్రీమతి వల్లభనేని రంగనాయకమ్మ వ్రాసుకొన్న ఆత్మ కథ. పుటలు—86. వెల లేదు. ప్రాప్తి స్థానం: ప్రజా ప్రచురణలు, ఏలూరు.

దీనిని రచయిత్రి రసవంతంగా, ఆధునిక ఆంధ్ర కవుల కవితలు తరచుగా ఉదాహరిస్తూ జీవిత సంఘటనలను వర్ణించారు.

## పర్జన్యము

పద్యకావ్యం రెండవభాగం. రచయిత: శ్రీ సురగాలి తిమోతి జ్ఞానానందం. పుటలు— 60. వెల: రు. 1-50. ప్రాప్తిస్థానం: శ్రీ ఎస్ టి. జ్ఞానానందం, తెలుగు పండితులు, మెక్లారిన్ హైస్కూలు, కాకినాడ.

## శ్రీ సత్యసాయి భగవల్లీలానుభూతులు

పుష్పలీల, శబ్దలీల, స్పర్శలీల, రూపలీల, రసలీల, గంధలీల, జ్యోతిర్లీల—అనే అంకాలతో నడిచే నాటకం. ప్రథమభాగం. రచయిత— శ్రీ ఉప్పాడ రాజారావు, పుటలు: 50. వెల—రెండున్నర రూపాయలు: ప్రాప్తిస్థానం—మేనేజరు. సనాతన సారథి, ప్రశాంతి నిలయం, బుక్కపట్నం, అనంతపురం జిల్లా.

## పశుపక్షి వ్యాధులు

హోమియోపతి, టిస్యూ ఔషధ చికిత్సా గ్రంథం. రచయిత: శ్రీ వేమవరపు వేంకట రమణశర్మ. పుటలు, 284. ప్రాప్తిస్థానం: విజ్ఞాన ప్రచార నిలయం, కొత్తపేట. గుంటూరుజిల్లా.

## విందు భోజనం

పిల్లల కథల సంపుటి. రచయిత— శ్రీ కలువకొలను సదానంద. పుటలు—84. వెల:—రెండు రూపాయలు. ప్రాప్తిస్థానం: విశ్వప్రభ ప్రచురణలు, వేంగ్రడగుంట, చిత్తూరుజిల్లా.

దీనిలో పిల్లలకు వినోదం కల్పించే విందు భోజనం, విడిచివచ్చిన వస్తువు, రాచబిడ్డ, ముక్కుపుడక, దొంగుడు మూతలు, మంచి నక్క, కానున్నది, చెరుకాడు, మేడిపండు, బహుమతి, భక్తుని కానుక, వాసన, భూతం అనే కథలు సచిత్రంగా ఉన్నాయి.

## మహాత్మాగాంధీ జీవితకథ

పిల్లల బొమ్మల గాంధిజీ కథ. రచన, బొమ్మలు— శ్రీయుతులు ఎస్. డి. సావంత్, ఎస్. డి. బాదల్కర్. పుటలు—48. వెల. రు. 2—50. ప్రాప్తిస్థానం— కేంద్ర ప్రభుత్వ ప్రచురణశాఖ, డైరెక్టరు, పాటియాలా హవుస్, న్యూఢిల్లీ—1

## సాహిత్య రత్నావళి

ఆంధ్ర కవితా రీతులు, రసపరిప్లుతంగా రామకథ పల్కిన కమనీయ కవికోకిల వాల్మీకి, భర్తృహరి— అనే వ్యాసాల సంపుటి. రచయితలు—శ్రీయుతులు పన్నాల వేంకటాద్రిభట్టశర్మ, పోచిరాజు శేషగిరిరావు, క్రొర చంద్రశేఖరశాస్త్రి. పుటలు—60. వెల— 1—50. ప్రాప్తిస్థానం: శ్రీ మైలవరపు రంగారావు, కార్యదర్శి, విజ్ఞానమండలి, శ్యామల్‌కోట, తూర్పు గోదావరిజిల్లా.

## స్తుతి కదంబము

రామకృష్ణ పరమహంస, వివేకానంద, శివానంద, రాంలాల్, తులసీదాస్, పరమానంద్, రవీంద్రనాథ టాగోర్‌ల ప్రార్థనల అనువాద కదంబం. ఎడమవైపు ఆంగ్లం, కుడివైపు తెలుగు కవితలు. అనువాదకుడు—శ్రీ బి. ప్రహ్లాద. పుటలు—56. వెల: తెలియదు. 1965 లో భారత పాకిస్తాన్ సంఘర్షణలో వీరమరణంపొందిన లెఫ్టినెంట్ శ్రీ కసిరెడ్డి బలరామరెడ్డి ఆత్మశాంతికై ఈ ప్రార్థనలు అనువదించబడ్డాయని రచయిత తెలిపారు. ప్రాప్తిస్థానం—శ్రీ బి. ప్రహ్లాద, సంస్కృత పండితుడు, జిల్లా పరిషత్ హైయర్ సెకెండరీ స్కూలు, రాజంపేట.

## ఖైది

ఖండ కావ్య సంపుటి. రచయిత—శ్రీ బొడ్డు ప్రకాశం.పుటలు—110. వెల—రెండు రూపాయలు ప్రాప్తిస్థానం—శ్రీ బొడ్డు ప్రకాశం, రిటైర్డ్ తహసీల్దారు, కోబాల్డు పేట, గుంటూరు—2

## శ్రీ శతకంద హనుమస్తవం

కంద పద్యాల హనుమత్ స్తుతి శతకం. రచయిత—శ్రీ కామవరపు రామకృష్ణమూర్తి. పుటలు: 30. వెల: తెలియదు. ప్రతులకు— శ్రీ కామవరపు కృష్ణమూర్తి, ఇంజనీరింగ్ డిపార్ట్‌మెంటు, హిందూస్తాన్ షిప్ యార్డ్, గాంధిగ్రామ్, విశాఖపట్నం 5.

---

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7, Thambu chetty Street Madras-1. Editor :- S. Sambhu Prasad.